# ఆంధ్ర నాటక పద్య పఠనం



భమిడిపాటి కామేశ్వరరావు

To

Guru Dev



**O. J. Couldrey Esq., M. A. (Oxon.)**

**Retd. Principal, Govt. Arts College, Rajahmundry,**

*a casual remark made by whom*
*in the lecture room converted me*
*to my mother - tongue,*

*I,—*

*with his kind permission*
*most worshipfully*
*Dedicate,*
*this humble life's work of mine*
*—his old student.*

*B Kameswara Rao*



**B. Kameswara Rao**

*Student, B.A. Class – Age 20*

I offer my hearty thanks to our beloved Principal, O. J. Couldrey Esq., who kindly complied with my request to permit me to dedicate this work of mine, 'Delivery of Andhra Dramatic Verse', to him, and who affectionately blessed me and my work. I am also obliged to Sri Yelury Venkata Rao of the Venus Studio, Rajahmundry, who carefully reproduced the letter of our old Guru Dev, published herein.

In his letter Sri Guru Dev writes he remembers rather that he had remarked: 'Your poetry is no *separate* art.' True. That is what I remember too, and what exactly I wrote in the book (p. 1. l. 16). But in my letter to him, I wrote that he had remarked: 'Your poetry is no art'. This version of mine in the letter is inexact. Bowing to Guru Dev's memory, I apologised to him. I assured him that I had represented him truly to the public, for in Section I of my book referred to above, I used 'Pratyeka Kala' which means 'separate art.'

Rajahmundry
25-9-1957

B. KAMESWARA RAO

(TRUE COPY OF THE LETTER)

10th Sep. 1957

3 St. Michael's Avenue,
Abingdon,
Berks
ENGLAND

Dear Mr. Kameswara Rao,

It is with real pleasure that I accord you the permission for which you ask, that you should dedicate your work on the Delivery of Andhra Dramatic Verse to me. But I should like to believe that my remark in the lecture room to which you refer was not quite so absolute as it appears to stand in your recollection. Perhaps I said that your poetry was not a *separate* art, giving my reason for this opinion very much as you remember it and report it in your letter. As to my tentative criticism of the usual delivery, I should of course have been wiser to refrain from hazarding even a guess on the difficult subject. During all my time in India, no one was able to make me clearly understand what the nature and function of the ragam is, or whether it was liker to what we call a scale or to what we call a tune. This no doubt was due to vagueness and uncertainty of the usual translations of the technical terms involved. More over I found English books on the subject eqally unenlightening. I wish Fox-Strangway's book, published I think in 1914, had come my way. I haven't studied it even now but I have Popley's little book in the Heritage series which is largely based on it and moreover is particularly attentive to the southern custom. This would have been a priceless boon if I had had it in time to enjoy living examples in the light of its explanations.

I was very much interested in the summary which you give me of your treatise and in the account of your active and versatile career and its bearing on the subject which you have chosen to write about. I feel sure that your experience and your literary endowments have eminently fitted you to write of it with authority and charm. For the rest, the news which you give me of my friends was very kindly thought of. I hope that the book which you regard as your life's work will have all the effect which you desire, and all the acclaim, which I feel sure, that you deserve. With every good wish from your old teacher,

(Sd) OSWALD COULDREY

# పీఠిక

ఈ సంపుటంలోని 2, 8, 9, 10, 12 అనే సంఖ్యలుగల శీర్షికల కింది వృత్తాంతం మాత్రమే 1924 సంవత్సర పూర్వపు రచన. తక్కిన శీర్షికలకింది సంగతులు తరవాత తరవాత వెలిసిన రకం.

సంగీతనటుడు నాటకపద్యాన్ని రాగిస్తూ నటించేటప్పుడు మూడు కళల డొంకలు కదుల్తాయి. పద్యానికి ఉంటూండే సహజగమనం సంగతి విస్మరించి, అన్యవ్యక్తిత్వం గల రాగం — తాను విన్నంత కన్నంత, తనకి తెలియవచ్చినంత — అన్యుడై ఒప్పవలసినవాడు తెచ్చి పద్యానికి సంధానం చెయ్యడం అనేది ఒక సమస్య. ఈ సమస్య నాకు ఎంతో ఆరాధ్యం అయింది. ఆంధ్ర రచనల్లోని పద్యసంభాషణ ఘట్టాలు పాఠం చెయ్యడం, పద్యరూపంలో ఉండగల భావాల్ని గుర్తించి, మన్నించి, మెచ్చి, ధరించి, అవసరం చొప్పున వాటి సహజగమనంతో వాటిని పఠించి సంఘానందం జనింపచెయ్యడం, మొదలైన మేళ్ళు నాకు ఇందువల్లే కలిగాయి.

ఈ గ్రంథంయొక్క చదువర్లు నా అభిప్రాయం స్పష్టంగా గ్రహించుకోగలగడానికి వీలైనంత విశదంగా రాయడానికి నేను యత్నించాను. 'మానవుల అభిప్రాయాలలో వైవిధ్యమే సాధారణ లక్షణం' గనక చదువర్లలో చాలమంది నా (సారాంశ) అభిప్రాయంతో ఏకీభవించకపోవచ్చు. కాని, వాళ్ళు నా అభిప్రాయంయొక్క త్రికరణశుద్ధి గమనిస్తే చాలు నాకు. ఒక సంప్రదాయ ప్రవాహానికి నాది ఎదురీత అయినా, ఈ క్రింది భావాలవంటి వాటిలోని యాథార్థ్యం నేను విశ్వసించేవాణ్ణి అవడంచేత, ఈ గ్రంథం ప్రకటించడానికి సాహసిస్తున్నాను :

"ఎవడేనా ఒక కొత్త నియమం ప్రతిపాదించాడనుకోండి. ప్రజాభిప్రాయం విధిగా అందుకు ప్రతికూలమే." (రీడ్)

"సత్యాన్వేషణ మానవుని ఉత్కృష్టతమ కృషి. దాని ప్రకటన మానవుని విధాయకకృత్యం" (స్టియేల్ సతి)

"యథార్థ తత్త్వం దేనినీ కొత్తగా సృష్టించదు, ఉన్న దానినే స్థాపించి వక్కాణిస్తుంది." (కజిన్)

. "ఒక సత్యం ఎవడైనా గ్రహించడానికి ఏడేళ్ళపాటు దీక్షతో కూడిన పరిశోధన అవసరం. కాని, దాన్ని తన సాటిమానవులు అవగాహన చేసుకోగలగడానికి అతడు అవలంబించవలిసిన విధానం అతడు నేర్చడానికి పధ్నాలుగేళ్ళు అవసరం." (ప్లేటో)

"ఒక కవిరచన నేను చదివి, అందులోని అభిప్రాయం నాకు అనుగుణం అయితే, ఆ కవి అద్భుతమైన రచన చేశాడంటాను. కాని, ఆ అభిప్రాయం నాకు ప్రతికూలించితే, ఆ కవి తప్పుడు రచన చేశాడని వ్రాక్కుచ్చుతాను." (స్విఫ్ట్)

"సత్యాన్వేషణ చేసేవాడికి ఒక దేశమంటూ ఉండకూడదు." (వోల్టేర్)

ఈ గ్రంథాన్ని వాత్సల్యంతో ఆశీర్వదించిన గురువరేణ్యులు శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారికిన్నీ సౌహార్దంతో పరిచయ పరిచిన ఇష్టులు శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారికిన్నీ నమస్కృతులు అర్పిస్తున్నాను.

శ్రద్ధతో దీనిని ముద్రించి ప్రకటనకి వేగిరపడిన శ్రీ సరస్వతీ పవర్ ప్రెస్సువారికి కృతజ్ఞత.

రాజమండ్రి
24 – 8 – 1957

తమిడిపాటి కామేశ్వరరావు.

ఆశీస్సు

ओम्

श्री रामायनमः

भोः हास्य ब्रह्मन्! चिरंजीव! सुखीभव!

ఆశీరాద్యుపరి. తమరు నాకు బంపిన 'ఆంధ్రనాటక పద్యపఠనం' అను తమ హృద్యగద్య ప్రబంధము నాకంది చిరకాలమయినను, తదుపరి తమరు వ్రాసిన కార్డు కొంతతక్కువ చిరకాలమున కందినదయినను, మరల తామంపిన కార్డు అంది పై రెంటికంటె తక్కువ చిరకాలమయినను, నాకందిన పై మూడును తటాకమృత్తిక శ్మశానమృత్తిక మున్నగు నిర్వీర్యౌషధములవలె నాయీడునకు సంబంధించి, గల్గిన శక్తిదౌర్బల్య జాడ్యమును మాన్పలేకపోయెను. కాని, మొన్న శనివారము నాటి తమ తంత్రీవార్త,

శ్లో॥ సాధ్యాసాధ్యరుజో నిహన్తి తరసా త్రైలోక్యచింతామణిః

అని, వర్ణింపఁబడిన త్రైలోక్య చింతామణివలె నాతత్త్వానికి చక్కగా పనిచేసినది. వెంటనే సర్వవిధ జాడ్యములు నిర్మూలములాయెను. వైటాలిటీ ద్విగుణిత మాయెను. చురుకుఁదనము త్రిగుణిత మాయెను. ఆక్షణము మొదలు నేటి పోస్టల్ టైమువఱకు, రోజునకు 8 గంటలచొప్పున 24 గంటలు మీ గ్రంథమును తదేకదృష్టితో చదివి, యేదో యొకరేవుపట్టి అద్వైతి బ్రహ్మనై యీజాబు వ్రాయగల్గితిని. ఆలస్యమును క్షమింపుఁడు. ఇన్నాళ్ళు మీ గ్రంథమును చూడలేదను [illegible]కోకండి. మా తాతకు భోజనం కాగానే వెంకిలపడుకొని ఒక చిటికెడు [illegible] యోవాడు.

అటులనే, నేనును వేపడపు కందిగింజలకంటె కమ్మతనంగల మీగ్రంథ మును రోజూ కొంచెం కొంచెం నమిలి నిద్దురపోయేవాడను. ఇది మధ్యాహ్నభోజనానంతరమే. మఱి రాత్రికి లేదు. ఏకభుక్తమే. అటుల కొంచెంకొంచెంగా మీవేపడపు, గద్యకావ్యాన్ని ఆస్వాదించు టకు కారణములు, ఓపికలేమి ఒక జాడ్యము. ద్విజిహ్వావేష్టిత చందన తరువున్వలె విలక్షణ ధ్వన్యాచ్ఛాదిత మాధుర్యమును, మీగద్యము నుండి త్వరత్వరగా గ్రహింపఁజాలు మదిలేమి, రెండవజాడ్యము. ఈరెంటిలో రెండవదే మొదటిదీ, మొదటిదే రెండవదీ అనుకోండి ఈరెండుజాడ్యములనూ మొన్నటి మీటెలిగ్రామ్ చింతామణి రూపు మాపినది. మీకందిపప్పురుచి బాగా చవిగొన్నాననుకొనుచున్నాను. ఈవ్రాసిన లేఖ మీకు కర్ణారుంతుదము కాదనుకొనుచున్నాను. 13 ప్రక రణములను మూడేసిమార్లు మీచింతామణి మహాత్మ్యమువలన చదువ గలిగి సారగ్రాహినై తినిగదా! యని లోలోన నవ్వుకొనుచున్నాను. 1939 సంవత్సరపు ఉపన్యాస సంగ్రహంలోని చరమాక్షరము వఱకూ నాసిద్ధాంతమేగదరా? అనుకొనుచున్నాను. మీరిపుడు నన్నుచూచి నచో, ఈముసలివాడు ఇంతపని చేయగలుగుటకు నామందేకారణ మయినద్ది గనుక నేనెంత వైద్యుడనోగదా? అని మిమ్ము మీరే కొనియాడుకొనక పోరనుకొనుచున్నాను. మీశక్తి మీకు తెలియ కుండుటచే, మీరు పైవిధముగాననుకొనలేక పోయిననూ, నేను మాత్రం మీకు, "టానిక్ వైద్యశిఖామణి, సర్వనాటక విశిష్టతా సంరక్షక భిషగ్వర మూర్ధన్య, ధన్వంతరి ప్రపితామహచక్రవర్తి సార్వభౌమ" ఇత్యాది బిరుదులను (ఇది ఇన్‌ల్యాండు కవర్ కావటం చేత స్థలం చాలక ఆక్షిత్తినిగాని, లేకుంటే, ఇంకనూ నాలుగైదు ఫర్లాంగులపొడవు గల బిరుదావళిని కూడ) ఈయక తప్పను. మీరు వానినన్నిటిని గ్రహింపఁడ నన్ను గ్రహింపుడు. "వేపడపు, పదమును గద్యమునకు

తగిలించితిరే, ఇది సాధుప్రయోగమేనా," అని మీకుగాని ఇతరులకు గాని తోచవచ్చును. శ్లో॥ "ప్రాయేణ వైయాకరణాః పిశాచాః" అను న్యాయప్రకారం, శ్రీ కీర్తిశేషులయిన జయంతి రామయ్యపంతులుగా రిచ్చిన ప్రయోగమే మనకాధారం. వారొకపుడు నాగద్యపద్యములకు, "వేపడపుపద్యాలు, వేపడపుటుపన్యాసాలూ కాశీ కృష్ణాచార్యులగారి సొమ్మూ" అని ప్రయోగించారు.

ఈ గ్రంథోత్పత్తికి పూర్వమే మీకూ, శ్రీ కవితాకన్యకూ సంబంధ బాంధవ్యాలేర్పడక పూర్వమే, కోర్టుషిప్ డేస్‌లోనే, సుమారు 40 ఏండ్ల క్రిందనే, ఈ గ్రంథ మావిర్భవించుటకు శ్రీ కూర్మాదొర గారు మూలకారణము, అని గ్రహించితిని. ప్రపంచావసరమగు నిట్టి యపూర్వ గ్రంథమునకు నిమిత్త కారణమగు పై దొరగారు నా కెక పడితే మెన్నో ఆశీస్సుమములను దొరగారి క్రాపింగు పైడ్డుమీద గుప్పించి యుందును. నెత్తిపై నిల్వకపోతే గోదులోమునుంచి మరీ గుప్పియుండేవాణ్ణే! నేను 40 సంవత్సరముల క్రిందటినాటి సభలో సభ్యక్షునిగా నున్న పిమ్మట (యెక్కడనో జ్ఞప్తిలేదు) ఒకపుడు మీనోట సుమారు 500 వివిధ పద్యపాదములను వెనుకంజ వేయక మీరు నాకు చదివి వినిపించినారు. పదస్వరసత, ఝుటితి కవిభావ స్ఫూర్తి, కవితలోని మెఱుగులు, బహిరంతస్ఫురద్రసములు అన్నియు వెంటనే నాకు తెలిసినవి. పద్యవైశిష్ట్యముచూపు పద్ధతి తోపించితిరి. పద్యమునకు నిరక్షర కుక్షియగు రాగిగాడు తగిలించిన రాగము, పాయసమునకు కెసనాయిలు తగిలించుట వంటిది. అక్షర ముఖుడగు రాగిగాడు కొంచెం రాగం అంటిం పద్యం చదివినను (అక్షరాస్యుడుగాన) పద్యమును చంపివేయడు. 'ఎవరని నిర్ణయించే దిరా,' — ఇది కీర్తన — రాగ, తాళ, పల్లవి, అనుపల్లవి, ఇత్యాది నియమములు కలది. దీనిని, ఎవరు — అని — నిర్ణయించేదిరా, అని

చదివినచో ఆకీర్తన ప్రాణములు కోలుపోయినట్లే. 'కుందనమువంటి మేను' — ఇది పద్యము. దీనిని, కుం౦౦౦, దనము, వం౦౦౦, టిఇఇమే, నుడుడుడూ ... అని కీలుకీలూ మేకులు రివెట్ చేసి నడిపితిమా ? నమ్ముట యెక్కడిదీ! చచ్చినకుక్కను త్రాడుగట్టి కుక్కలరామాయ యీడ్చుకపోయినట్లీడ్చుకోపోవుటే. కావున, నాటకములు, నాట్యములు, పద్యములు, గద్యములు, కీర్తనలు, మున్నగు ప్రత్యేక విశిష్టతగల పదార్థములను, నానివాని ప్రత్యేకవిశిష్టతను సాంకర్యములేకుండా శుద్ధముగా వినుచుటగాని చూపుటగాని సరసవిద్వచ్ఛిరోమణులకు ఆవశ్యకము. అట్టివారికే, వినిగాని చూచిగాని యానందించి కవి, వాగ్గేయకార నట ప్రభృతుల ప్రతిభాస్వరూపము నుగ్గడించుట యావశ్యకము. ఇతరులకు ఇట్టి యావశ్యకములను విధింపను. శ్లో॥ అప శబ్దభయంనాస్తి అప్పశాచార్యసన్నిధౌ — అన్నట్లు, ఎటులయినను నాకు సంతసమే.

నేను ఆశీస్సును కోరితే ఈచేటభారత మేమిటండోయి? — అని, మీరు నన్నడుగుదు గేమో! అడుగవలదు — అభిప్రాయ, లేక, ఆశీః, దాత, గొప్పవాడయి నపుడే ఆగ్రంథమునకు తత్కవికిగూడ గౌరవము. బిరుదావళివిరాజమానుడిచ్చిన యే పిచ్చివ్రాతయయి ననూ విలువకలదు. తెలిసిగాని తెలియకగాని బిరుదముల నిచ్చుటయు తెలిసీ తెలియని వారు పుచ్చుకొనుటయు ఇపు డాచారములలో నున్నవి. నావిషయములో నొక మైలు పొడవుగల బిరుదావళి కలదు. కీర్తిశేషులు సరస కవితావధానాది శకక రత్నైన తిరుపతి వేంకటకవులు 'అవధాని శిరోమణి కృష్ణయాగ్రణీ' గీ॥ 'శిష్టుకృష్ణమూర్తి శేఖరునకు నిన్ని శక్తులున్నవంచు జగమెఱుంగు నిప్పుడు కాశీ కృష్ణుడేదక్క నిన్నిట నేర్పుగల్గువాడు నిండుసున్న' — అని పల్కిరి.

పిమ్మట విద్యావారి ధీత్యాదు లుత్తరదేశమున నాతలనంటినవి. ఈబిరుదులు వడగళ్ళవాన, గాలిదుమారములవలె మనుజుని విడవు. అటులే నా యాశీస్సులును. ఇవి మీకును గ్రంథమునకునూ గౌరవప్రదమని నమ్మెదు.

అసలు ఈబిరుదములన్నియు నాకిష్టములేదు. వానికి తగనని నా విన్నపము. కూలంకషంగా నాస్వరూపము నెఱిగి ఈయఁబడినవి గావు. నిజమయిన నాబిరుదము నాకే తెలియును. దానిని నాకు నేనే యిచ్చికొనవలె. పుచ్చుకొనవలె. 'అద్వైతి బ్రహ్మ,' లేక, 'అద్వయవాది బ్రహ్మ' — ఈరెండు బిరుదులకు నే నర్హుడను. మొదటిది నిర్గుణ — నిర్విశేష — నిర్ధర్మిక బ్రహ్మ. రెండవది (శూన్యం). లోకరీత్యా, శుద్ధ బ్రహ్మంతవాడనగు నేనిచ్చిన అభిప్రాయము గనుక, మీకును మీగ్రంథగౌరవమునకును లోటులేదు. టెలిగ్రామ్ ఖర్చుకు ఒకటో రెండో మీరుపెట్టిన డబ్బుకు దండుగలేదు. భారతీయులకు చతుష్షష్టి కళలున్నవని కింవదన్తి. కాని మ॥ రా॥ ఆచంట లక్ష్మీపతి గారి 'ఆయుర్వేద శిక్ష' అను గ్రంథముననో మఱెక్కడనో, అయిదాఱు రకాల చతుష్షష్టి కళలు మనకున్నట్లుగా నేను చూచాను. గ్రామ్య భాషలో అందముగా గద్య పద్యాదులు వ్రాయుట ఒకకళ. అదేమిటి దేమిటి చౌర్యమొకకళ. తుదకు పొడుముకూడా ఒక కళయే. దానిని తయారుచేయుట — పొగాకు తత్త్వజ్ఞానం — పొడుం పీల్చుట — ప్రక్కనున్నవారు అసహ్యపడకుండా — నస్యసారపు చిన్న తుంప్రరైనా, యెటూ చెదరకుండా కరవస్త్రంలోగాని, జేబురుమాల్లో గాని మాయంచేయుట — ముక్కుబెజ్జములను రహస్యంగా శుద్ధిచేసి తిరుచూర్ణముల జంటవలె నుంచికొని శ్రావ్యమగు అనునాసిక ధ్వనితో సరససల్లాపములతో మాట్లాడుచు నెదుటివారిని ఆనంద సముద్రంలో నోలలాడించుట — మున్నగు బహువిశేషములతోకూడిన ప్రత్యేక

౦శిష్టకళ, పొడుంపీల్చుకళ — అంటారు. కాని యీమీ గ్రంథమునకు — ఆంధ్రనాటక పద్యపఠన శాస్త్రము' అనుపేరు సముచితమని నాఆశ యము. శాస్త్రమనగా తత్త్వజ్ఞాన జనకమని చెప్పుదురు. నాటకపద్య ఠన తత్త్వజ్ఞానము దీనిద్వారా కలుగ గలదు. మీరడిగినది ఆశీస్సు. కనిచ్చినది కొండవీటి చేదంతాడు. దీనిని ఆశీస్సనుకుంటారో, అభి పాయమనుకుంటారో, విమర్శ అనుకుంటారో, అసంబద్ధప్రలాపసంధి నుకుంటారో, ఏదీకాదనుకుంటారో, ఆవికల్పాలన్నీ నావలన కల్గిన ని వానిని నాపేరునందగిలించి, యిందులోనున్న ఒక్క అక్షరమేని, డువక అచ్చు వేయించి మఱల నొక కాపీ నాకు పంపండి. ఇదివఱకే ఖ స్తినిగదా అనుకుంటే ఖరీదుపెట్టి వి. పి. గా పంపండి. వి. పి. రాకే తిర్గివస్తే నేనూళ్లో లేననుకొండి. ఇట్టిగ్రంథముల నింకను వ్రాయండి. పియే మీరుకోరిన నా ఆశీస్సు.

గ్రహారము
౦ టూరు
1—8—57

K. K.
కాశీకృష్ణాచార్య

# ప రి చ య ం



శ్రీ భమిడిపాటి కామేశ్వరావుగారు ఆవిష్కరించిన గ్రంథ సర్వస్వం ఒకమెత్తూ, ఆయన 'త్యాగరాజు ఆత్మవిచారం' ఒకటీ ఒకమెత్తూ అని ఒకసందర్భంలో వ్రాసుకున్నాను. దానికి అపవాదంగా ఒకమాట: 'ఆత్మవిచారం' తో సహా వారి సారస్వత మంతా ఒక మెత్తూ, ఇప్పుడీ 'ఆంధ్రనాటకపద్యపఠనం' ఒకటీ ఒకమెత్తూ అని చెప్పగలుగుతున్నాను.

కామేశ్వరరావుగారు దరిదాపు నాలుగు దశాబ్దాలుగా ఊహించుకునే తలపులకూ, సాధించుకున్న ఒక వినూత్న వ్యవసాయా నికీ ఫలరూపంగా నిలబడే గ్రంథం 'ఆంధ్రనాటకపద్యపఠనం.'

'కూర్ట్లీ' దొరగారు వేసిన ఒకమాట పునాదిమీద కామేశ్వర రావుగారు అపూర్వశిల్పశోభితంగా నిర్మించిన అభినవసౌధం ఈగ్రంథం.

ఆంధ్రనాటకపద్యాలు సరాగంగా చదవడంవల్ల చుట్టుకునే అనర్థాలూ, విషయమీమాంస, వాదప్రతివాదనలు, ఆక్షేపణలు, సమాధానాలు ఈ గ్రంథంలో శాస్త్రీయమైన క్రమపద్ధతిలో నడిపిం చారు. పద్యపఠనానికి సంబంధించిన ఒక నవీన 'శాస్త్రం' గా సంత రించడంలో భమిడిపాటివారి ప్రతిభావైభవం అనుపదమూ ఈ గ్రం థంలో పరిమళించడం పాఠకుడు గుర్తిస్తాడు. "అనభ్యాసేవిషంశాస్త్రం" అన్నారు పెద్దలు.

'కవిత్వము — పద్యము' ఈ రెండు శబ్దార్థాలకు ఉన్న సుసూక్ష్మమైన భేదం, 'రాగం — నాదం' వీనికి సంబంధించిన తత్త్వ సంవాదం, పాటకూ, పఠనానికీ ఉండే ప్రత్యక్ష విభిన్నతా సామా

న్యులకే కాదు, మాన్యు లనుకొనే వారికికూడా విస్పష్టంగా తెలుసు ననడం క్వాచిత్కం. ఈ రహస్యాలు ఎంతో లోతుగా పరిశీలించి భావించి సువిశదం చేయడంలో కామేశ్వరరావుగారు సంగీత సాహిత్యోభయ కళామిత్రులు అవుతున్నారు.

హృదయానుభవమూ, ఆత్మానుభావమూ కలిగి, ఒకవాదంపట్ల తమకున్న ప్రత్యయం వాడిగా వేడిగా ప్రదర్శించడం ఒకటీ—శాస్త్ర క్లిష్టమైన విషయం కళాపుష్టంచేసి హాసమధురంగా పఠితకులందించడం రెండు — ఇవి కామేశ్వరరావుగారి రచనలో నేను గుర్తించుకున్న విషయాలు.

ఇటువంటి సగుణరచనలో తెలుగులోకానికి అచుంబితమూ, అపూర్వమూ, అవశ్యాచరణీయమూ అయిన పద్యపఠనవిషయం ఇంతగా పరిశోధనచేసి వెల్లడించినవారు కామేశ్వరరావుగారుతప్ప మరి ఎవ్వరూ నేను ఎరిగినవారులేరు. ఎంతగా పరిశోధన చేసిన వారూ లేరనడం సాహసం కాదు.

రెండు మాటలతో హృదయం వెల్లడిస్తాను.

“కవిత్వముకాని నీరసపద్యరచన ఈ గ్రంథవాదం ముందు మందుకైనా నిలబడలేదు. యథార్థమైన కవిత్వ తత్త్వానికి ఈగ్రంథం కర్పూర నీరాజనం పడుతున్నది. భాషావివాదం విడిచి విశ్వవిద్యాలయాలు “ఆంధ్రనాటక పద్యపఠనం” కళార్థిబృందంచేత చదివింపచేయడం తరతరాలకు మేలుచేయడం.

రాజమహేంద్రవరము
హేమలంబ: శ్రావణి

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

# వి ష య ము లు

పుటలు

# ఆంధ్ర నాటక పద్యపఠనం

---

## 1. ప్రాతిపదిక

శ్రీ "కూల్డ్రే" దొరగార్ని చల్లనివేళ తల్చుకుంటాను. పూర్వం (అనగా, 1909-1919 లో) ఆయన రాజమండ్రి ఆర్ట్సు కాలేజీ ప్రిన్సిపాలు. ఆయన విశ్వకళోపాసకుడు కావడంవల్ల ఏ 'ఆర్టూ' బోధించని ఆర్ట్సు కాలేజీయొక్క పేరులో అధిష్ఠించిఉన్న వైపరీత్యం ఆయన కాలంలోనేనా తొలిగిపోయిందిగదా అని ఒప్పుకునే వారుండవచ్చు. ఆయన సంభాషణ చిన్నగానూ, కాగితపు రచన గంభీరంగానూ ఉండేవి. ఆయన హయాంలో (1918 లో) నేను బి. యే. క్లాసులో ఉండే వాణ్ణి. అప్పట్లో బి. యే. క్లాసుకి ఉంటూండే పఠనవిషయాల రెండింటిలోనూ ఒకటైన 'ఇంగ్లీషు' లో 'రిటరిక్' అనే అంతర్విషయం ఉంటూండేది. 'రిటరిక్' అంటే 'వక్తృత్వశాస్త్రం' అని అనవచ్చు. అందులో శబ్దనిర్వచనభాగం 'సీనియరు' క్లాసులో ఆయన స్వయంగా బోధించేవారు. ఒకనాడు 'కళ' అనే పదంయొక్క నిర్వచనం చేసిన సందర్భంలో ప్రసంగవశాత్తూ ఉదాహరణపరంగా, "మీ ఆంధ్రకవిత్వం ఒక ప్రత్యేక 'కళ' కాదు" అని ఆయన అన్నారు. అప్పట్లో, బి. యే. కి 'తెలుగు' అంటూ ఒక పఠనవిషయం లేకపోయినప్పటికీన్నీ, నా కలం అసలు తెలుగక్షరాలు ఎక్కడ గాయగలుగుతుందీ అనే నిరాశలో నేను ఉంటూన్న వాణ్ణి అయినప్పటికీన్నీ, "ఎవరో దొరగారేమిటి? మా తెలుగుకవిత్వంగురించి తన ఇష్టం వచ్చిన సాభిప్రాయవిశేషం కోరకుండా కటాక్షించడం ఏమిటి?"

అని బహుశా నాకు ఆంధ్రకోపం బయల్దేరింది గావును, క్లాసులో ఎన్నడూ సాధారణంగా నోరువిప్పివరగని నేను, లేచి,

— ఆంధ్రకవిత్వం ఎందుచేత కాదండీ, ప్రత్యేకకళ?, అనే ప్రశ్నతో ఆంగ్లంలో ఆయన్ని అటకాయించాను. 'అది మీ సంగీత రాగాల్నించి విడిపడి ప్రత్యేకత్వం ఆర్జించుకోలేకపోయిందిగనక, రాగ మిళితం అయినప్పుడుతప్ప దానికి జన్మ ఉన్నట్టు మీరు ఒప్పుగోరు గనక' – అనే భావం ఆయన ఆంగ్లంలో వెలిబుచ్చారు. ఆంగ్లంలోనే

నేను – అది తమకు ఎట్లా తెలుసునండీ?

ఆయన – నేను మీ నాటకాల్లో సరేసరి, తక్కినచోట్లకుడా పండితుల ముఖతాకుడా 'ఓ ఓ ఓ' అనే రాగపు హోరులోనే దాన్ని వెలుపరించడం వింటున్నానుగాని, ఆ మాటల్ని యథాగామ వంతో నేను వినడంలేదు.

నేను – మా కవులు కవిత్వం చెప్పడానికల్లామూలం రాగాలు నేర్చు గోరండి. వాళ్ళల్లో చాలమందికి ఏ రాగాలూ రావు.

ఆయన – అట్లానా? పరమాశ్చర్యంగా ఉందే నాకూ! నేను అల్లా అనుకోలేదు. అదే నిజమైన పక్షంలో, రచనాదృష్ట్యా మీ కవిత్వం ఒక కళయే. కాని, దాని ఉచ్చారణగురించిన హెచ్చుతగ్గు ఏదో ఉందన్నమాట! – అన్నారు.

అంతటితో ఆ విషయం క్లాసులో ఆగిపోయింది. కాని, అది నన్ను పట్టుగునే ఉంది. కాలేజీ విడిచిపెట్టిన తరవాతకుడా ఆయన మాట నా చెవిలో ఇంకా మోగుతూనే ఉంది. అందువల్ల ఆంధ్రేతరుడైన ఆ దొరగారి ప్రేరణవల్ల నామకః ఆంధ్రుణ్ణై ఉన్న నేను, ఆంధ్రంలో పద్యం అంటే ఏముటో తప్పనిసరిగా చూసుకోవలిసిన అవసరంలో

పడి, ఆంధ్రంకేసి తిరగవలిసివచ్చి తిరిగాను. రకరకాల కవనాలకోసం నేను ఆంధ్రసారస్వతంలో ప్రవేశంఅర్థించుకుని చేరాను. గానశాస్త్రంలో గీతం, వర్ణం, కృతి, రాగం, మొదలైనవి ఏముటో పెద్దలవల్లా గ్రంథాలవల్లా నేర్చవలిసొచ్చింది. ఇల్లా కొంత తర్జనభర్జన పడి, పద్యం రాగం అనే మాటలకి సంబంధించిన యథార్థాలు ఎక్కడ తారసిల్లినా సరే పోగుచేసుగోడం, అవి మననం చేసుగుంటూ ఉండడం, పని అయింది

ఇంతలో, అనగా1924లో బందరులో నటసారస్వత మహాజనసభ అయింది. అప్పుడు నాట్యకళావరణలో నాటకకర్తలుగుడా ఉండవచ్చు ననుకునేవారు. నటసభకి శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారున్నూ సారస్వత సభకి శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారున్నూ అధ్యక్షత వహించారు. అసలు ఆ రెండుమూడు రోజులూ జరిగిన ప్రతీ ప్రత్యేక సమావేశసందర్భంలోనూ వారిద్దరూకుడా అధ్యక్షించేవారు. కార్య క్రమంలో అచ్చుపడ్డ ఉపన్యాసకుల్లో కొందరు రాలేదు. కొత్తవాణ్ణైన నాకు మొదటి రోజు ఉదయాన్నే 'ఛాన్సు' ఇచ్చారు. నా విషయం 'నాటక పద్యగానం.' అక్కణ్ణించి, ఆ సాయంత్రమూ, మర్నాడు పొద్దున్నా సాయంత్రమూ నేను ప్రసంగించడమే. నాకు అప్పుడప్పుడు ప్రతికూలంగా సబబులు రావడం, నేను వాటిని పూర్వపక్షం చెయ్యడానికి ఉపన్యసించడమే తప్ప, మరెవరూ ఉపన్యసించలేదు. మరో విషయం ఏదీ చర్చింపబడలేదు. నా గోల ఏమని అంటే: అన్యత్వం స్థాపించడానికి ఏర్పడ్డ నాటకరంగంమీద, స్వత్వాన్ని మిక్కిలి ఛాయ పరిచే రాగం పట్టిగెళ్ళి ప్రత్యేకగమన వ్యక్తిత్వంగల పద్యానికి సంధానం చెయ్యయత్నించడం నాటకపరమావధికి భంగకరం అయి ఊరుకోవడమేకాక, విరుద్ధమార్గంలో వర్తిస్తుంది — అని.

అదివరకెప్పుడూ నేను జనంఎదట నిలబడలేదు, ప్రసంగించలేదు. కాని, అవసరాన్ని పురస్కరించుగుని అల్పుడుకుడా ఏదో అల్లరిచెయ్యాగలిగే అదను కలుగుతూంటుంది. అందుకని, శాస్త్రం చెప్పిన తరవాయిగా, కొంత ఆట కొంతపాట కొంత మాట లాంటివి ఏకంచేసి ధప్పళంపద్ధతిలో ఏదో నేను దంచెయ్యడం జరిగింది. అక్కడికి వెళ్ళడానికి పూర్వమే, నాలో దీన్నిగురించి బయల్దేరిన ఆందోళన నా దగ్గిర లిఖితం అయేఉండి ఉంది. నాటకం, కవనం, పద్యం, గానం, రాగం, కీర్తన, అభినయం మొదలైన పదాలు ఇదమిత్థం అనుకుని ప్రసంగించడమూ, నాకు చేతనయినంతమట్టుకు దృష్టాంతాలు ఇస్తూండడమూ. తయారుచేసుగునివెళ్ళిన దస్తరం అప్పుడప్పుడు విప్పి, అదంతా చదవడం మొదలెడతానేమో అనే భయం సభ్యులముఖాల్లో కనపడగానే దస్తరం కట్టేసి ఏ రాగమో అందుకుంటూండడమూ – ఇల్లాగ్గా రెండు రోజులపాటు – బందరుపౌరుల అంతఃకరణధర్మమా అని – కాలక్షేపం అనండి, భజన అనండి, నేను జరిపాను. వాదనలో: పద్యం పఠించాలి అనే నేనొక్కణ్ణే ఒక పక్షం. తటస్థంగా వింటూన్న ఏ అయిదారుగురో తప్ప తక్కిన అందరూ 'పద్యం రాగించాలి, లేకపోతే ఏడిసినట్టుంటుంది' అనే రెండో పక్షం. నేను తేల్చే సారాంశం చెవికి ఎంత చేదైనా, అంతా నన్ను మన్నించారేకాని, నిరసించలేదు. రాగవిషయంలో నేను చెబుతూండేవి సత్యమే అని నిలబెట్టడానికి శ్రీ హరి నాగభూషణముగారూ, పద్యవిషయంలో నేను అనేవి యథార్థం అని నిర్ణయించడానికి శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారూ, అభినయ విషయంలో నేను మాట్లాడేవి యూథి అని పరిష్కరించడానికి శ్రీ వెదురుమూడి శేషగిరిరావుగారూ అవసరం వచ్చినప్పుడు అడ్డుపడి నా మాట దక్కిస్తూఉండేవారు. ఒకొక్కప్పుడు నే చెప్పేదీ పాడిందీ విని, 'నువు చెప్పేదంతా బాగానే ఉంది. పద్యానికి శాస్త్ర రాగం

కూడా ఏదేనా తగిలించనియ్యవయ్యా ' అనేవారు, శ్రీ వెంకటశాస్త్రి గారు. పద్య, రాగ, అభినయాల మూడింటికీ సమ్మేళన అన్యాయం ఒప్పించడానికి వచ్చిన నటుడిపట్ల అసంభవం అని నేను ఉదాహరించి మాట్లాడుతూండేవాణ్ణి. శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు, ఎప్పుడేనా కలగజేసుకుంటూండి, నేను సుగమం చెయ్యలేకపోయిన భావాన్ని తమరు సుగమం చెయ్యడమే కాకుండా దాన్ని అలంకరించికుడా వెలు వరిస్తూండేవారు. ఒకసారి, ఆయన వెంకటశాస్త్రిగారితో, 'ఆగండా గండి, శాస్త్రుల్లుగారు! అది కాదు కామేశ్వరరావుగారు చెప్పేది. ప్రౌఢ రాగకన్య వెళ్ళి పద్యపురుషుణ్ణి కౌగిలించుకోగానే, పద్యపురుషుడు గతి చెడడమే కాదు, మూర్ఛలోనే పడిపోతాడు, అంటున్నారు ' — అని సెలవిచ్చారు. అప్పటికి (అప్పణ్ణించి ఇప్పటిదాకా కుడా) పెన్సులుతో కాగితాలమీద రాసిఉన్న నా రచన, ఉన్నపాళంగా అప్పట్లో ఇచ్చేస్తే ఒక నూటయాభై రూపాయలు పారితోషికం ఇస్తానని 'శారద ' పత్రికాధిపతులు శ్రీ కౌతా శ్రీరామశాస్త్రిగారు అన్నారు. వారితో నేను, 'అయ్యా! ఇది నా మొదటిరచన. ఉద్రేకంలో ఏదో అనేస్తూ, మరిచిపోతానేమో అని ఆపళంగానే కాగితంమీద పారేశాను. నాకు తెలుగు తెలియదు, ఎక్కడా నేర్చలేదు, మొదటిసారి అచ్చుపడడమూ, విషయం తగాదావిషయమూ అంటే నాకు భయంగా ఉంది. పైగా, నేనూ రాగవేషం వేసినవాణ్ణే గనక, ఈ అభిప్రాయాలు మరి కొన్నేళ్ళుపోతే నాకే నచ్చుతాయో నచ్చవో, ఈ ఉడికీఉడకని పాకం జనానికి వడ్డించేవిషయంలో నేను మెత్తపడడంకంటె, నేనే సెట్టుగోడం నాకు శ్రేయస్కరం. మీరు నా రచనకి విలవకట్టినందుకు కృతజ్ఞుణ్ణి ' అన్నాను. అని రచన ఉంచేసుగున్నాను.

[ బందరుసభల విశేషాలు నాకు సంబంధించినవి కొన్ని చెప్తూ గుంటూ ఉండేవారు. ఓం ప్రథమంలోనే నేను భైరవిరాగం ప్రారం

భించి, అయిదు నిమిషాలు పాడి ( అప్పట్లో పాడేవాణ్ణి, విన్న జనాని సాధారణంగా సుస్తీ చేసేదికాదు ! ) నే చెప్పిన వృత్తాంతం బోధ పడిందా అని అడిగేసరికి, సభవారు రాగంవల్ల వృత్తాంతాలు బోధ పడవని అనడం–ఇంద్రగణాలులేని పద్యాల్ని తాళంవేస్తూ నేన చెప్పడం–పద్యగానానికీ కీర్తనగానానికీ భేదం చూపించడానికి నేన పాడడం–కొత్తపద్యం కొత్తవాడు పాడేటప్పుడు శ్రోతని ఎక్కువ ఆక ర్షించేది రాగసంగతులా పద్యపదార్థాలా, అనే ప్రశ్న వచ్చినప్పుడ ఎవరో ' పద్యపదాలే ' అనగా నేను ' అనుగుం జెల్లెలవై ముకుంద నకు, నాకర్ధాంగివై ...' అంటూ అర్జునుడుపాత్రకున్న పద్యాన్ని తోడిమీద, ' అనుగుం జెల్లెలవై, ముకుందునకు నా కర్ధాంగివై ... అంటూ పాడినా, ఎవ్వరూ నవ్వకపోగా, ' నవ్వరేం ? ' అగ శ్రీ వెంకటశాస్త్రులుగా రన్నప్పుడుకూడా జనం నవ్వకపోవడం–'క్రుమ్మర పల్లటిల్లితిని ప్రొద్దుననుండియు భోజనమ్ములేక...' అనే పద్యాన్ని చాలా హెచ్చుస్థాయిలో అందుకుని, ' విశుద్ధ నీరమ్ములుగాని, ' అనే చోట నేను సొమ్మసిల్లినట్లు పడిపోగా నిజం అనుకుని ఎవరో పరిగెత్తి వెళ్ళి నీళ్ళు తీసుకురాగానే, నేను లేచి, నీళ్ళు అక్కర్లేదుగాని ఆపట్టులో అభినయం అట్లా ఉండాలని సూచించడం–గద్యపద్యాల తేడా గమనిం చడంలో, నేను గద్యచదివేటప్పుడు ఎదటివాడు తల కదపకుండా వినడం– నా తల ఊపకుండానే నేను పద్యం చదివేటప్పుడు ఎదటివాడు తల నియమప్రకారం ఊగిస్తూండడం జరగడంవల్ల, పద్యానికి నియమితమైన నడక ఉన్నట్టు ఋజువుకావడం ! — మొదలైనవి. ]

నేను వేదిక ఎక్కడానికి మొదటిసారి అదే అయినా, నా భాగ్య వశంచేత, ఉద్ధామలవంటివారైన శ్రీ భోగరాజు పట్టాభిసీతారామ య్యగారు, శ్రీ చెలికువాడ నరసింహంగారు, శ్రీ ముట్నూరి కృష్ణా రావుగారు, శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు, శ్రీ పురాణం

సూరిశాస్త్రిగారు, శ్రీ హరి ప్రసాదరావుగారు మొదలైనవాళ్ళు నా మాటలు మన్నించి వినడం నాకు లభించింది. అటువంటిసభ్యులూ అధ్యక్షులూ నన్ను ప్రోత్సహించడంవల్లే, సభాముఖాన్ని ప్రసంగించడానికి నాకు ధైర్యం కలిగింది, ఇప్పటివరకూ ఉంది. శ్రీ ఉమ్రే ఆలీషాకవిగారు, తెలుగునాటక పద్యాలు రాగవరసని పాడకపోతే తెలుగుకవిత్వం దెబ్బతినడమేకాక, తెలుగు నాటకప్రాశలు తగులడి శూన్యం అయిపోతాయని తమ భయం వెల్లడిచేశారు. 'కృష్ణాపత్రిక'లో, నేను బందరుపౌరుల్ని నా పులగపు ఉపన్యాసంతో గభరాయింపచేసి తల్లకిందులు చేశానన్నీ, నేను చెప్పే విడివిడినబబులు సత్యేతరం కాకపోయినా, నేను తేల్చే సారాంశంమాత్రం వాంఛనీయం కాదనిన్నీ, దాంతో ఏకీభవించడం కష్టం అనిన్నీ, అన్నారు. కాని, ఆ సభలో ఉండి, నేను ప్రసంగించేది యావత్తూ తను విని, శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు తమ 'మాతృసేవ'పత్రిక 12–6–1924 తేదీగల సంచికలో 'నాటకములు—సంగీతము' అనే శీర్షికతో ఒక ఉపసంపాదకీయం రాశారు. అప్పట్లో నా వాదన ఆయన నాకంటె స్పష్టతరంగా చెప్పడంవల్లనైతేనేమి, నేను గ్రంథమే రచించి తెచ్చినట్టు ఆయన గమనించడంవల్లనైతేనేమి, ఆయన అన్నది ఇస్తున్నాను:

# మాతృసేవ

(సంపుటము ౨ – సంచిక ౧౭, 13—6—1924)

## నాటకములు - సంగీతము

"నాటకములలో సంగీతమవసరమా? అవసరముగునేని ఎంతవరకుండదగును? అను సంశయము బందరులో నటమహాసభయందు విమర్శకు వచ్చినది. రాజమహేంద్రవరమునందలి హితకారిణీ విద్యాలయ

మునకు జేరిన భమిడిపాటి కామేశ్వరరావుగారు సంగీతముపై దండ యాత్రకు నాయకత్వము వహించిరి. హృదయరంజకమగు వాదప్రతి వాదము జరిగినది.

కామేశ్వరరావుగారు తమ వాదమును స్పష్టముగా చెప్పిరి. గ్రంథమునే రచించి తెచ్చిరి. సారాంశ మింతియే. నాటక మభినయప్రధానము. పదార్థసముపేతంబగు గద్యపద్యాత్మకము. సంగీతము స్వరప్రధానము. పదార్థసముపేతము కానక్కరలేదు. పదసంబంధముగల చోటంగూడ నర్థవైశేష్యము నుల్లంఘించునదియు కావున నీ రెంటికిని నిశ్చయమగు సంబంధము లేదు సరిగదా, సత్యమునకు వైరుధ్యము కూడ గలదు.

సంగీతవిద్యను నిరసించుట యీ విమర్శకు నుద్దేశముకాదు. సంగీతము పరమానంద సందాయకము. ఆత్మాకర్షకము. కళలలో నయ్యది యుత్తమోత్తమము. సర్వజన సమాదరణీయము. సర్వజన సమాదృతము.

కాని నాటకకళ వేరు; సంగీతము వేరు. రెండును ప్రత్యేక వ్యక్తిత్వము కలవి. రెంటికిని నుద్దేశము వేరు. ఒండొంటితో వీనిని మిశ్రమమొనర్చుటచేత నిందులో నొక్కటియగు నాటకకళ నశించుచున్నది, సంగీతమే నిల్చుచున్నది. అయిన దీనికింగూడ సహజశీలము పోషితమగుటలేదు. సంకరజన్మ సాక్షాత్కరించుచున్నది. సత్యమగు సంగీతమునకు తలవంపులగుచున్నవి.

శృతి సంగీతమునకు బునాది. శృతి బెట్టుటతో సంగీత మారంభమగుచున్నది. మితి బెట్టిన నిలుచు ప్రకృతి సంగీతమునకు లేదు. కాబట్టి నాటకశాలలో శృతి బెట్టుటయుంగూడ తగదు. పద్యమైనను గద్యమైనను శృతిబెట్టక చదివి యభినయమైదగ్ధ్యముచే నర్థవిస్ఫురణము

పరిపూర్తి చేసి చూపరులయందు భావోద్రేక, భావోన్మత్తతలను విజృంభింపజేయుట నాటకోద్దేశము.

కామేశ్వరరావుగారికను విపుల విమర్శ గావించిరి. సంగీతము నకు ప్రాముఖ్యము కలుగుటవలన సంఘమునకు సంప్రాప్తించిన కష్టములను — భారతప్రపంచము వీనినన్నిటిని ననుభవించుచునే యున్నది — విశదపరచిరి.

ఎదురువాదము బలవత్తముగా వచ్చినదనుటకు గాదు. సంగీతము లేకున్న పద్యమే సృష్టింపరాదని కొందరనిరి. ఉమ్రేఆలీషా కవిగారు నాటకము అభినయము, సంగీతము, కవిత్వము ఇత్యాదికళల సమీపకరణముగాని యేకకళ కాదనిరి. ఈ సమీకరణంబున జేరిన యొక్కొక్క కండను నొక్కొక్కరి యభిప్రాయానుసారము దీసి వైచుచు వచ్చినచో నాటకప్రదర్శన మాకాశంగగనంశూన్యం అగు ననియు నాటకశాలలు తగులబెట్టుకొని పోవచ్చుననియు నెదుటి వాదము నాభాసము గావింపజూచిరి.

సంగీతము మానవహృదయమందే కలదు. సంగీతము ననుభవింప లేని మానవు డాయింగ్లీషు కవివరుడు షేక్సిపియ రనినరీతిని నిజముగా గార్దభ చక్రవర్తియే. పద్యమునందు సంగీత మిమిడియున్న దనుటయు సత్యంబె. నాటకము కొన్నికళ లుపాంగములుగా గలదనుటయు నిర్వివాదంబె. ఇవి యంగీకరించినసుగూడ కామేశ్వరరావుగారి వాదమును నర్థము చేసికొనక పోవుటమాత్రము సత్య మెదురుపడినప్పుడు కన్నులు మూసికొనుటయే యగును.

మానవహృదయములోని సంగీతమును పద్యములలోని సంగీతమును సుప్రసిద్ధమై త్యాగయ్యగారి కృతులలోను నితర గాయకుల జావళులలోను స్వరప్రస్తారప్రాధాన్యమై చెన్నలరారు సంగీతకళతో

నైక్యపరచి నాటకమున నీకళకు స్థానమున్నదనుట విపరీతపదార్థ ముచే వాదము సాధించుటదక్క వేరుకాదు.

పద్యరచన గణబద్ధము. ఈ నియమబద్ధుడై యుచితపదార్థ వైదగ్ధ్యముచే రసప్రపంచమున తాను విహరించి చదువరులను విహరింపజేయుట కళానిపుణుడగు కవిధర్మము. అభినయపూర్వకమగు కావ్యప్రదర్శనమే నాటకప్రదర్శనము. నిజమునకు నాటకము దృశ్య కావ్యము. దృశ్య సంగీతము కాదు. దృశ్యకావ్యమునందు పాడుకొన వలసినచో కవి యనుజ్ఞ యిచ్చుచున్నాడు. అది ప్రాచీన సంప్రదాయము. కాళిదాసాది మహాకవులు పాడుకొనునది యని సూచించుటయే దీనికి తార్కాణము.

కాబట్టి యాంధ్రభూమి కామేశ్వరరావుగారి వాదమును జాగ్రత్తగా నాలోచింపక తీరదు. నాటకరంగమునుండి సంగీతమును కొంత దూరముచేయక విధి లేదు. నిజమగు నాటకప్రదర్శనము ననుసరింపక యుండరాదు. వెంటనే యేతద్విషయమయి ప్రయత్నములు జరుగును గాక యని కోరుచున్నాము. నటసారస్వతసభవారు చేసిన తీర్మానాను సార మాంధ్రావనిలోని యుత్తమనటు లొక్కటిగజేరి భావప్రదర్శనమున కుచితమగు నాటకమును చేగొని, అట్టి నాటకము లేనియెడల వ్రాయించి — ప్రదర్శించి నాటకకళను సంగీతము కబళింపకుండ కాపాడి నాటకము పండితాదరణీయము గావించి లోకకళ్యాణమున కిద్దానిని సాధనము చేయుదురుగాక యని మరిమరి కోరుచున్నాము.''

విషయం పద్యరాగఅభినయకళల మూడింటికి సంబంధించినది అవడం చేతనో, ఆ మూడు కళలూ నాటకప్రదర్శనం చూసిన ప్రతీ వ్యక్తీ ఏ కొంతో తనకికూడా వచ్చునని అనుకోవడానికి వీలుండడం చేతనో, సభల హడావిడిలో ప్రతివ్యక్తినీ తృప్తిపరచడానికి నాకు సావ

కాశమూ సామర్థ్యమూ లేకపోవడం చేతనో, ఉదాహరణ-తీసుగున్నవి నాటకపు పద్యాలవడంచేతనో, నా వాదన ఎంత సహేతుకంగా కనిపిస్తేంగనక మరీ దారుణంగా కనుపిస్తూన్న సారాంశం ఒప్పుగోడం ఎట్లా అని కొంతమందికి లోపల బాధ బయల్దేరడంచేతనో, నా వాదనని ఏదో మోస్తరుగా నా సమక్షంలో మార్దవంగానూ, నా పరోక్షంలో కొంచెం ఊతంగానూ—కొట్టిపారేసే విమర్శకులు ఉంటొచ్చారు. అప్పుడు పుట్టిన కొన్ని చిట్టిపొట్టి విమర్శనలూ, నా సమాధానాలూ ఈ క్రింది విధంగా ఉండేవి :

1. నాకు సంగీతం రాకపోవడంవల్ల ఈ పేచీ బయల్దేర తీశా నని.

    సమాధానం :— నాకు చాలా రావు. బహుశ అందులో సంగీతం ఒకటి. నాకు రానివన్నీ ప్రపంచంలో ఉండకూడనివి అని నేను అనలేదు. కాని, ఒక చిత్రం ఏమిటంటే, నన్ను సంగీత విషయంలో అల్లా ఆక్షేపించినవాళ్లు నే పాడినపాటి రాగమూకూడా పాడలేనివాళ్ళు !

2. నేను నాటకసంగీతం మీాద దండెత్తా నని.

    సమాధానం :— అదేముటో తెలియక దండెత్తాను. అది సంగీతమే అని గాయకులంటే, శిరసావహిస్తాను.

3. నేను గద్యనాటకాలే ఉండాలని అంటా నని.

    సమాధానం :— నేను అనను. ఆ మాట గురువులైన శ్రీ శ్రీపాద కామేశ్వరరావుగారిది.

4. మంచిగొంతిగవాళ్ళని చూస్తే నాకు ఈర్ష్య, అని.

    సమాధానం :— మంచిగాత్రం వాళ్ళకి మొక్కి వాళ్లపాట వింటాను. ఆ గాత్రంతో వాళ్లు ఏంచేసినా నాకు ఆనందమే.

పద్య-రాగ సంబంధంమాట నే నడుగుతూంటే, వాళ్ళ గొంతికమీద నాకు ఈర్ష్య అనడం ఏమిటి, గానం తియ్యగాఉంటుందని జంతువులే ఒప్పుకోగలిగినప్పుడు!

5. కవిత్వం మజాగా ఆనందించడం నాకు తెలియలేదు-అని.

సమాధానం :— మజాగా ఆనందించడంకంటె ముందు, కవిత్వాన్ని (పద్యాన్ని) ఆనందించాలనే నా ప్రార్థన. పద్యాన్ని పారతంత్ర్యం లేకుండా ప్రకటించండి అనే నా మొర.

6. గానానికి ఆకర్షణ ఉన్నసంగతి నాకు తెలియదు—అని.

సమాధానం :— తెలుసును. ప్రాణికోటికంతకీ తెలుసు, నాకు తెలియదా? కాని, ఆ గానం ఎవరిదో గమనించిగాని ఆకర్షణ వికర్షణలు చెప్పలేం. పైగా, వృత్తాంతంగల మాటలతో ఉన్నపద్యం ప్రకటించే క్షణాల్లోతప్ప ఇతర సమయాల్లో గానాకర్షణలక్షణం బయటపడదా?

7. ఎవడిమట్టుకివాడు ఒక్ఖడూ కూచుని, తనుగా, తెలుగు పద్యాల్ని పట్టుగుని పాడుకోకూడ దని నేను అన్నా నని.

సమాధానం :— నేను అనలేదు. ఎందు కంటానూ? మతి లేదా? ఒక్ఖడూ కూచున్నప్పుడు ఒకడిమీద మనం శాసించి ఏం లాభం? వాడిష్టం. నే చెప్పేది: ఎవడేనా ఒక పద్యాన్ని మరోడికి వడ్డించవలిసొచ్చే టప్పటిమాటే! అందులోనూ, పద్యవృత్తాంతం పూర్తిగా ప్రకటిస్తేగాని అన్యుడై ఒప్పలేని వ్యక్తి!

8. ఇంగ్లీషుపులిని చూసి, తెలుగునక్క వాతలెట్టుగోవడం తగ దన్న మాట నేను మరిచిపోతున్నా నని.

సమాధానం: తెలుగునక్క ఏ పులిని చూసీకూడా పెట్టుగోకూడదు, వాతలు! నేను వాత పెట్టుగోమనడం లేదు. పడ్డ వాత మానుపుగోమంటున్నాను. పద్యం పాడడపు సంప్రదాయం నడిమంత్రపుసిరి. ఒక సంప్రదాయంలో లాభం వీసమూ, బాధకాలు ముప్పాతికమువ్వీసమూ అని తేలుతూన్నప్పుడు ఆ సంప్రదాయాన్ని పక్కకి నెట్టడం వాతలు పెట్టుగోవడమా?

9. పద్యంవెళ్ళి మంచి (అను-)రాగంతో నిక్షేపంలాగ కాపరం చేస్తూంటే చూడలేక, ఆకలయిక చెడగొట్టి, దంపతులకి విడాకులు ఇప్పించి, పద్యాన్ని బోడించి క్షౌరం చెయించి కూచోబెట్టిస్తున్నా నని.

సమాధానం:— పద్యరాగసంబంధం అసలు 'కాపరం' అయి ఉంటేగదా, నేను విడాకులు ఇప్పిస్తున్నా ననడం? సుప్రసిద్ధుడైన కీర్తనకర్తమాటలకీ అతడే నిర్ణయించి సూచించే రాగానికీ దాంపత్యం అంటారా, అది నేను ఒప్పుగుంటాను. కాని, ఏ పద్యంఅయినా సరే, ఏ రాగంతోనైనా సరే, ఎల్లాంటి అవస్థలోనైనా సరే, కలిసి లేచిపోవడానికి సబబులు చెప్పే నోటితోనేనా, పద్యరాగాలకి దాంపత్యం అనడం? ఇక, పద్యాన్ని నేను బోడించమనలేదే? రాగపు సవరం పెడితేగాని పునిస్త్రీలాగ కనిపించని పద్యం అసలు బోడిదే అన్నమాట! మరి దాన్ని బోడించడానికి ఎవ్వరూ శ్రమపడనక్కర్లేదు.

10. పద్యక్షీరంలో రాగశర్కర వేసుగో కూడదని నే నన్నా నని.

సమాధానం :— పద్యాన్ని పాలతో పోల్చారు, ఒప్పుగున్నాం. రాగాన్ని పంచదారతో పోల్చారు, పోనీ అదీ సరే అని, ఒప్పుగున్నాం. పోలికకోసం తెచ్చిన రెండు భిన్న సందర్భాల దినుసులికి సంబంధం ఉండడంవల్ల, పోల్చబడ్డవాటికి సంబంధం ఉందని స్థాపించడమే! అల్లాయితే, పద్య క్షీరంలో రాగలవణం వేసుగోకూడదని నే నన్నాను. 'రాగాన్ని లవణంతోనా పోలుస్తారు ?' అని ఎదిరించారు. 'శర్కర'కి కంటె లవణానికి ఎక్కువ 'లావణ్య'మే ఉందని నే నన్నాను. పైగా, శర్కరకంటె జీవనానికి లవణమే ఎక్కువ అవసరం, అన్నాను. రెండు వేర్వేరు ఉపమానాల్ని చేరికచేసి, మళ్లీ హేతువాదంలో పడడం అక్రమం.

# 2. పద్యం పాడడపు సంప్రదాయ విచారణ

మానవహృదయానికి ప్రత్యక్షంయొక్క అనుభూతీ పరోక్షం యొక్క సానుభూతీ ఉన్నాయి. రసపూరితమైన హృదయానుభవమే భావోదయానికి మూలం. సంపూర్ణభావాలతో కూడినయోచన మానవ మేధయొక్క విశేషలక్షణం. ఆయోచన విస్పష్టంగా ఇతరమానవులకి ప్రకటించడానికికుడా మానవుడు నోచుగున్నాడు. యోచనయొక్క ప్రకటనకి అనేక సాధనాలు మానవుడు వాడగలడు. అటువంటి సాధ నాల్లో మాటలు ఒక సాధనం. మాటలతో రచనచేసేవాడు, తన మాటల సముదాయాన్ని మూడు రూపాల్లో ఏదో ఒక రూపంలో ప్రకటించి తీరాలి–గద్యరూపంలోనో, పద్యరూపంలోనో, గేయరూపం లోనో. గద్యరచయితకి అన్నిటితోపాటు సాధారణవ్యాకరణ జ్ఞా నమూ, పద్యరచయితకి అవన్నీకాక పైగా ఛందోజ్ఞానమూ, గేయ కవికి అవన్నీకాక పైగా గానతత్వంయొక్క జ్ఞానమూ ఉంటాయి–అని మనం అనుకోవడంలో తప్పు ఉండవచ్చుగాని, ఉండాలి అని కోరుకో డంలో ప్రత్యవాయంలేదు. గద్యరచయిత ఛందోగానాలలోకూడా ప్రవీ ణుడై ఉండాలనీ, పద్యరచయిత గానాచరణలోకుడా ఉద్దండుడై ఉండా లనీ, గేయరచయిత ఛందోగానజ్ఞానశూన్యుడై ఉన్నా ఫర్వాలేదనీ అను కోడం భ్రాంతి. ఏమైనా ఈముగ్గురు రచయితల్లో కేవలగద్యరచయితకి తెలుగుజనబాహుళ్యంలో ప్రత్యేకపు పేరు లేదు, గద్యరచయిత రాత నాటికీ నేటికీ అంతే. అసలు వీరేశలింగంపంతులు వచ్చేవరకూ తెలు గులో కేవల తెలుగుగద్యరచనకి మన్ననే లేదు. అయునేనా, ఒకపాటి వాడికి కొరుకుపడని పద్యరూపంలో రచనచేసి చూపించడంవల్లగావును, గత్యంతరంలేక ఆయున్ని 'గద్య తిక్కన' అన్నారు. అట్లానే, కేవల

గేయరచయితయొక్క కర్మంకూడా తెలుగుపండితుల దృష్టిలో కాలి పోతూంటుంది. వాణ్ణి గాయకుడు అని పిల్చుగుంటే పిల్చుకోండిగాని వాణ్ణి మాటకారుల్లోకి చొరబడనియ్యకూడదు అనే వాళ్ళున్నారు. అందుకని, మాటరచయితలందర్లోకీ ఏ కొంతో అదృష్టం పెట్టిపుట్టిన వాళ్ళు పద్యరచయితలే. ఇతర విశేషాలకితోడుగా పద్యవేషంకూడా ఉన్నప్పుడుమాత్రమే ఎవడేనా మాటకారిని 'కవి' అనడానికి ప్రజలు ఒప్పుగుంటారుగాని, తక్కిన రచయితలకి చూస్తూచూస్తూ బుద్ధి పూర్వకంగా 'కవి' అనేటంత ఖరీదైన బిరుదం కట్టబెట్టలేరు. అదీ కాక, జనసామాన్యంలో గద్యరచనగురించిగాని, గేయరచనగురించిగాని చెప్పుగోడం ఉండదు. కాని, పద్యరచనవిషయంలో: అతడు పద్యాలు చేస్తాడు, పద్యాలు కడతాడు, పద్యాలు అల్లుతాడు, పద్యాలు చెబు తాడు, పద్యాలు రాస్తాడు — అంటూ వ్యవహరించుతూండడం విన బడుతుంది. 'మాట' అనేది అర్థంతో కూడిన నాదం గనక, పై మూడు రకాల రచయితలూ తమతమ రచనయొక్క సృష్టి జరుగుతూండే సందర్భంలో ఆ రచనని మొదట నాదరూపంలో సృష్టించి తరవాత లిఖితరూపంలో దాన్ని పొందుపరుస్తారో, లేక నాదంతో నిమిత్తంలే కుండా లిఖితరూపంలోనే ప్రథమంలో దాన్ని ఆవిర్భవింపజేసి పదపడి దానియొక్క ఉచ్చారణసంగతి వదిలేస్తారో తెలియదు. రెండు రకాల వాళ్ళూ ఉండవచ్చును. కాని, ఉచ్చారణ చేసినమీదటగాని మాట జీవించదు. అక్షరరూపంలో 'మాట' అనేది సుప్తం అయిఉంటుందని అనుకోవాలి.

అభిప్రాయబాహుళ్యంవల్ల గ్రంథం ఏర్పడుతుంది. వృత్తాంత ప్రాధాన్యంగల గ్రంథాలు అనేక రూపాల్లో ఉండవచ్చు-పురాణం, ప్రబంధం, శతకం, ఖండకావ్యం, నవల, కథానిక మొదలైన రూపాల్లో వీటిల్లో గద్యంగాని, పద్యంగాని ఉండవచ్చు. ఉన్నా, ఇటువంటి రకా

లన్నీ ఒక్కొక్క వ్యక్తి ప్రత్యేకమూ తన నిమిత్తమే ఏదైనా చదువు కోడమో పఠించుగోడమో జరగవచ్చునని రచయిత అనుకుని ఉండ వచ్చు గనక, ఒక్కొక్క వ్యక్తి ఆ యీరచనని స్వాంతంనిమిత్తం చదువు కోవచ్చు, పఠించుగోవచ్చు, పాడుకోవచ్చు, ఓపికని బట్టి ఆడుతూ పాడుతూ కూడా వ్యవహరించుగోవచ్చు. అట్లానే, ఏదేనా గీతం లిఖిత రూపంలో ఉంటే ఎవడేనావ్యక్తి దానిమీద సూచింపబడే రాగ తాళాలప్రకారం దాన్ని తన నిమిత్తం పాడుకోవచ్చు. అనగా, ఒకేవ్యక్తి స్వాంతభుక్తం నిమిత్తం ఎక్కడైనా లిఖితమైన మాట రచనని చేత పట్టుగున్నప్పుడు అది గద్యంఅయినా బాధ లేదు, గేయం అయినా చిక్కులేదు, అందువల్ల పద్యంఅయినా తంటాలేదు. కాని, గ్రంథం ఒక 'నాటకం' అయినట్టయితే, చిక్కులు బయల్దేరతాయి. మొదటి సంగతి, ఉచ్చారణకర్త అన్యుడై తోచడానికి రంగం ఎక్కిన వాడేకాని తన స్వత్వం అక్కడ స్థాపించుగోడానికి ఎక్కినవాడు కాడు. రెండో సంగతి, అక్కడ తన స్వాంత ఉపయోగంనిమిత్తం మాటరచన వాడుకునేటందుకు అతడు అక్కడికి వెళ్ళడు. సరిగదా, వందలాది సజీవజనం తన ఎదట చూస్తూ వింటూ ఉండగా, తను, తన మాటలయొక్క ఏకోచ్చారణమాత్రమే చేసి, వాటిలోని సంగతి వాళ్ళకి బోధపరిచి, తద్వారా వాళ్ళకి తనుగా కాకుండా అన్యుడై తోచి వాళ్ళని ఆకర్షించడానికి వెడతాడు. ఈ పని చెయ్యడంలో సందర్భించేమాటలు గద్యరూపంలోనే ఉంటాయా సభాముఖాన్ని వాటిని ప్రకటించవలిసిన రీతిగురించి బాధ లేదు. ఏమంటే: తెలుగు ప్రపంచంలో జీవించి వ్యవహరించే వాళ్ళంతా తెలుగు గద్యమే వాడు తూంటారు గనక గద్యోచ్చారణ ఎందు నిమిత్తమో గద్యోచ్చారణ రీతి ఎట్లా ఉండాలో స్థూలంగా ప్రతివాడికీ విశదమే. గేయోచ్చారణ కూడా సభఎదట జరపడానికి వీలుపడే నిమిత్తం ఒక రాగంపేరూ ఒక

తాళంపేరూ గేయకర్తచేత సూచింపబడిఉంటాయి గనక, ఆయా రాగ తాళాలయొక్క ఆచరణలో సామర్థ్యం కలవాడే, ఆ గేయాన్ని ఉద్ధరించి వ్యవహరిస్తాడు. కాబట్టి, సభాముఖాన్ని గద్యోచ్చారణయొక్క విధానంగురించి తగాదా రాలేదూ అంటే, గద్య ప్రకృతిసిద్ధం గనక. గేయోచ్చారణయొక్క విధానంగురించి పేచీ రాలేదూ అంటే, గేయం రాగతాళనియమబద్ధం గనకనున్నూ, నేర్పరి కాని వాడు దాన్ని స్మరించడానికి వీలులేదు గనకనున్నూ! కాని, పేడ యీావత్తూ నాటకపద్యోచ్చారణకి పట్టుగుంది. దాని విధానానికి దారీ తెన్నూ కనిపించదు. పద్యకర్త పద్యాన్ని ఇల్లా కని అల్లా పారేస్తాడట కాని ఉచ్చారణవిషయంలో అతడికి పూచీ ఏమీా లేదుట, అందువల్ల ఆ విషయం అతడికి తెలియకపోవడం అతడి హక్కుల్లో ఒకటిట! పైగా, పద్యకర్త పద్యోచ్చారణక్రియలో ఎంతో స్వాతంత్ర్యం పద్యోచ్చారణకర్తకి ధారపోశాడట (తనకి చెందని సొమ్ము!). ఏమిటా స్వాతంత్ర్యం అని అడగరేం? గాత్రమాధుర్యమూ రాగాడంబరమూ కలిగిఉండడం—అల్లాంటివాళ్ళకే ఆ స్వాతంత్ర్యం. దాని ధర్మమా అని, పద్యోచ్చారణకర్తకి పద్యం అన్నా పద్యవిశేషాలన్నా ఛందస్సన్నా స్పష్టోచ్చారణ అన్నా తెలుగుమాటరీతిఅన్నా తెలిసి తీరాలటగాని, ఎంతమాత్రమూ తెలియకుండా వ్యవహరించగల సదుపాయంకూడా ఉంది. పద్యతత్వం తెలియకుండా పద్యాస్వాదన చేశాం అని చెబితే ఎవరేనా నవ్విపోతారేమో అని కూడా కొందరు సిగ్గుపడకపోవడం ఆ స్వాతంత్ర్యంమూలాన్నే! పద్యరచయితలలోతప్ప ఆంధ్రఛందస్సు వ్యాప్తిహీనం కావడానికి కారణం ఆ స్వాతంత్ర్యమే! ఇక, శ్రోతలుకుడాఅయిన నాటకప్రేక్షకులు: ఛందస్సు ఏమైనాసరే, కర్ణపర్వంగా, మరీ రేవెట్టినట్టు కాకుండా అంతమాత్రాన్ని మరీ తుంచి పారేసినట్టు కాకుండా తమరి మనస్సులోఉండి తమకు చెప్పడానికి తగ్గ

మాటలు తమరిదగ్గరలేని ఒకానొక పద్యరాగసమ్మేళనప్రమాణ ప్రకారం పద్యోచ్చారణ నిర్వహింపబడితేనే నటనం ఒక కళగాని లేకపోతే కాదని—పిడివాదం! అందువల్ల, ముఖ్యంగా నాటకరంగ పద్యమూ, దాన్నిబట్టి తక్కిన ఇతర ఆంధ్రపద్యమూ ప్రత్యేకోచ్చారణలో పొందవలసిన వైఖరి ఏది అనేది ఒక గడ్డుసమస్యగా తయారైంది.

మాటలు గద్యంలోఉంటే ఆ మాటలయొక్క అర్థభావరసాలు ద్యోతకం అయేలాగు వాటిని ఉచ్చారణచేస్తూ తన అభినయకళ యొక్క దోహదంవల్ల శ్రోతలకి ఆమాటల్ని సుగమంచేస్తూ అన్యూడై ఒప్పడం గద్యనటుడి బాధ్యత. అట్లానే, మాటలు గేయరూపంలో ఉన్నప్పుడు గేయంనెత్తిని సాధారణంగా రాసిపెట్టి ఉండే రాగతాళాలు ప్రయోగించో లోగడ అవి వచ్చి ఉండకపోతే నేర్చి ప్రయోగించో లేకపోతే చచ్చిచెడి ఆ భణితి ప్రయోగించో కొత్తభణితి బనాయించో గేయాలుకుడా రచించిన ఆ నాటకకర్త మాటలసందునా ఒకే మాట యొక్క వర్ణాల సందునా తన ప్రత్యేకకోమలగాత్రానికి తత్పూర్వమే స్థిరపడి అలవాటైపోయిన రాగసంగతులు యథాశక్తితో వెదజల్లుతూ ఆ మాటల్ని తాళంతో బాది రాగంతో ఈడుస్తూ అన్యూడై ఒప్పడం సంగీతనటుడి బాధ్యత. ఇల్లాగ్గా దైవకృపవల్ల తెలుగు గద్యనట గేయనటుల బాధ్యతలు నిర్ణయం అయినాయి. ఇట్లానే, పద్యోచ్చారణగురించి పద్యనటుడియొక్క బాధ్యతకుడా ఫలానాఅని ఖాయపడి ఉంటే బతికిపోయుందుం. అటువంటిది ఏదీ నిర్ణయం కాలేదు. పద్య నాటకాలు జనించి ఒక అరవై యేళ్ళపాటు విజృంభించి అంతరించ వచ్చే నేటికీ ఆసమస్య అట్లానే ఉండిపోయింది. ఏమయ్యా, నాటక పద్యంగురించే ఈ సమస్య రావడేం? తెలుగు పద్యనాటకం జనించ డానికి పూర్వం వందలాది సంవత్సరాలుగా తెలుగు పద్యాలు వాల్లాడి పోతూ ఉండలేదా? అంటే, ఉండకేం!

ఆంధ్రంలో పద్యరచన నన్నయనాటికే ప్రౌఢ. నాటినుంచి, పురాణాలలోనూ ప్రబంధాలలోనూ శతకాలలోనూ పద్యాలు గద్యంతో కలిసి వెలుస్తూండడం జరిగింది. క్రీ. శ. 1880 ప్రాంతంలోగాని ఆంధ్రంలో 'నాటకం' అవతరించలేదు. అప్పటివరకూ అన్ని వందల ఏళ్ళూ ఆయాపద్యాల్ని సభాముఖాన్ని ప్రకటించవలిసిన అవసరం వచ్చినప్పుడు ఎట్లా ఉచ్చారణ చేసేవారూ అంటే, పురాణాలు సభ్యుల యెదట వఠించడపు సంప్రదాయం నేటికీ నిల్చిఉన్నది గనక, దాన్ని బట్టి అనుమానిస్తే,పద్యాలు "పాడుతూండే" వారు అని తెలుస్తుంది. పురాణపఠనాన్ని బట్టి మరోటికూడా తేల్తుంది. ఏమనీ? గద్యకూడా పాడేసేవారూ, అని. ఒక పఠిత ఏదో గ్రంథంవిప్పి ఎదర ఉంచుగుని మూలుగుతూ పాడుతూఉంటే, ఆ ముక్కలకి అర్థభావస్వారస్య విశేషాలు మరొకరు అనర్గళంగా చెబుతూంటే, జనం ఆలకిస్తూ ఉండడం—అన్నమాట. ఆ అర్థం చెప్పడంలో ఒకానొకప్పుడు, ఆ చెప్పేవారు తమ చమత్కారం యావత్తూ వెచ్చించి కవిఉద్దేశంలో ఆ కథపట్టులో ఎంతమాత్రమూ లేని సంగతులు చెప్పినా, వారి చెప్పడపు స్వారస్య ప్రవాహవేగంలో మునిగిపోయి, అక్షరకుక్షులు కానివారు సరేసరి అయినవాళ్లుకూడా తెంపలేసుగుని, కళ్లకద్దుకుని ఆ సంగతులన్నీ స్వీకరించడం జరుగుతుంది. చదివేవాడు ఎప్పుడేనా తత్పరుడు కాలేక, ఏదేనా కొత్త మాటగురించిగాని కొత్త సమాసం యొక్క పదవిభజన గురించిగాని తడుముకోవలిసివచ్చినప్పుడు, తక్కున ఆగిపోవడం అసామర్థ్యాన్ని ఒప్పేసుగోడం కింటకి రావచ్చు గనక—కాలయాపన చెయ్యడానికి మూలుగు ప్రారంభించి ఉంటాడు. ఆ మూలుగు పద్యంలో గద్యలోకంటె ఎక్కువ అవసరం. ఎల్లాగూ అవసరంగా పరిణమించిన మూలుగు శ్రావ్యంగా మొదణ్ణించీ ఉంటే తీరిపోతుందని, ఎవరో ఒక గడసరి పద్యాన్నంతనీ రాగంతో బనాయించి ఉంటాడు. అక్క

ష్నించీ పద్యం అయేది గద్య అయేది ఏదో రాగం మీాద నాట, మోహన, ఆరభి మొదలైన వాటిల్లో ఒకదానిమీాద—మోసెయ్యడం సాగించి ఉంటారు. ఒక్కొక్క ఊరికి ఒక్కొక్క పఠిత సరిపో యేవాడు. పైగా, పద్యానికి వ్యాఖ్యానం సావకాశంగా చేస్తారు. అందుకని, పద్యోచ్చారణ అనేది వాళ్ళకి ఒక సమస్యలాగ కనిపిం చనే లేదు. ప్రబంధశతకాల్ని విడివ్యక్తులు స్వంతానికి కోరుక్కుతిన డమేకాని, మహాజనం ఎదట వాటిని దాఖలుచెయ్యడపు అవసరం రాకపోబట్టి, ఆ రచనా రూపాల్లోని పద్యాల ఉచ్చారణకూడా సమ స్యగా పరిణమించలేదు.

ఈ స్థితిలోంచి నాటకరంగం అవతరించి, అచిరకాలంలో సంగీత నాటకాలు ఉద్భవించడంతో ఏదైనా పద్యాన్ని ఇష్టరాగంమీాద పాడడమూా, గద్య చెప్పడమూా ప్రారంభం అయింది. గద్యరచన తోనే మొదలెట్టిన నాటకకర్తలు వేషాలెయ్యడానికి మంచిగొంతిగ వాళ్లు వచ్చినకొద్దీ పెద్దపాత్రలకి పద్యాలు 'చెయ్యడం' ఆరంభించారు, నటులే ఇతర యిష్టులచేత కీర్తనలుకూడా రాయింపించి, ప్రదర్శనాల్లో పాడేవారు. గానశాస్త్రవ్యాప్తితో జనంయొక్క గాన ప్రియత్వపు సగటు హెచ్చినకొద్దీ నాటకగానం మూరుతోచ్చింది. కీర్తనలకి రాగ తాళాలు రాసిపెట్టి ఉంటాయి. నాటకరంగంమీాద సిద్ధించవలిసిన అన్యవ్యక్తిత్వం సంగతి ఏం జరిగితేంగనక, అవి ఆ ఆజ్ఞచొప్పునపాడాలి అనే నియమం కనపడుతుంది. కాని పద్యానికి పక్క అది ఏరకం ఛందస్సో చెప్పే పదంయొక్క మొదటి అక్షరం ఉంటుంది. అది పాడుకోడానికి సంజ్ఞ అని భావించే తెలుగువాళ్ళున్నారు. పాదుగులు సమానంగా ఉండే పంక్తులు నాలుగు రాసి ఇస్తే, అది పద్యమే అను కుని పాట మొదలెట్టేవాళ్లున్నారు. 'పాడవలిసింది' అనే ఆజ్ఞ అక్కడ ఏమీా లేకపోయినా, ఛందస్సుగురించి సంజ్ఞ అక్కడ యిచ్చి ఉన్నా

సరే, ఉన్న ఛందస్సు లేనట్టుగా గణించి, ఊరూ పేరూ లేని రాగం అక్కడ ప్రత్యక్షంగా ఉన్నట్టు గమనిస్తూ, అదే మిక్కిలి సబబు అని తమరు నమ్ముతూ అట్లా నమ్మనివాళ్ళమీద యథాశక్తి ఆక్షేపణ లేవదీస్తూ వ్యవహరించే ఆంధ్రులు పామరుల్లోమాత్రమే ఉంటేబాగానే ఉండును! పద్యాన్ని ఏ బుద్ధిమంతుడో రాగంపోసి యీడ్చాడు బర బరా! తక్కినవాళ్ళంతా అంతే చేసి, అప్పుడు సబబులకోసం గాలించడం ప్రారంభించారు. సంస్కృతరామాయణం పాడినట్టే ఉందనీ, 'కాంభోజీ మేళ విపంచికా రవ సుధాపూరంబు తోరంబుగాన్' అని ఉందనీ, 'నాదనామ క్రియా నవ్య వైఖరి' అని ఉందనీ, పూర్వం అంతే అనీ, ఏది పడితే అది తమకి అనుకూలమైన సబబే అనుకుని వాదిస్తూ, దీనదశలో పడిపోయిన పద్యరాగాల్ని కలిపి పుణ్యం ఆర్జించు గోవాలనే తహతహలో కొందరు కొందరు ఉండిపోయారు. నాటక కర్తల పద్యాల్లో త్రాణ లేకపోవడంవల్ల రాగం కలిపి ఆ ఘటాలకి జీవం పోస్తున్నామని రంగంమీది వాళ్ళూ, నాటకరంగంమీది వాళ్ళు పాడుతున్నారని వర్తమానకాల ప్రజలూ మొదలెట్టి, తెలుగులో పద్యం అనేది కనపడీ కనపడడంతోటే, ఒంటరి పరాయివాడిమీద తనకి ఉల్ఫాగా దఖలుపడి బంజరుగా పెరిగిన నాటుకుక్కని ఇసూ్కొలిపినట్టు, జీవితంలో తను సేకరించి పెట్టుగున్న గాలిపాట సామగ్రికి గొలుసు వదుల్చేసి, స్వంత ఆస్వాదనకి సరేసరి, ఇతరులచేత ఆ పద్యాన్ని ఆస్వాదింపచెయ్య దల్చినప్పుడు కుడా, యథాశక్తి మూలుగు పద్యానికి జోడించి మరీ ప్రకటించడం సాగించారు.

పద్యంలోకి ఏ దొడ్డిదార్నో సన్నసన్నగా వచ్చి చొరబడ్డ క్షుద్ర రాగం సంగతి, ఏకై వచ్చి మేకై కూర్చోడంలా అయింది. పద్య కర్తకీ, పద్యోచ్చారణకర్తకీ, పద్యశ్రోతకీకూడా పద్యరాగసంధానం లాభదాయకం అనిన్నీ, వీళ్ళల్లో ఎవరెవరికి ఎన్నెన్ని లోట్లూ లొసు

గులూ ఉన్నా కమ్ముకోడానికి రాగం ప్రాణావసరమైన కవచమనిన్నీ, ఛందశ్శూన్యాల దగ్గిర్నించి అమూల్యమైన నిరర్థకశ్లాఘ తక్షణం ఆర్జించి గట్టిగా మూటకట్టుగోడానికి రూఢిగా తోడ్పడేటందుకు క్షుద్ర రాగంతప్ప మరి చటాకు-మంత్రం లేదనిన్నీ వీళ్లు అనుకుని వ్యవహరిస్తున్నారా అన్నట్టుగా, తెలుగు పద్యానికి రాగదోహదం మొదట్లో కొత్త, వింత, అలంకారం, ఫ్యాషన్, శాస్త్రోక్తం, శాసనం, విధి, తప్పనిసరి, తద్దినం, అయి, చివరికి, గ్రంథంలో నిద్రించుతూండే పద్యపాత్రలకి రాగపు కళాయి పుయ్యకపోతే పద్యపదార్థాలు కిలమూరి ప్రాణం మీదకి తెచ్చి తీరతాయి, అనే నిస్పృహ తెలుగుజాతికి కలిగిపోయింది. అర్థం గ్రహించేనిమిత్తం పద్యపేటిక తెరవాలంటే తాళంచెవి రాగమే గావును అనే నమ్మకం తెలుగుజనానికి పట్టుగుంది. ఎవడేనా పూర్వకవి రచించిన ఉత్కృష్టకవిత్వంలో పద్యవాక్యం సభాముఖాన్ని చెప్పదల్చిన పతిత ఎంత సమర్థుడైనా, రాగంగనక తియ్యకపోతే, 'ఎంత ద్రోహం చేశావురా, నీమొహంఈడ్చా!' అని వాణ్ణి పబ్లిగ్గా తిట్టడానికికుడా, పద్యరాగశూన్యుడైనాసరే ప్రతి ఆంధ్రవ్యక్తికీ హక్కు-ఆంధ్రజాతి ప్రసాదించేసింది. ఎవడైనాసరే ఏ పద్యమైనాసరే ఏ అవస్థలోనైనాసరే పాడాలి బతగాలి, లేకపోతే ఆ కవిత్వమూ చచ్చిందన్నమాటే, వాడూ అంతే! పద్యం పాడకపోవడం ఒకలోటు, కొంచెం అవకతవక, చివరికి క్షమించరాని ఘోరనేరంకిందికి దిగింది. ఏ బాపతో కాస్తంత ఏ రాగమో తెచ్చి కలిపి పద్యాన్ని మూలుగుతూ చదవకపోతే, కాగితంమీద జీవిస్తూండే పద్యం నోట్లో పడగానే చచ్చిపోతుంది బాబోయ్‌అని హాహాకారాలు చేసే విపరీతపరిస్థితి ఆంధ్రలో పరిపాటి అయింది.

పద్యాలు పుట్టడంలోనే గతులుకలిగి ఉన్నా, రాగం తెచ్చి కలిపితేగాని వాట్లకి పుట్టగతు లుండవేమో అని తమకి భయం అని

చెబుతూ, పామరజనహృదయాల్లోకి పద్యాల్ని శ్రావ్యంగా జొనవడాని కనే సాకు వెలిబుచ్చుతూ, (స్వంత పెట్టుబడి అక్కర్లేకుండా, పరాయి సొమ్మైన రాగం అయినకాడికి నొల్లుకొచ్చి ఎకగా పాడేస్తే, అధిక సంఖ్యాకులైన ఛందశ్శూన్యులతాలూకు మెప్పూ—ఓటు తమ పద్యాలకి దఖలుపడి తీరుతుందిగనక, అల్పసంఖ్యాకులైన పద్యవిమర్శకుల్ని ఓడించేటందుకు ఉత్తరోత్రా ఉపచరించవచ్చని ఆంతర్యంలో సంభర పడుతూ) ఎవరో మహాత్ములు ఎల్లానో పద్యంలోకి ప్రవేశం మంజూరు చేసిన అల్పరాగంవల్ల, ఛందస్సుకి ఉచ్చారణలో దుర్గతి పట్టింది, ఒక్కొక్కప్పుడు మృతే సంభవిస్తుంది. ఛందశ్శాస్త్రం బోలెడు. పద్య గమనాలు అనేకం. అవన్నీ స్వతంత్రం. వాటి ప్రత్యేకగమనాలు విని ఆనందించే భాగ్యం తెలుగుచెవులు ఇంతవరకు నోచుకోలేదు. 'ఏమం డోయ్, మీ ఛందస్సూ గిండస్సూ నాకు తెలియదు, శ్రావ్యంగా రాగం ఉంటే హాయిగా వింటాను. లేకపోతే ఎవడిక్కావాలయ్యా పాడు మాటలూ!' అని కొందరు ప్రతీపద్యాన్నీ నరికి మాట్లాడేవాళ్లు ఉన్నారు. కాని, పాపం, ఆ అనడంలో తమ భావని తమరేమం టున్నారో వాళ్ళెరగరు. ఛందస్సు అనేది పద్యాలుకట్టే నేర్పరుల సాంకేతికభాష అయింది. పద్యకవిత్వాస్వాదన అనేది తెలుగులో విరి విగా లేదు. పద్యరూపంలో ఉండగల కవియొక్క రచనని దాని సహజగమనంతో చురుకుగా వినడమనేది కల్లవార్త అయిపోయింది. కొత్త పద్యభావాన్ని వినడం అలవాటు తెలుగులో లేదు. అది చెవిని పడ్డప్పుడు తమరే గ్రహించుకోగలిగినప్పటి ఆనందం, ఆంధ్రుల్లో చాలా మందికి సయించదు. కవి అన్న పదాలు చిరస్మరణీయాలుగాని, అవి పాడి వాటిని ఘనపరుస్తాననేవాడి గాత్రమూ అది వ్యాఖ్యానిస్తాననే మధ్యవర్తి చేసే ఉపన్యాసమూ కావని, ఆంధ్రులు మరిచిపోయిన స్థితి వచ్చింది. ఉపన్యాసం నేటివరకు తెలుగులో ప్రత్యేక కళ కానేకాదు.

రాగప్రమేయం ఉండే చోట్లకి ఎగబడ్డట్టు, కేవల పదాలు మాత్రమే వాళ్లాడే సందర్భాలకి ఆంధ్రులు ఎక్కరు. రాగరహితమైన ఊసు ఆంధ్రులికి డిళ్ళ. పరోక్షు ఉపన్యాసాలకి పీఠ్ళు ఏర్పడ్డతరవాత, ఉపన్యాసం ఎవడికైనాసరే హస్తగతం కావచ్చునని తెలిసిపోయింది. ఉపన్యాసకులు కాని ఆంధ్రులు అరుదు. కాబట్టి తెలుగుఉపన్యాసం ఎవరిదైనాసరే విలువ స్థిరం. ఆంధ్రలో యోచనకి ఖాతరీ లేదు, యోచన మెచ్చరు. కవిత్వం ఆలోచనామృతం అని ఒప్పుగునే రసజ్ఞులు కూడా, రాగదూరం అయిన పద్యం మృతమే అంటారు. ఛందోలంకారజ్ఞానం లేకుండా పద్యాస్వాదన చెయ్యలేం మిథ్యాకళ అల్పరాగ మహిమవల్ల తెలుగులో సిద్ధించడంవల్ల, చాలామందికి మహాప్రబంధ పద్యాలూ ఆశీర్వచనపద్యాలూ స్వాగతపద్యాలూ అన్నీ మామేకం—ఒకటే జాతి. వాళ్ళ ప్రాణానికి—కనిపించే పద్యం ప్రతీదీ, ఛందస్సు తనకి అక్కర్లేదు గనకన్నూ, తన కూను రాగంతో తనుసిద్ధం గనకన్నూ, గొప్ప కవిత్వమే. పద్యగమనంలో శ్రావ్యత లేదని తనుదు నిర్ధరించగలిగినట్టు, దానికి శ్రావ్యత కలిగేనిమిత్తం అల్ప రాగం—పచ్చురకం అయినాసరే—ఉండి తీరాలని చాలమంది మచ్చుటపడడం వల్ల, ఆంధ్రకవిత్వవ్యాప్తికి కలిగిన ముప్పు ఇంతా అంతా కాదు. అన్ని విధాలా స్వాతంత్ర్యం ఉండాలని కోరే ఆంధ్రులు పద్యకవిత్వానికి స్వాతంత్ర్యం ఇవ్వరు, అది ఏ సంబంధమూ లేని ఒక క్షుద్రరాగానికి బానిసగానే ఉండాలని వాళ్ళ పట్టు. తోకా మొకా లేని రాపుగతాలు పద్యంపై దానికి మాడేసి పడేసి దాన్ని కూడి స్తేతప్ప పద్యానికి వేరే జరుగుబాటు ఉండదని వాళ్లనమ్మకం. ఆరీతిగా పద్యానికి ప్రాణప్రతిష్ఠ చెయ్యడంకని తన భుజస్కంధాల మీద వేసుకున్నట్టు ప్రతీ ఆంధ్రుడూ బాల్యంనించీ గొంతెత్తి ఘోషిస్తూంటాడు.

ఇతర భాషల్లో గద్య చెబుతారు, పద్యం పఠిస్తారు, పాట పాడతారు. తెలుగులో (తెలుగుని అనుకరించే భాషలంటూ ఉంటే వాటిల్లోనూ) పద్యాలుకుడా అనియమంగా పాడతారు. ఆంధ్రలోకంలో ఇవి పాడడపు సొంపూ, నాటకరంగంమీదకుడా పద్యాలు పాడడంలో ఉండే లాభనష్టాలూ, సాధకబాధకాలూ, మంచిచెడ్డలూ ఔచిత్య అనౌచిత్యాలూ గమనించడం చాలా అవసరం. ఆ పనిలో, 'పద్యం' 'రాగం' అనే మాటలకిన్నీ, వీటికి సంబంధించి తరుచు వాడవలిసిన అవసరం వచ్చే తక్కినమాటలకిన్నీ అర్థాలు ఫలానా ఫలానా అని ఇదమిత్థం చేసుగుని మరీ తర్కించడం ధర్మం. ఏమంటే ఒకే పదానికి వాదిప్రతివాదులు వేర్వేరు అర్థాలు ఆరోపించుగుని, ఉన్న సంగతి తక్కినవారితో చెప్పక వాగ్యుద్ధం ప్రారంభిస్తే, అది తెమలదు. మరో సంగతి. బాగా, చక్కగా, మంచిగా, భేషుగ్గా, బలేగా, అందంగా, పసందుగా, సుందరంగా, ఉచితంగా, యథోచితంగా, రసోచితంగా, అర్హంగా, శ్రావ్యంగా, హాయిగా, చల్లగా, సుఖంగా మొదలైన మాటలు అర్థవ్యాప్తియొక్క ప్రమాణం వ్యక్తికి గల సంస్కార గుణాన్ని బట్టి ఉంటుంది గనక, ఇటువంటివి వాదన లోకి జొనపకూడదు. సహేతుకమైన చర్చవల్ల తేలింది యథార్థం అని నమ్మాలిగాని, సారాంశం ఫలానాగా ఉండాలని ముందే ముచ్చటపడి, తన్నిమిత్తం సబబుల్ని వంచి నప్పించాలని యత్నం చెయ్యకూడదు. పూర్వసంప్రదాయం గనక అంతా ఒప్పే, లేకపోతే పూర్వవ్యాపారం గనక అంతా తప్పే అంటూ దరహంమీద సూత్రించి పారెయ్యకూడదు. అల్లాగే నేటి ప్రమేయం గనక అంతా పాడు, లేకపోతే నేటివ్యాపారం గనక అంతా మేలు అని శాసించేస్తూ మాట్లాడకూడదు. ఒకవ్యక్తికి తెలియని విషయాలుగాని చేతగాని వ్యాపారాలు గాని, పోతేం అనిగాని, భూమ్మీద లేకపోతే అనిగాని

దెబ్బలాడకూడదు. చెప్పే విడి సబబుల్లో హెచ్చుతగ్గు లేనప్పుడు, వాదనవల్ల తేలిన సారాంశం సత్యేతరమూ అని మళ్ళీ శంకలో పడ కూడదు. ఒక పక్షం వాదించేటప్పుడు ఆ పక్షానికి అనుకూలించే సబబులు చెప్పి ప్రమాణాలు చూపించాలిగాని, ఉపమానం ఏదో లేవదీసి, ఉపమానంలో ఫలాన ఇతరలక్షణాలు పట్టాయిగనక, ఆ యితర లక్షణాలు ఉపమేయానికి కూడా పట్టితీరాలని అనుకోకూడదు. పూర్వసందర్భం ఏదేనా ఉల్లిఖించేటప్పుడు ప్రస్తుత సందర్భానికి ఎంత వరకు అన్వయిస్తుందో గమనించాలి, పూర్వరచనలోని వాక్యం తెచ్చి గమనించేటప్పుడు, ఆ వాక్యంలో ఒక పక్షానికి అనుకూలించే భాగం మాత్రం లాక్కొచ్చి, తక్కిన భాగం ప్రతికూలంగా కనిపిస్తే, అది అక్కడ అసలే లేనట్టు గప్‌చిప్‌గా ఊరుకోకూడదు. దాన్నికూడా ఉటంకించి, దానికి సమాధానం ఏమున్నా చెప్పగలిగితే చెప్పేసెయ్యాలి.



# 3. పద్యరూపం

ప్రస్తుత విషయానికి సంబంధించిన ముఖ్య పదాలు రెండు — పద్యం, రాగం. ముందు 'పద్యం' గురించి ఆలోచన చేద్దాం.

పద్యం అనగా పాదాలు గలది. పాదాలు చాలా ఘటాలకి ఉన్నాయి. కాని, యిక్కడ పాదం అంటే నియమిత మైన గణాల లెక్కగల పదరచన. రెండుగాని, మూడుగాని, నాలుగుగాని, అయిదు గాని అక్షరాల సంపుటి 'గణము' కాని యీ చివరి అయిదక్షరాల గణం విస్తారం సందర్భించదు. పొడుగు అక్షరం గురువు, పొట్టిది లఘువు. నొక్కి ఊది, అచ్చి, పలకవలసివచ్చే అక్షరాలు గురువులే అనుకున్నారు. ఈ రెండు రకాల కలగలుపూ ఈ యీ క్రమంలో ఉంటే ఈయీ గణం అని పేర్లు కల్పించారు. ఈయీ గణాలు ఇల్లా ఇల్లాంటి క్రమంలో ఉంటే బద్ధులైతే పద్యం పేరు ఫలానా అంటూ పద్యాల పేర్లుకూడా సృష్టించారు. పద్యాల్లో పదాలు సంఘటీ చెయ్య బడి ఉంటాయిగనక, అర్థభావాలమాట ఎల్లాఉన్నా, చెవికి ఇంపుగా ఉండేటట్టు నాదసామ్యంకూడా సిద్ధింపజేస్తే ఉభయతారకంగా ఉం టుందనే ఆశతో యతులనీ ప్రాసలనీ శబ్దాలంకారాలనీ అంత్యప్రాస లనీ బోలెడు ప్రత్యేకపు సరంజాం వేసేశారు. రెండుపాదాల పద్యం ద్విపద. నాలుగు పాదాలవి చంపకమాల, ఉత్పలమాల, మత్తేభం, శార్దూలం — మొదలైనవి. కంద, గీతాలకికూడా నాలుగేసి పాదాలే. సీసానికి నాలుగు పెద్దపాదాలూ మరినాలుగు చిన్నపాదాలూనూ. తెలుగులో ఏకపాది, త్రిపాది లేవు. చాలావరకు 'చతుష్పాత్తులు.' భావం దిగడిపోయినప్పుడు ఎప్పుడేనా ఒక్కొక్కరు పంచపాది రాస్తారు, కాని సాధారణంగా షట్పాదులు రాయరు — కన్నడంలో

లాగే. కొందరు అవసరం చొప్పున బహుపాది రచించి 'మాలిక' అనేపేరుతో దాన్ని వ్యవహరిస్తారు.

తెలుగు ఛందస్సు గురు—లఘు ప్రస్తారంతో బ్రహ్మాండంగా సంకల్పించారు. ఒకే పాదంలో 26 అక్షరాలు ఉన్నా ఉండవచ్చునని ఒప్పుకున్నారు, ఒక్కొక్క పాదంలో 1, 2, 3, 4, 5, 6 ఇల్లాగా అక్షరాలు ఉండడం తటస్థించినప్పుడు, ఆ మూరకాల్లో ఉండగల వృత్తసంఖ్య క్రమంగా 2, 4, 8, 16, 32, 64 ఇల్లాగ్గా ఉంటుందని, చూపించారు. తెలుగులో మొత్తంమీద 13, 42, 17726 పద్యాల రకాలు ఉండగలవు. కాని, ఇన్నికోట్లలోనూ ఏ వందో గుర్తింపబడ్డాయి. అందులో ఒక యాభై సంస్కృతశ్లోకాల రకాలకి అనుకరణం. కాని, ఆ రకాల్ని చాలా స్వతంత్రంగా అనుకరించారు. వాటిల్లో లేని షరతులూ నియమాలూ అదనంగా తెచ్చిపెట్టుకున్నారు—యతీ, ప్రాసా, చరణాంతంలో శబ్దాంతం కానక్కర్లేకపోవడం మొదలైనవి. కాని, గద్యకి మిక్కిలి చేరువై, మొత్తం 32 అక్షరాలని లెక్కఉండీ, సంస్కృతంలో ఎంతో విరివిగా వాడబడ్డ అనుష్టుప్పుగురించి, తెలుగులో ఏర్పాటు చేశారు కారు. ఎటొచ్చీ, మాత్రలలెక్క 64గల కందాన్ని సృష్టించినట్టు కనిపిస్తారు. అనగా, అనుష్టుప్పు ఎవడైనాసరే రచించడానికి వీలుగా వాళ్ళు కల్పించకుంటే, తెలుగులో ప్రతివాడూ రచించెయ్యకుండా జాగర్తపడడంసమిత్తం కందం కల్పించినట్టు తోస్తుంది. ఏమైతేం, తెలుగులో సేకరింపబడ్డ ఛందాల్ని మూడువిధాలుగా యోచించవచ్చు :— (1) ఉన్నపళంగానే 'తాళం' వెయ్యడానికి సరిపోయేవి (2) మాత్రలలెక్క కట్టి ఏదైనా ఒక తాళానికి సరిపుచ్చడానికి వీలైనవి (3) గమనంలో ఏదో ఒక నియమం ఉన్నప్పటికీ ఏ ఒక తాళంకిందికీ రానివి.

అక్షరాల పొట్టిపొడుగుల క్రమం ఫలానా మోస్తరుగా ఫలానా 'ఉత్పలమాలలో' ఉండాలి అనగానే, ఆ అక్షరక్రమం లోంచి ఒక రకమైన నడక బయల్దేరుతుంది, అనగా ఆ అక్షరాల్ని యథారీతి మనం వరసని పలికేటప్పుడు, ఒక నాదం తల ఝూడిస్తూ నడిచి వెడుతూన్నట్టు అనిపిస్తుంది. గానంలో వ్యవహరింపబడే 'తాళం' ఏదేనా ఇటువంటి వాటిల్లో అవలంబించి సరిపుచ్చడానికి కూడా వీల్లున్నాయి, ఆ శీర్షికకింది పద్యాలన్నింటికీ నడక 'స్థిరం' గనక. కాని సీసం, గీతం, ద్విపద — మొదలైనవి కొన్ని ఉన్నాయి. సీసానికి నడక స్థిరంకాదు. ఏమంటే దానిపాద నిర్మాణంలో ఇంద్ర సూర్యగణాలున్నాయి. ఇంద్రగణాలు ఆరు. కాని వాటిల్లో రెండు భిన్నపరిమాణ వర్గాలున్నాయి. సూర్యగణాలు రెండే; వాటి పరిమాణాలు సమానమే కూడాను! సీసపాదంలో మొత్తం ఉండవలిసిన ఎనిమిది గణాల్లోనూ మొదట ఆరు ఎవైనాసరే ఇంద్రగణాలూ, తరవాత ఏవైనాసరే రెండు సూర్యగణాలూ — అని ఉంది. ఉండవలిసిన ఆరు ఇంద్రగణాలూ ఒకే పరిమాణవర్గానికి చెందినవైతే (భ,సల- ఈ రెండింటికీ పరిమాణం, 4 మాత్రలు : తక్కిన ర, త, నగ, సల- ఈ నాల్గింటికీ పరిమాణం, 5 మాత్రలు : (లఘువు ఒక మాత్ర, గురువు 2 మాత్రలు — ఏగణంలో ఏస్థానంలో ఉన్నా సరే!) అవి వరసవి పఠించేటప్పుడు దెబ్బ పడుతుంది, అనగా ఒక విధమైన 'తాళం'. 4 పరిమాణంవి కొన్నీ 5 పరిమాణంవికొన్నీ కలగాపులగంగా సీసంలో సందర్భిస్తే వాటికన్నింటికీ పేరు 'ఇంద్రగణం' అయినా, పరిమాణాలలో తేడాలవల్ల, నడక సక్రమంగా ఉండదు. అల్లాంటి సీసాల్లో లెక్ఖనంగతి చూడక నడక కుంటుతోంది అని సామాన్యంగా అంటారు. ఒక్కొక్క పద్యరకానికి కావలిసినంత గ్రంథంఉంది. దండకాల గణాల్నీ, రగడల గణాల్నీబట్టి, వాటిని

పూర్తిగా లయప్రకారం అనవచ్చు. ఆటవెలదిలో మొదటి పాదం లాగ రెండోపాదం ఉండదు. కాని, మూడోది మొదటిదిలాగా, నాలుగోది రెండోదిలాగా ఉంటాయి. బహుశ అందుకనేగావును దాని కాపేరు.

తెలుగుజాతి వేసుగున్న పథకంప్రకారం కోట్లాది నడకలు సూచింపబడి ఉన్నాయి. ఒక వందరకాలు యత్నించి చూపించిన వాళ్ళున్నారు. కాని సర్వసాధారణంగా అమలులో ఉండే కొన్ని పైన చెప్పడం అయింది. 'కందం'లో నియమాలు ఎక్కువట, అందుకని కందం చెబితేగాని 'కవి' కాడు—అనేమాట పుట్టింది. అనగా, ఎంత శ్రమఉంటే అంత గొప్ప పనివాడితనం అందులో ఉంటుందని! కాని, అనుభవంలో శ్రమ వేరూ, పనివాడితనం వేరూ. ఇక ఏ మనస్థితికి ఏ రకం పద్యం వాడాలీ అనేదికూడా తేలదు. అంటే, సీసం ఎప్పుడు రాయాలీ, గీతం ఎప్పుడు, ద్విపద ఏఅవస్థకి, చంపకమాల ఎప్పుడు? అనే వాట్లకి సమాధానాలు అద్వితీయంగా ఉండవు. శోకరసానికి ద్విపద అని కొందరు, కాదు వీరరసానికే అని మరికొందరు. చంపక మాల ఉత్పలమాలలు శతకాలకని వేరేకొందరు. లలితమైన ఉదంతా నికి ఇవి గాని, గంభీరంగా రాజసంగా ఉండాలంటే మత్తేభశార్దూలా లని ఇంకాకొందరు. మత్తేభం పుడితే ఒంటరిగా ఉండదు పక్కనే మరొకటో రెండో ఉంటూంటాయి, దాని గమనం అల్లాంటిదని అంటారు. శ్రీనాథుడిది సీసం, ఆటవెలది వేమన్నది, కందం కవి చౌడప్పది, మత్తేభశార్దూలాలు ధూర్జటివి అంటూ పంపకాలు చేసే వాళ్లున్నారు—కడంవాళ్ళకి ఇవి నయించవట్టు. మంచి కోపంలో చాలా కఠినంగా ప్రసంగించడానికి మహాస్రగ్ధరలాంటివి వాడాలని ఒక తెగవా ళ్ళంటే, అలాంటివి శృంగారానికికూడా వాడచ్చు అని చూపిస్తాడు మరో కవి. చాలా సంగతులుంటే సీసం, అట్టే లేకపోతే కందగీతాలు

నందు పద్మజయుతంబుగ ను త్ప ల మా లయై చనున్. స్నగ్ధరూరా, విలసత్ త్రయోదశయతిన్ మ త్తే భ వి క్రీ డి తా, హ యమాచున్ స భ, రంబులున్ న, మ, య, వ, వ్రాతంబులన్ చెల్వగున్. సారా చారవిశారదా యిన యతిన్ శా ర్దూ ల వి క్రీ డితాకారంబై మ, స, జ, ంబులున్ మరి స, తా, గ, ప్రా ప్తమై చెల్వగున్. కం ద ము త్రిశగణంబుల, నందము, గా, భ, జ స, నల, ము లటవడి మూటన్, జెందున్ నల, జ, ల నారిట, నొందున్ దుది గురువు జగణముండదు బేసిన్. శ్రావణాభరణాంక విన్ ర, స, జా, భ, రేఫల, దిగ్విరామాం హావంబుగ మ త్త కో కి ల యంద్రు దీని కవీశ్వరుల్. ఇంద్రగణ ములు మూ డినగణ మొకటి చంద్రాస్య ద్వి ప ద కు జనుజెప్ప రేచ. అమరంగ న, స, హ, ంబులం దాదిగా నొండెడ గా దేని యాదిన్ తకారంబుగా నొండె లోనం దకారమ్ము లిమ్మై గ కారావసానంబుగాం జెప్పినన్ దం డ కం బంద్రు దీనిం గవీంద్రుల్."

ఇక యతులు : అచ్చుల్లో— అ ఆ ఐ ఔ ; ఇ ఈ ఋ ౠ ఎ ఏ ;
ఉ ఊ ఒ ఓ.

హల్లుల్లో— వర్గాల్ని బట్టిన్నీ, మరి ప్రత్యేకించి కొన్నిన్నీ.

ఈ గొడవ అల్లా ఉండనీండిగాని, గద్య ఉంటూాంటే బోలెడు ప్రతిబంధకాలుగల పద్యం అసలెందుకండీ, అనగలు. 'గద్య' అంటే చెప్పతగినది, 'వచనం' అన్నా అంతే. కాని, యీ యోచనలో తిరకాసు ఏమిటంటే, ఏ రచనతరవాత ఏ రచనకి ప్రాముఖ్యం వచ్చిందో గమనించకపోవడం! ఆదిని 'ఓం' అయితేం 'కున్' అయితేం, నాదం లోంచి గానకవిత్వాలు ఆవిర్భవించడంలో, 'గీత' అనే గ్రంథనామం ఉండడ వల్ల, గేయరూపంలోనే పదరచన బయల్దేరినట్టు అన్నిజాతుల వాళ్లూ ఒప్పుకున్నారు. గేయంలో శబ్దం, గానం, గమనం— అనగా,

వ్యక్తనాదం, అవ్యక్తనాదం, నియమితమైన నడక—చేరి ఉంటాయి. కాని, కాలక్రమాన్ని అవ్యక్తనాదం అయిన 'గానం', స్వతంత్రంగా, ఏ యితరంమీదా ఆధారపడకుండా ప్రాణికోటిని ఆకర్షించగలగగానే, అది ప్రత్యేకకళ కాగా, గేయంలో దానికి స్థానం పోయింది. అప్పుడు పదరచనలో శబ్దం, నియమితమైన నడక—ఈ రెండే నిల్చాయి. ఇటువంటి పదరచన 'పద్యం'. నియమితమైన నడక—అనే తాళంకుడా ప్రత్యేకంగా స్వతంత్రంగా జనాకర్షణ చెయ్యగలగగానే, దానికిగుడా పదరచనలో స్థానం అముఖ్యం అయింది. అప్పుడు శబ్దమే నిల్చి గద్యకికుడా స్వాతంత్ర్యం వచ్చింది. ఆటంకాలూ, శృంఖలాలూ తగ్గిపోవడంగదా స్వాతంత్ర్యలక్షణం! గేయానికి స్వాతంత్ర్యం వచ్చి 'పద్యం' అయి, పద్యానికి స్వాతంత్ర్యం వచ్చి గద్యకుడా కళ అయింది. ఆంధ్రంలో దీనికి దృష్టాంతం వీరేశలింగంపంతులుని 'గద్యతిక్కన', అనడం. ఇట్లా ఉండగా, వెనకటి అవసరాల్ని బట్టి పద్యం వెనక విరివిగా రాస్తోచ్చారు. ఇప్పుడూ పద్యరూపం అవలంబించేవాళ్ళు ఉన్నారు. వాళ్ళకి నియమాలు పరిపాటి, అవి ఆటంకాలూ శృంఖలాలూగా వాళ్ళకి తోస్తే. వాళ్ళు పద్యం గొడవ మానుకుని మరోపని చూసుకునే ఉండేవాళ్లు. క్రియాముఖ్య 'పద్యం' అనేది కవితాసాధనకి ఒకసాధనంగనక, సమర్థుడు ఆ రూపం అవలంబించినప్పుడు, కూడదని ఎవరనగలరూ? అది ఎంతమందిని ఆకర్షిస్తుందీ అంటే, చెప్పలేం!

కాబట్టి గద్యకళ ఏర్పడిఉండగా, దానిమీద మరికొన్ని నియమాలు కల్పించుకుని పద్యకళ తయారుచేసుకోలేదు, ఆంధ్రజనం. పద్యకళ ఉంటూండగా, దానిలోని నడక అప్రధానమైపోయి గద్యకళ ఏర్పడింది. అటువంటప్పుడు మరి పద్యం ఎందుకు? కళలో ఒక రూపం వెనక్కిపడి మరో రూపం జనాదరణ పొందేటప్పుడు, వెనకటి రూపం నాశనంఅయి మాయంకాదు, ఉంటూనే ఉంటుంది. అల్లాగే పద్యరూ

పంకుడా. నేటి పరిస్థితుల్లో ధారణ అముఖ్యం. కాని ఎవడేనా ధారణని తిరస్కరించవచ్చుగాని. నటు డెట్లా తప్పించుగుంటాడూ? పద్యం ధారణకెంత వీలూ? దానిలో ఉండే వర్ణసామ్యం మొదలైనవి కంఠపాఠానికి ఎంత అనువూ? మానవసంభాషణకి దూరం అవడంవల్ల పద్యం మహిమాస్పదంగా జనం భావిస్తారు. ప్రపంచభాష లన్నింటిలోనూ ఇంకా పద్యరూపం గణింపబడుతూనే ఉంది. పద్యరూపంలో లెక్క ఉంటుందిగనక, దాన్ని ఋజువుచేసి సరిచూసుగోడానికి ఎక్కువ సాధనాలుంటాయి. పద్యరూపంలో స్థలం కుశలం అవడంచేత పదాలు కాదు ప్రతి వర్ణమూకుడా పొదుపుగా వాడాలి. నియమితమార్గం ఉన్నప్పుడు, వేగం వృద్ధి అవుతుంది. అందుచేత ఎంతోగాథ చెప్పడానికి ఒక్కొక్కడు పద్యమార్గం అవలంబిస్తాడు, వేగసిద్ధికోసం. గద్య ఎవరో చేసినట్లు కనిపిస్తే పద్యం ఏకపళంగా మొలిచినట్లు కనిపిస్తుంది, ఇదివరకే తయారై ఎక్కడో మాటున పడిఉంటే, కవి దాన్ని ఆవిష్కరించి తెచ్చి మనకి ఇచ్చినట్టు ఉంటుంది. పద్యరూపంయొక్క స్వభావం తెలిసిన శ్రోతకి కర్తయొక్క మార్గం పరిచయం కావడంవల్ల తను కుడా ఆ దిశలోనే వెళ్లి కర్తని మధ్యదార్లో కలుసుకోడానికి యత్నించే అవకాశం ఎక్కువ ఉంటుంది. మోతాదులో మాట్లాడే సంగతిగురించి జనం ఎక్కువ శ్రద్ధ వహిస్తారు, ఎప్పుడు ఆఖరవుతుందో తెలియని వ్యాపారంలో శ్రద్ధ అవిచ్ఛిన్నంగా ఉండదు. అందువల్ల, పద్యం వినడానికే జనకుతూహలం ఎక్కువగా ఉంటుంది. భావౌన్నత్యాన్ని బట్టి గద్యకుడా కవిత్వం అనబడవచ్చుగాని, చిరస్మరణీయ వాక్యాలు, ప్రతిమానవుడి అనుభవాన్నిబట్టీ, పద్యరూపంలోనే విరివిగా ఉంటాయి. జనబాహుళ్యంలో కలిగించవలసిన విజ్ఞానం సురక్షితంగా ఉండేటట్లు చెయ్యగల ప్రామాణికత్వం పద్యరూపంలో ఎక్కువ ఉంది. ఒకరినించి మరొకరికి పాకినప్పుడు గద్యరచనలోకంటె పద్యరచనలోనే

వర్ణచ్యుతి తక్కువగా ఉంటుంది. కవి ప్రకటించింది ప్రకటించినట్టు చాలా కాలం తరవాత వాళ్ళకి జోనుపులూ మినహాయింపులూ లేకుండా అందడానికి పద్యరూపం అయితేనే ఎక్కువ సావకాశం ఉంది. పద్య రచనలోని ఒక్కొక్కచోటి పదప్రయోగం పదస్వరూపనిర్ణయానికి అనుకూలిస్తుంది. ఒకిప్పుడు కొంతకాలంపాటు మోజుగా ఉండే పద్య విశేషం తరవాతకాలంలో విసర్జింపబడడం జరగవచ్చుగనక, సకృత్తుగా అటువంటి రకాలవల్ల కాలనిర్ణయంకూడా చెయ్యవచ్చు. ఒక్కొక్క పద్యరచయిత అవలంబించే పద్యరూపాలవల్ల అతడి సంప్రదాయమూ, అతడి ఇష్టకవుల జాడలూకూడా తెలుస్తాయి.



# 4. పద్యాల చాకిరీ

పద్యరూపంలోని భావానికి మాత్రమే కాదు, భావాన్ని ప్రకటించడానికి తోడ్పడే శబ్దానికిమాత్రమే కాదు, శబ్దంయొక్క ప్రతి వర్ణానికీకూడా ప్రాముఖ్యం ఉంది అనే సంగతి ఎరిగుండడమేకాక పాటించగల సామర్థ్యం ఉన్నవాళ్ళుమాత్రమే పద్యరూపం అవలంబించడం జరిగితే, మరి కావలసిందేమిటి? కాని, అట్లా జరుగుతూండదు. అట్లా జరక్కుండా ఉండడానికి అవకాశాలున్నాయి. గొప్ప భావం ఏదేనా పద్యరూపంలో ఉంటే, జ్ఞాపకం పెట్టుగోడానికి ఎక్కువ వీలు అనేది అంతా ఒప్పుగునే విషయమే. ఈ విషయాన్నే తిరగేసి, జ్ఞాపకం పెట్టుగోవలసిన అవసరంఉండే ఇతరసందర్భాలగురించి పద్యరూపం వాడకం ప్రారంభించారు. శబ్దాలూ వాటి అర్థాలూ జ్ఞాపకం ఉండవలసినవి గనక వాటికి పద్యరూపం, అనగా నిఘంటువుకి. వ్యాకరణం జ్ఞాపకం ఉండవలసినదిగనక దానికి పద్యరూపం, 'పద్యాంధ్ర వ్యాకరణం'. అక్కణ్ణించి జ్ఞాపకంపెట్టుగోవలసిన అవసరం లేకపోయినా, ఏదేనా విషయానికి సంబంధించిన పేర్లు పెద్ద జాబితాగా ఉంటే, అనగా రాగాల పేర్లు వస్తువులపేర్లు మందులపేర్లు జంతువులపేర్లు మనుష్యులపేర్లు మొదలైనవి, వాటికికూడా పద్యరూపమే కొందరు స్వీకరిస్తోచ్చారు—తమరు సేకరించగలిగిన పేర్లు గద్యలో ఉంటే చెల్లాచెదరైనట్టు కాకుండా, పద్యంలో బందోబస్తుగా ఉంటాయిగదా అని. అటువంటివి 'కవిత్వం'లో జమకట్టుగోకూడదని కవిత్వ విమర్శకుల దెబ్బలాట. దాన్తో అల్లాంటి పద్యకర్తకి కోపం. అవి పాడినప్పుడు ఇంచక్కా ఉంటూంటే, అవి కవిత్వం కాకపోవడంఏమిటీ, సెబాసు—అంటూ దయాంతరంగులైన ఆంధ్రమహాజనంయొక్క ఏక"గ్రీవ" తీర్మానం. అనగా, 'ఆలోచ

నామృతం' అని చెప్పబడ్డ కవిత్వానికి పద్యరూపం ఉంటే చాలును షరేమీ అక్కర్లేదు—అనేటట్టు అయింది. దానికితోడు, తెలుగు పద్యం అని పేరుమాత్రమే కాని, సంస్కృత సమాస వ్యవసాయం! ఆపైని బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులగురించీ వాళ్ళ యిల్లాళ్లగురించీ తోచిన ముచ్చట్లు! ఈ విశేషాలు పూర్తిగా రంగరించిన ఆశీర్వచన పద్యాలు! అటువంటి పద్యాలు కవిత్వం కాదంటే ఏం ఒఘాయిత్యమోనుడాను, అనే పరిస్థితి.

ఇటువంటి పద్యరత్నాలు సందర్భాన్నిబట్టి రచయించేవి ఒకటి, మూడు, అయిదు, ఎనిమిది, తొమ్మిది, ఇరవై యేడు-ఇల్లాగ్గా ఉంటాయి. ఉత్సవసందర్భంయొక్క గొప్పనిబట్టి ఈ రకం పద్యకర్తల సంఖ్యకూడా హెచ్చుతూ ఉంటుంది. మన్నింపబడేది ఒక కవే అయినప్పుడు, ఈ బాపతు పద్యకర్తలు పదులమీద ఉంటారు. శబ్దాలూ సమాసాలూ చెలరేగడంతప్ప ఆ పద్యాలలో యోచనసంగతి పీడాపోయిరి, పదార్థంగూడా అంతగా దొరకకపోయినా, పైకి వద్దంటూనే వినేసెయ్యాలనే కుతూహలం సమ్మానితుడికీ ఉంటుంది, ఒక రాగేశ్వరుడు వాటిని ప్రసాదించేటప్పుడు వాటిని ఆరగించి మెప్పు కటాక్షించాలని సభ్యులకీ ఉంటుంది. విపులంగా రచనచేసినందుకు ఒక కవికి మన్నన చెయ్యదల్చుగున్నవారికికూడా, ఆ కవి రచనగురించి వినాలనిఉండదు. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారిషష్టిపూర్తిఉత్సవం మూడురోజులపాటుఉదయమూ సాయంత్రమూ బందరులోజరిగింది. మొదటిరోజు ఉదయం వారిమీద పద్యాలు పన్నెండుగురుచదివారు. వారి రచనలగురించి మాట్లాడడానికి ఒక గంటవ్యవధి ఇప్పించవలసిందని ఆయన్ని నేను కోరాను, నేను వారికి ఇష్టుణ్ణిఅవడంవల్ల, ఆయన తత్ప్రకారం కార్యనిర్వాహకుల్ని కోరారు. సాయంత్రం పద్యాలు చదవడానికి పదిమంది కర్తలు పేర్లిచ్చిఉండడం వల్ల, నా మాటలకి వ్యవధి దొరకదని వారన్నారు. మర్నాడు

ఉదయం ఎనమందుగురు పద్యాలు చదివారు. ఆ సాయంత్రం నేను కవిగారికి సభలోంచే నమస్కరించి, ఇంటికి వచ్చేశాను. చదివిన ముప్పైమందిలోనూ నలుగురైదుగురి గొంతికలు శ్రావ్యంగా ఉండడంవల్ల వాళ్ళది అఖండకవిత్వం అని స్థాపించడానికి సభ్యులు కరతాళాలు వేశారు, తక్కినవాళ్ళని కూనేసి నోరుమూనేశారు. కాని, ఆ ముప్పైమందిలోనూ ప్రతిఒక్కడూ ప్రకటించదల్చుకున్నది భావరూపంలో పెడితే ఇల్లా ఉంటుంది :

కవి యంటే యితడే కవి
కవులా మరి తక్కినట్టి గణగణ గంటల్
భువి నిలుచు నితని కవనము
రవిచంద్రులతోటిపాటె రభసం బెసగన్॥

ఈయన బోలెడు వ్రాసెను
వ్రాయుచున్నాడు చాల వడిగా నికపై
ఓ యుజహారిహారులారా
ఆయువు నారోగ్య మొసగి అరయుం డితనిన్॥

వేలాది పుటల్లో అచ్చుపడిఉన్న కవిరచనయొక్క మొహం చూడకుండానే, ఎవరికేనాసరే కట్టబెట్టడానికి అనుకూలించే పైరకం ఉన్నడి భావాలవంటివి ఏ సీసాల్లోనో బిగించి తెచ్చినవాళ్ళందరికీ, వాళ్ళు అవే అయిదారు భిన్నసందర్భాల్లో ప్రయోగిస్తూన్నట్టు తెలిసినాకడా, ఆ ట్టే పెట్టుబడి లేకుండా కవిబిరుదు సుసాధ్యం చెయ్యడానికి నడుంకట్టే ఆంధ్రమహాశయులు తక్కువగా ఉండరుగనక, పద్యరూపంవల్ల నేటి ప్రయోజనాలలో ఇది ముఖ్యం అనవచ్చు. స్వభావసిద్ధమైన వచనం రచించడం కొందరికి రాదుట, అందువల్ల పద్యం రాయడానికి వాళ్ళు అర్హులుట! ఆ మాట వాళ్ళు తెగేసి నిర్మొహమాటంగా పైకి

చెబుతున్నా సరే, వాళ్ళని వినిపించుగోక, 'ఊరుకుండురూ, మీ మొహ మాటమూ మీరూనూ! మీ కవిత్వం బహు చక్కగా నిర్దుష్టంగా ఉంది! ధార బాగుంది!' అంటూ, మాహాత్మ్యం దర్శనం ఇస్తూంటే కళ్ళు మూసుగోడం పాపకారణం అవుతుందేమో అని భయపడు తూన్నట్టు కొందరు తక్షణం తమ కవితానిర్ణయసామర్థ్యానికి దాఖలా కనపరిచేస్తారు. గ్రంథరూపంలో కాక ఇతరత్రా జనబాహుళ్యానికి పద్యం కంటపడే సందర్భం ఇది ఒకటే కాదు. ఇంకా చాలా ఉన్నాయి. ఆయా సందర్భాలలో భాషాడంబరమూ ఇతరపటాటోపమూ పక్కకి నెట్టి భావరూపం చూస్తే ఎట్లా ఉండగలదో నేనే ఆయా రచయిత ననుకుని నమూనాలు ఇస్తున్నాను.

స్వాగతపత్రంలో:

మీ సాటి మనిషి లేడీల,
మా సుస్వాగతము మీకు, ప్రతిభాశాలీ!
శ్రీశుడు మిము రక్షించును,
దాసులమగు మాకు శాస్త్ర దాన మొసగరా!

వీడ్కోలు పత్రంలో:

మానుండి మీరు దూరము
పోనున్నా, రనుచు మాకు బోలెడు దుఃఖం
బును, జీతము హెచ్చును మీ
కని బోలెడు సంతసమును గలిగెనుజుండీ.

పత్రిక ప్రత్యేకస్థలంలో:

ఏదో మిథునం బుండెను,
ఏదో యొక బాధ వారి యెదలో, కాదా
ఏదో ఆకలి, లేదా
ఏదో యొక అగ్ని, యుండె ఇది యిదమిత్థం!

పెళ్ళి పిలుపులో :

మా పిల్లకి పెళ్ళి, ముహూ
ర్తపు వేళ ఫలాన, గనక తప్పక మీారం
తా పిల్లామేకా వ
చ్చి, పెళ్లికార్యము చెయించి శీఘ్రము చనుడీ

దంపతుల్ని ఆశీర్వదించడంలో :

ఈ దంపతు లిద్దర్నీ
ఆ దేవుడు కనికరించి ఆయువు సిరి సం
పద ఆరోగ్యము సంతతి
మొదలైనవి కలగజేసి పోషించవలెన్.

మందుల ఘోషణలో :

ఈ మందు వాడినూ స్తే
ఏ మందును నచ్చదింక ఏమాత్రమునున్
ఈ మందే ఈమందురు
ఏమందుము దీని మహిమ యిహ పరములలో.

ఒక పత్రికని మెచ్చడంలో :

ఈ పత్రిక బహుగొప్పది
యే పత్రిక కింత వ్యాప్తి యింటా బయటా ?
తాపత్రయ మడగించును
చాపత్రయ మంతయున్న చాలా చౌకే.

ఎన్నికప్రత్రంలో :

నాకే మీ ఓటది నా
కీకుండా పట్టిగెళ్ళి యెదిరికి వేస్తే
మీ కర్మంకాలగలదు
నాకే అది కట్టబెట్టి సరుకై మనుడీ

పాఠ్యపుస్తకంలో :

గుఱ్ఱము బండిని లాగును
గుఱ్ఱము తిను పచ్చగడ్డి కాళ్లులు వినుడీ
గుఱ్ఱము నడకలు నడచును
గుఱ్ఱము మడి దున్నగలదు కొండొక సీమన్

కొత్త ప్రచారంలో :

తిన తిండి, కట్ట బట్టయు,
మనగా నొక కొంప, పండ మంచము కరవై
జనులుండ, ధనికులకు, భో
జనవసనాగారతల్పసౌఖ్యములేలా ?

ప్రేమరచనలో :

నీమీద నాకు ప్రేమము,
నామీదను ప్రేమ నీకు నని తెలిసెగదా ?
కోమలమగు మన ప్రేమను
ప్రేమింపరె యితరజనులు, ప్రేమరహితులా ?

గ్రంథేతరంగా తెలుగుపద్యాలు తెలుగుజనానికి కంటి సంపర్కం కలిగించగల సందర్భాలు కొన్ని చూశాం. మరి, తెలుగుపద్యాలు తెలుగుజనంయొక్క చెవినిబడే సందర్భాలు గమనించుదాం. పురాణ

పఠనంలో వినిపిస్తాయి. పఠిత గద్యపద్యాలు సాధారణంగా ఒకే రాగం మీద గబగబలాడించినా, వాటిని బీజప్రాయంగా గణించి పౌరాణికుడు చిలవలూ పలవలూతోసహా వ్యాఖ్యానవృక్షం లేవదీస్తాడు. సభ్యులు పఠితరాగం వల్లా పౌరాణికుడి ధోరణివల్లా ఆనందం పొందుతారు. హరిదాసు నోటంట పద్యాలు వినిపిస్తాయి. అవే కాదు, వచనమే కాదు, పిట్టకథలుకూడా అతడు పాడేసి తరవాత వ్యాఖ్యానం చేసి కావలిస్తే మరోసారి పాడతాడు. కవినోటంట పద్యాలు వినపడతాయి. అతడి నోటితోపాటు గాత్రంకూడా బాగుండి రాగం విసరడం నేర్పాడా కోటలో పాగా వేశాడన్నమాటే. అతణ్ణి జనం అనుకరించేస్తారు. ఒక్కొక్క కవి మంచి గాత్రం పెట్టిపుట్టకపోయినా, తన కొత్త భావానికి ఏ అనకట్టుపూర్వపు రాగమో సంధించి, తంటాలు పడబోతాడు, శ్రోతలు ఏమీ అనలేక బాధతో కాలం వెళ్ళబుచ్చుగుంటారు. మరొక్క కవి యతిప్రాసలదగ్గిర నొక్కుతూ పాదాంతాల్ని మకాం వేస్తూ పద్యాన్ని శల్యపరీక్షకి పెట్టినట్టు వ్యవహరిస్తాడు. భట్రాజుకూడా పద్యోచ్చారణ చేస్తాడు. అతడు రాగం కలపకుండానే, తరుముకూత పట్టినట్టు పద్యాల్తో చెడుగుడి ఆడేస్తాడు. భోజనకాలంలో పద్యాలు అంటారు. సంస్కృతశ్లోకాలు ఫణితిప్రకారంగానూ, తెలుగుపద్యాలు యథాశక్తి రాగవిజృంభణతోనూ కానిస్తారు. అందునిమిత్తం తయారైన అనుభవజ్ఞు లుంటారు. వాళ్ళల్లో ఒకొక్కప్పుడు పోటాపోటీ జరుగుతుంది, తిన్నది సద్దుకునేలాగ భోజనసభ్యులు అరుస్తూంటారు. రైల్లో రెండుమూడు రకాలుగా పద్యాలు వినిపిస్తూంటాయి. కొందరు ఒట్టిపుణ్యానికి, ఎవరేనా ఆకర్షింపబడకపోతారా అనుకుని, ఈలతో మొదలెట్టి, ఏదో రాగంలోపడి కొన్నిముక్కలుకూడా అనేస్తారు. కొందరు, ఏ అణాపద్యాల పుస్తకమో, పావలా ప్రబంధమో కొని, కాలాన్నిబట్టి మోజుగాడున్న

రాగంతో పద్యాల్ని నమిలిపారేస్తుంటారు. ఏ గ్రామొఫోనురికార్డు పద్యాన్నో అనుకరిస్తూ రాగంతీసే యాచకుడు ఉండగలడు. స్నేహితులు చేసుకున్నప్పుడు మంచిగాత్రంవాడిచేత సరికొత్త పాటలతో పాటు, సరికొత్త రికార్డుపద్యాలు పాడిస్తారు. క్లాసుల్లో తెలుగుపద్యాలు అప్పగించవలిసొచ్చినప్పుడు పాడితేతప్ప మంచిమార్కులు వెయ్యరుగనక, అందరూ పద్యాలు పాడడం వినిపిస్తుంది. ఒక్కొక్క ఉపన్యాసకుడు ఉపన్యాసమధ్యంలో ఏ పద్యభాగమో అనవలసిన గండం తెచ్చుకుని, అది పాడలేక మానాలేక నానాయిదీ అవుతాడు. అతడు ఎంత ఉత్కృష్టపద్యం స్మరించదల్చుకున్నా సరే, సుబ్బరంగా పాడగలిగితే తప్ప, సభ్యులు ఆ కవిత్వానికి ఓటూ ఇయ్యరు, ఉపన్యాసకుణ్ణి క్షమించా క్షమించరు.

# 5. రాగం

ఇక, రాగం. నాదం ప్రాణాగ్నుల సంయోగం అంటారు. ప్రాణి వల్లనే కాని ఘర్షణ జరగదు, ఘర్షణవల్లనేకాని నాదం జనించదు — అని ఆ వాక్యభావం అయుంటుంది. వాయురేణువుల ప్రవాహతరంగాలకి దారి సన్నగించినప్పుడు ఘర్షణజరిగి నాదం జనిస్తుంది. అటువంటి పనికి మానవుడి కంఠంలో ఏర్పాట్లు ఉండడంవల్లనే, మానవుడు నాదం చెయ్యగలుగుతున్నాడు. అటువంటి పనివల్లనే, మురళికూడా మోగుతుంది. పైగా, ఒక లోహపుతీగెని మీటినప్పుడుగాని, బిగించిన చర్మాన్ని మోదినప్పుడుగాని, వాటికి కంపనం కలిగి, వాటి ప్రతికంపనం పరిసర ప్రాంతంలోని వాయురేణువులకి సంక్రమించగా నాదం పుడుతుంది. కొంత కాలంపాటు ప్రతి సెకనులోను ఏదో స్థిరసంఖ్యచొప్పున స్పందనాలు పుట్టగలిగితే, నాదం శ్రావ్యంగా ఉంటుంది, అది గానంలో చేరుతుంది. లేకపోతే అది గోల అవుతుంది. స్పందనసంఖ్య సెకనుకి కొంత మొత్తానికి తక్కువగా ఉన్నా, మరోకొంత మొత్తంకంటె ఎక్కువగా ఉన్నా ఆ నాదాన్ని చెవి స్వీకరించజాలదు. ఒక శ్రావ్యనాదానికి సెకనుకి 240 స్పందనాలు అనుకుందాం. దీనికి రెట్టింపు నాదానికి సెకనుకి 480 స్పందనాలు ఉంటాయి. అటువంటి రెండు నాదాల మధ్యరంగంలో ఒక ఇరవై మజిలీలు గుర్తింపగలిగి ఆంధ్రులు, అట్లా ఏర్పడ్డ 22 ప్రత్యేకనాదాలకీ నామకరణం చేశారు, వాటిని శ్రుతులు అన్నారు. కాని, ఈ 22 శ్రుతులూ యథాక్రమంగా గాత్రంతో అని చూపించడం ఇబ్బందే అన్నారు. ఎవరేనా ప్రజ్ఞావంతులు అటా చూపించగలిగినా, శ్రమకి తగ్గ ఫలితం ఉండదన్నారు. ఏమంటే, ఇవన్నీ దేనికది శ్రావ్యమే అయినా, ఒకటి తరవాత మరొకటి అనేటప్పుడు ఆ మరొకటి మొదటిదానిలో కలిసికట్టుగా ఉండపచ్చు, లేక

కర్ణకఠోరంగా ఉండవచ్చు, అన్నారు. మొత్తం 17 స్వరాలయితే పని జరుగుతుందని అనుకుని, స,రి,గ,మ,ప,ధ,ని సంజ్ఞలు ఏర్పాటు చేసుకుని, స,రి—లు3,గ—లు3, మ—లు2,ప–1, ధ–లు3, ని—లు 3, హెచ్చు స– వెరసి 17 అనుకున్నారు. ఈ పథకంకుడా పట్టివ్వలేదు. మూడో 'రి' మొదటి 'గ' కేసి జరిగి దానిలాగే తయారైంది. మూడో 'గ', మూడో 'ధ', మూడో 'ని' అల్లాగే అయినాయి. పర్యవసానం, స, 'రి'లు 2, 'గ'లు2, 'మ' లు 2, ప, 'ధ'లు2, 'ని'లు2, హెచ్చుస—ఇవి ఖాయం అయినాయి. అనగా, మొదటి 'స' యొక్క స్పందనం విలువ 1, అనుకుంటే:

| | | | |
|---|---|---|---|
| మొదటి | రి | $\frac{16}{15}$ | రెట్లు |
| రెండవ | రి | $\frac{9}{8}$ | రెట్లు |
| మొదటి | గ | $\frac{6}{5}$ | రెట్లు |
| రెండవ | గ | $\frac{5}{4}$ | రెట్లు |
| మొదటి | మ | $\frac{4}{3}$ | రెట్లు |
| రెండవ | మ | $\frac{45}{32}$ | రెట్లు |
| | ప | $1\frac{1}{2}$ | రెట్లు |
| మొదటి | ధ | $\frac{8}{5}$ | రెట్లు |
| రెండవ | ధ | $\frac{27}{16}$ | రెట్లు |
| మొదటి | ని | $\frac{27}{15}$ | రెట్లు |
| రెండవ | ని | $\frac{15}{8}$ | రెట్లు |
| హెచ్చు | స | 2 | రెట్లు |

నాదప్రియత్వం హెచ్చినకొద్దీ ఈ స్వరాల్లో పూర్తిగా విహరించే కుతూహలం ఎక్కువైంది. ఆధారం లేందే ఏమీ ఉండదుగదా!

స్వరవిహారానికి ఆధారస్వరం ఉండి తీరాలి. 'స' తప్పదు. 'ప' – ఒకటే గనక తప్పదు.

స $రి_1రి_2గ_1గ_2$ $మ_1మ_2$ ప $ధ_1ధ_2ని_1ని_2$ ṡ

1 2 1 1 2

మొత్తం 7 స్వరాలు ఉండాలంటే ఇక 5 స్వరాలు పుచ్చుకోవాలి. $రి_1$ $రి_2$ $గ_1$ $గ_2$ లలోంచి 2 స్వరాలు 6 విధాలుగా తియ్యవచ్చును, (ఆజోడీలలో $రి_1రి_2$, $గ_1$ $గ_2$ వచ్చినప్పుడు మొదటిది 'రి' రెండోది 'గ') $మ_1$ $మ_2$ ల లోంచి 1 స్వరం 2 విధాలుగా తియ్యవచ్చును. $ధ_1ధ_2ని_1ని_2$ ల లోంచి 2 స్వరాలు 6 విధాలుగా తియ్యవచ్చును. కాబట్టి 7 స్వరాలు ఎన్నుకోడానికి మార్గాలు 6×2×6=72. కేవల స్వరవిహారం, వృత్తాంతంతో నిమిత్తం లేకుండా, రంజింపజేస్తుంది గనక దానికి 'రాగం' అని పేరు పెట్టారు. ఏడు స్వరాల్లో విహరించడానికి వీలైన రాగాలు 72 గనక, వాటిని మేళకర్తలన్నారు. వాటికి పేర్లు పెట్టడంలో, పేరు చెప్పగానే అది 72 లోనూ ఎన్నోదో గ్రహించడానికి అక్షర సంకేతాలు ఏర్పరిచి తంటాలుపడ్డారు. ఇవి జనకరాగాలు, వీటిల్లోంచి ఇతరరాగాలు పుట్టగల వని చూపించి, వాటిని జన్యరాగా లన్నారు.. అధమం 5 స్వరాలుంటే, రాగం కావచ్చునన్నారు – కాని వాటిలో 'స' ఉండితీరాలి, 'ప' గాని 'మ' లలో ఒకటిగాని ఉండి తీరాలి. 4 స్వరాల రాగాలంటూ ఆంధ్ర గానంలో లేవు. అయితే స్వరవిహారంలో ఆరోహణ అవరోహణ లున్నాయిగనక, హెచ్చేటప్పుడు 7, లేక 6, లేక 5, ఉండవచ్చు.

దిగేటప్పుడు 7, లేక 6, లేక 5, ఉండవచ్చు. కాబట్టి, సక్రమంగా స్వరాలు హెచ్చి దిగే రాగ విధాలు 9. ఈ రకాల మొత్తం:

| | | | |
|---|---|---|---|
| ఎగువ 7, దిగువ | 7 — | 1 | రాగం |
| ,, | 6 — | 6 | రాగములు |
| ,, | 5 — | 15 | ,, |
| ఎగువ 6, దిగువ | 7 — | 6 | ,, |
| ,, | 6 — | 36 | ,, |
| ,, | 5 — | 90 | ,, |
| ఎగువ 5, దిగువ | 7 — | 15 | ,, |
| ,, | 6 — | 90 | ,, |
| ,, | 5 — | 225 | ,, |
| | | 484 | |

మేళకర్తలలో ఒక్కొక్కదానికీ ఈ అవస్థ పట్టవచ్చుగనక, సక్రమస్వర రాగాల సంఖ్య 72 × 484 = 34348 అన్నారు. ఇవిగాక, వక్రరాగాల సంఖ్య ఎంతగానేనా పెంచవచ్చన్నారు. అవిగాక రి, గ, మ మొదలైనవాటిని షడ్జమాలుగా మార్చుగుంటే, ఇంకా యితరరాగాలు సంక్రమిస్తాయన్నారు. సుమారు మూడు వేల రాగ నామాలు సృష్టించారు. వ్యక్తిత్వం లేనప్పుడు పేరే ఉండదుగనక, అన్నిరాగాల్ని గుర్తించారన్నమాట. వంద రాగాలమీద కీర్తనలు రచించడానికి సంకల్పించిన త్యాగరాజు దగ్గిరిగా 200 రాగాలు తీసుకున్నాడు. నారాయణదాసుకూడా మేళకర్తరాగాలన్నీ వాడుతూ సుమారు 200 రాగాలు ముచ్చటించాడు. పాటకచేరీలనబడే సమావేశాల్లో 150 రాగాలదాకా వినపడుతూంటాయి. కాని, ఏ రాగం పాడుతున్నాడో దాని పేరు గాయకుడు చెప్పడు, చాలామందికి తెలి

యదు, (రాగకృషి చేస్తూండేవాళ్ళకితప్ప). తెలియనివాళ్ళు (ఆంధ్రంలో నూటికి 99 మంది ఉండవచ్చు) ఎన్నిసార్లు రాగశ్రవణం చేస్తూన్నా, రాగంపేరు తెలియకుండానే రాగాస్వాదన చెయ్యడానికి తమరికి "జన్మ" హక్కు ఉంది అంటూండడమూ అల్లా కూచుంటూండడమే కాని, రాగాన్ని పోలిక పట్టడానికి యత్నమేనా చెయ్యరు—తమరికి గంధర్వాంశ లేదంటూ క్షమాపణ కోరతారు. పాడి ఇతరుల్ని మెప్పించడానికయితే పోనీ గంధర్వాంశ ఉండాలనచ్చుగాని, రాగాభిలాష చూపించడానికి మానవాంశకంటె తక్కువగాఉన్నా సరి పోతుందే! అయినాసరే, ఏమిటో!

కాని, సుమారు ఓ నలభై రాగాలు:— అఠాణా, ఆనంద భైరవి, ఆరభి, ఆహిరి, కన్నడ, కమాను, కల్యాణి, కాంభోజి, కాఫీ, కేదార, కేదారగౌళ, ఖరహరప్రియ, చక్రవాకం, జంఝూటి, జంఝ్లా, తోడి, దేవగాంధారి, ధన్యాసి, నాట, నాటకురంజి, నాదనామక్రియ, నీలాంబరి, పున్నాగవరాళి, బిలహరి, బేగడ, బేహాగ్, భూపాల, భైరవి, మధ్యమావతి, మలయమారుతం, ముఖారి, మోహన, వసంత, శంకరాభరణం, శహాన, శ్రీ, సారంగ, సావేరి, సింహేంద్రమధ్యం, సురట, హంసధ్వని, హిందోళ — వంటివి మాత్రమేనా అధమపక్షం పోల్చుగుని ఆనందించడానికి యత్నించడం మానవాతీతం కాదేమో అని తోస్తుంది. ఆకాశవాణి వచ్చింతరవాత కొన్ని రాగాలపేర్లు జనానికి పరిచయం అయినాయికాని, ఏ రాగానికి ఏ పేరో మాత్రం కొందరికి తెలియదు.

---

# 6. పద్యం - రాగం

పద్యరాగాల వ్యక్తిత్వాలు పోల్చినప్పుడు వ్యత్యాసాలే ఎక్కువగా కనిపిస్తాయి. పద్యరాగాలు రెండూ నాదజనకాలే. రెండూ చెవికి సంబంధించిన కళలే. పద్యానికి పదాలున్నట్లు, రాగానికి స్వరాలుంటాయి. పద్యపదాల అర్థం తెలిసి, పద్యభావం తెలిసి రసోత్పత్తి కావాలి; రాగస్వరాల అర్థం తెలియకపోయినా రాగభావం ఏదో అయినా, రసోత్పత్తి అవుతుంది. 'ఏకమ్' (సంగీతం) ఆపాతమధురమ్ అన్యద్ (సాహిత్యమ్) ఆలోచనామృతమ్' అనే భావం అందువల్లనే పుట్టిఉంటుంది. పదాలూ పదమిశ్రణాలూ అమితం అయినట్టే స్వరాలూ స్వరమిశ్రణాలూ కూడా అమితమే. పద్యంలో వర్ణనాదం యొక్క హ్రస్వత్వ దీర్ఘత్వాలు మాత్రమే గణింపబడతాయి. రాగంలో నాదంయొక్క పొట్టి పొడుగులే కాక హెచ్చు తగ్గులు కూడా గమనించాలి. పద్య పదాలలో 'యమకం' ఉన్నట్టే రాగస్వరాల్లో 'గమకం' ఉండవచ్చు. కొన్ని కొన్ని వర్ణాల సాహచర్యం వల్ల పద్యంలో నాదసౌఖ్యం కలిగినట్టే, కొన్ని కొన్ని స్వరాల సాహచర్యంవల్ల రాగంలోనూ తానంలోనూ నాద సౌఖ్యం జనిస్తుంది. స్వరగమనంలో ఆరోహణ అవరోహణలనే ముందు వెనక నడక లుండబట్టి నాదం విహరించి విహరించి అశంగుకి వచ్చేస్తుంది. పద్యగమనం ఒకే దిశలో ముందుకి పోతుందిగాని వెనకనడక నడవదు. (పింగళి సూరన వెనక్కి-కూడా సార్థకంగా నడిపించిన పద్యం

తా వినువారికి సరవిగ

భావనతోనాను నతివిభా వి సు తేజా

దేవర గౌరవ మహిమన

మా వలసిన కవిత మరిగి మాను నధీశా

తప్ప, ఆంధ్రసారస్వతంలో మరొకటి ఏదీ నేను చూడలేదు). పద్యపదాలకి అర్థా లుంటాయిగనక అవగాహనకి అభినయం దోహ దకరం, కాని రాగస్వరాలకి అర్థాలంటూ ఉండవుగనక అవగాహనే ఉండదు గనక అభినయం అనర్థకం. పద్యభావం గ్రహించడానికి కొంచెమైనా బుద్ధి ప్రయోగించవలిసి ఉంటుంది, అధమం శ్రద్ధైనా పెట్టవలిసి ఉంటుంది. రాగభావం అవ్యక్తంగనక అవగాహనకి కొంచెం మేధాకుడా ఖర్చు పెట్టక్కర్లేదు, శ్రద్ధయొక్క పనికుడా లేదు, హృదయం చాలు. పద్యంలోని శబ్దాలకి అక్షరరూపంలో స్థిరత్వం చేకూర్చడం సంభవనీయం గనకనున్నూ శబ్దాలు అర్థవంతం గనకనున్నూ ఒక పద్యకర్తయొక్క పద్యం ఒకడు తీసిగెళ్ళి మరొక డితో ముచ్చటించడానికి వీలుంది. కాని, రాగస్వరాలు అర్థానికి అతీ తంగనకనున్నూ, స్వరజీవితం కేవలవ్యక్తిసహజమైన గాత్రధర్మాన్ని అనుసరించేది అవడంచేతనున్నూ క్షణికమాత్రవ్యాపారం అవడం చేత నున్నూ వాటిని లిఖించడానికి ఎంత యత్నించినా, ఒక గాయకుడి యొక్క రాగం ఒకడు తీసిగెళ్ళి మరొకడితో వ్యవహరించడం అసం భవం — మహాఅయితే ఆ రాగంపేరు ఆ మరొకడితో చెప్పవచ్చు. గాత్ర ధర్మంయొక్క బదలాయింపు జరగదుగనక, ఎవరి రాగం వారే అనాలిగాని, మరొకడు అనలేడు. పైగా, రాగానికి జననంలోనే యౌవనం జననంలోనే మరణంకూడా ఉంటాయిగనక, మరొకడిమాట అల్లాఉంచి, అసలువాడైనాసరే అనేసింది మళ్ళీ అనలేడు. సంభాషణ ప్రకృతిసిద్ధంగనక, పద్యోచ్చారణ సంభాషణ సంప్రదాయానికి విరు ద్ధంగా ఉండకూడదు గనక, విరుపులూ ఆపులూ విరామాలూ నొక్కులూ వేగాలూ మొదలైనవి అందులో ఉంటాయి. రాగం స్వరప్రవాహంగనక అవిచ్ఛిన్నం. పద్యం శబ్ద ప్రమేయమున్నూ నోటి వ్యాపారమున్నూగనక దాని పఠనం స్పష్టత ఉద్దేశించాలి. రాగం స్వరప్రమేయమున్నూ గాత్రవ్యాపారమున్నూ గనక, అది జరిగేటప్పుడు మాటస్పష్టత ఉంటూండదని బాధపడడం అనవసరం.

---

# 7. కొన్ని యితర పదాలు

విపులంగా విశదీకరింపబడి కేటాయించబడిన పద్య, రాగ పదాలుగాక, ఈ దిగువ పదాలుకూడా తరుచు ఈ మీమాంసలో వస్తూంటాయి: రూపకం, నాటకం, ప్రదర్శనం, సంగీతం, గానం, తాళం, లయ, కీర్తన, పాట, కవిత్వం, గద్య, చదవడం, పఠనం— గాగలవి. వాటినికూడా ఇదమిత్థం అనుకోడం కర్తవ్యం.

రూపకం — రూపసృష్టి చెయ్యడానికి అనుకూలించే పదరచన.

నాటకం — రూపకాలలో ఒకరకం, వ్యక్తులు వేషభాషావస్థాపరివర్తనంవల్ల అన్యులై తోచి పూర్వగాథల్నికూడా ప్రత్యక్షం చెయ్యడానికి సూచనలు గలిగిఉండే పదరచన. అటువంటి పదరచనని రంగస్థలంమీద ఆచరణలో పెట్టడాన్నికూడా 'నాటకం' అనే పదంతో చాలా తెలుగుమంది వ్యవహరిస్తూంటారు. కాని దాని ఆచరణని 'ప్రయోగం' 'ఆట' 'ప్రదర్శనం' అంటే నయం అని బాధపడేవాళ్ళున్నారు.

ప్రదర్శనం — ప్రదర్శించడానికి అనుకూలించే పదరచన.

సంగీతం — ఎక్కువగా పాడబడేది, మాట లుంటాయి, వాద్యాలుంటాయి.

గానం — మానవహృదయాల్ని ఆకర్షించి ఐక్యపరిచే నాదం.

తాళం — శాస్త్రంలో పేరుపడ్డ కాలగణనాలలో ఒకటి. అవి 35 అనీ 101 అనీ 175 అనీ 108 అనీ మతభేదాలు.

లయ — గీతవాద్యాల ఏకసమాప్తం — విలంబ మధ్య ద్రుతాలలో ఒకటి.

కీర్తన — రాగతాళాల సూచనతో దైవపరంగా ఉండేమాటలు.

పాట — రాగతాళాల సూచనతో ఉండేమాటలు.

కవిత్వం — మానవహృదయాల్ని ఆకర్షించి ఐక్యపరిచే మాటలు. సాధారణంగా పద్యరూపం, కాని గద్యకూడా కావచ్చు.

గద్య — హ్రస్వదీర్ఘనాదాలుగల వర్ణాలు ఫలానాక్రమంలో రావాలి అనే నియమంలేని పదరచన.

చదవడం — లిఖితమైన పదరచనకేసి చూస్తూ ఉచ్చరించడం.

పఠనం — పదరచన ధారణచేసి, అక్షరచ్యుతి రానీకుండా అనడం.



# 8. విషయ మీమాంస

అసలు నాటకపద్యం రచింపబడడం చెప్పబడేనిమిత్తమా లేక పోతే పాడబడేనిమిత్తమా? పద్యం అంటే పాదాలు గలిగిఉండేది— సాధారణంగా నాలుగు, ఒకప్పుడు మసలాగే రెండు. దానికి గురు లఘుసమ్మేళనవల్ల నియమితమైన గమనం ఉంటుంది, ఉండాలి అన్న మాట. లిపిలో కనిపించే తెలుగుపద్యంయొక్క విశేషం ఏమంటే, అది ఏ ఛందస్సో తెలుపుదుచేసే అక్షరం దాని ఆదిని ఉంటుంది. (ఉండక పోతే ఘోరకలి సంభవించి, ఆంధ్రమహాజనం అంతోటి పద్యాన్నీ పద్యమే అనుకోక ఉత్తగద్యాని చూసినట్టే చిన్నచూపు చూసి, స్వంత రాగంతో పాడడంమాని చదవడం మొదలెట్టినట్టాయినా, జనం కళ్ళ ఎదట పద్యానికి మరణం సంభవిస్తుందేమో అని కర్తభయుంట). అంతేగాని, పాటనెత్తిమీద ఉన్న మోస్తరుగా ప్రతీపద్యానికీ ఏ రాగమూ రాసిపెట్టి ఉండదు. అందువల్ల పద్యకర్త తన ప్రతి పద్యాన్నీ పాడి చూసుగోలేదేమో! అసలు అవి పాడడపు అవసరం లేకుండానే కవిత్వం అని అతడి అభిప్రాయమేమో! పాపం అసలతడు రాగాలు తియ్యలేడేమో! అతడికి రాగాల పేర్లుకుడా తెలియవేమో! తెలియక్కర్లేదేమో! పద్యకళ సృష్టించేవాడికి రాగకళ అన్యమే కదా! అని మీమాంసపడుతూంటే, ఒకాయన, "అన్యం కాదు. రాగాలు తియ్యడం చేతగాని వాజమ్మలు పద్యాలు రాయడం తప్పు. ప్రతీపద్యకారుడూ రాగాలు నేర్చితీరాలి. ఆ మాటకొస్తే మంచి గొంతిగవాడుగాని పద్యాలు రాయనేకూడదు" అంటూ కోపపడడం మొదలెట్టాడు. కాని అదేమి సబబూ! రాగంతో నిమిత్తం లేనివాళ్లు విశేషంగా పద్యరచన చెయ్యడం అంతా ఎరుగున్న సంగతేకదా! రాగప్రమేయం లేకుండానే బ్రహ్మానందం కలిగించే విశ్వాసంతోనే

చాలామంది పూర్వ(వస్తుతకవులు పద్యాలు రాశారు. ఆ పద్యాల్లో ఉండగల కవితాకళ చదువర్నీ (శ్రోతనీ ఆకర్షిస్తే వాళ్ళు అమితమైన ఆనందం పొందుతారు. పద్యరచన చేసేటప్పుడు రచయిత ఎరగనేనా ఎరక్క వాడనేనా వాడని మాయధారి రాగాన్ని ఉచ్చారణకాలంలో మరొకడు తెచ్చి దానికి లగించకపోతే, పద్యానికి వచ్చే లోటేమిటీ, అది ఎందుకు చచ్చిపోతుందీ అదివరలో బతికున్నదీ?

"అయ్యో! రాగం ఎంతో తీపి, నాయనా!" ఎరగవా? అని కొందరు!—గానాన్ని పొగిడితే అక్కడితో మనిషి అని తన్ననుకుంటారని. అవును. కాదని ఎవరన్నారూ? రాగమూ తీపే, తేరగా దొరికితే, ఎప్పుడైనాసరే పరాయిసొమ్ము కుడా తీపే! రాగం కలిసినప్పుడు మాత్రమే పద్యం రుచించి కలపనప్పుడు రుచింపకపోవడం జరిగితే, ఆ రుచి దేనిది? రాగానిది. ఆ సంగతి మనుష్యులకి కాదు పశువులకే తెలుసు. తేనె తియ్యగా ఉంటుందని నిర్ణయించడానికి వకీల్ని పెట్టక్కర్లేదు. ఇక, పద్యానికి వ్యక్తిస్వాతంత్ర్యం ఉందిగనక, దానిరుచి మాత్రమే తెలియాలీ అంటే దాన్ని ఎల్లా పలికించాలీ?— అని బాధ పడేటప్పుడు కొందరు, "(ప్రతిపద్యమూ నిక్షేపంలాగ రచింపబడి కవిత్వంతో కణకణలాడుతూ కాగితంమీద ఉంటుంది. దాన్ని పట్టి గెల్చి (ప్రకటించడానికి మంచిగాత్రంవాడు ఉండాలిగాని తక్కినవాళ్లు అనర్హులు. మంచిగాత్రం లేకుండా ఎవడేనా (ఆ రచయిత అయినా సరే) ఆంధ్రపద్యోచ్చారణ మొదలెట్టాడంటే పద్యం చూస్తున్న పళంగా తద్దినపు మంత్రంలాగ అయి సర్వభ్రష్టం కావడమే కాకుండా పద్యప్రపంచం యావత్తు మీదా సూచకాక్షరం ఉంటేగాని ఏ ఛందస్సూ తెలియని ఆంధ్రమహాజనానికి మహాగ్రహమూ మహాసహ్యమూ ఒక్కుమ్మడి రేకెత్తుతాయిస్మీ!" అంటూ మందలించడం సాగించారు. మంచిగాత్రం వాడు రాగానే మన ఎదుటగుండా ఉండే

పద్యమేకాదు, ఏ పద్యమైనా శ్రావ్యంగానే ఉంటుంది, వాడు నిజంగా రాగాలెట్టినా సొంపుగానే ఉంటుంది. అంటే "అబ్బ? ఏమీ లేనిదానికి ఇంత హంగామా చేస్తావేమిటయ్యా? కాస్త మంచి గాత్రం వాడొచ్చి కొద్దిగా ఏదో రాగపరసని పద్యంపాడితే ఇంకా బాగుంటుందని మేం ముచ్చట పడుతూంటేనూ!" అంటూ కొందరు నసుగుతూనే ఉంటారు. అందుకు పద్యం అసలు ఏమాత్రం బాగుంటుందో చూడద్దూ ముందు? పోనీ చూడద్దు. ఏ రాగం? ఏ రాగమైనా సరేట. ఏ రాగమూ కాకపోతే ఆఖరికి కూనురాగమైనా సరే సరిపోతుందిట. అల్లా ఏ రాగమైనా సరిపోయేటప్పుడు, రాగానికీ పద్యానికీ సహజంగా పుస్తెకట్టు లేదని ఒప్పుగున్నట్టేకదా! ఏదేనా ఒక పద్యానికి ఒకానొక రాగం మాత్రమే తగుతుంది, తక్కినవి తగవు అన్నప్పుడేకదా ఆ పద్యరాగాలయొక్క సమ్మేళనలో దాంపత్యం కనపడేది! అంతేగాని ప్రతీ పద్యాన్నీ ఎల్లాగైతేం, ఎవడైతేం ఏరాగమైతేం తెచ్చి లుంగచుట్టాలనడంలో సబబు కనిపించదు. "హరి హరీ! నీకు తెలియదయ్యా! రసానికి అనుగుణంగా రాగాలు న్నాయయ్యా!" అంటూ కొందరు తరుముకు వస్తారు. చర్చనీయాంశం పద్యరాగ బాంధవ్యం అయినప్పుడు, అందులో కేవల రాగంగురించిన ఒక సామాన్య వాక్యం పట్టుగొచ్చి, ప్రతీ అడ్డమైన తెలుగుపద్యానికీ అనుగుణంగా రాగాలున్నాయి, పద్యం అంటే రసమే – అని అన్వయించుగుంటే, అల్లాంటి అన్వయం చేసుకోగల వాళ్ళని చూసి జాలిపడాలి. పోనీ, ఈ రసానికి అనుగుణంగా ఈ రాగాలు – అని ఎక్కడుంది అని అడిగితే కొందరు ఎక్కడో ఉండి తీరుతుంది, తిన్నగాచూస్తేసరీ, అంటూండడం! కళల్లో అల్లాంటి జాబితా లుండవ్. ఒకే రాగంమీద అన్నిరసాలూ ఒప్పించిన వాళ్ళు న్నారు. కల్యాణి ఏడుపులోనూ ముఖారి కోపంలోనూ ఒప్పిం

చినవా ళ్లున్నారు. భూపాలతో నాటకప్రదర్శనంలో కోపపడతారు, కీర్తనకర్తలు విచారిస్తారు. చివరికి, గబగబా పఠిస్తే క్రోధమూ దీర్ఘాలుతీస్తూ పఠిస్తే శోకమూ ప్రతిరాగానికీ కుదురుతాయేమో! 'వెంకటమఖి' అన్నదాన్నిబట్టి ఈ రస–రాగ నిర్ణయంలో ఏ యిద్దరి అభిప్రాయాలూ ఏకీభవించవు.

పోనియ్యండి. మాటవరసకి, ఫలానా రసానికి ఫలానా రాగం అని శాసనం ఉంది అని ఒప్పుగుందాం. ప్రతీనటుడూ ఎన్నెన్ని రాగాలు నేర్చిఉండాలి? పోనీ, ప్రతీనటుడూ బోలెడేసి రాగాలు నేర్చినవా డని అనుకుందాం. ఒక నటుడు పది వేర్వేరు వేషాలు వేసేనిమిత్తం మొత్తం అయిదువందల పద్యాలు హృద్గతం చేసుగున్నా డనుకోండి. ఆ పద్యాలకి అర్థభావాలవల్ల జనించే రసాల్లో చాలాచాలా అంతరాలూ అంతస్థులూ ఉంటాయి. ఒక్కొక్కరస విశేషానికి ఒక్కొక్క పద్యం నేర్చినట్టు ఒక్కొక్క రాగం నటుడు నేరుస్తున్నాడా? నేర్చేప్రయోగిస్తున్నాడా? నేర్చుగోడం సంభవనీయమా? వచ్చుండడం సహజమా? రాగరసం అంతా ఆనందమే కదా! పోనీ కాదనుకోండి. రాగరసాల్లోకుడా అంతరాలూ అంతస్థులూ లేకపోతే అన్నిరాగాలు ఎందుకు జనించాయి? రసాలు కొన్నే ఉండి రాగాలు అపారంగా ఉంటే ఒకే రసం కిందికి చాలా రాగాలు వస్తాయికదా? అప్పుడు ఏమిటి దరి? పదమయమైన ఒక పద్యంలో ఉండగల మాటలయొక్క ఉచ్చారణవల్ల కలిగే అర్థభావాల మూలంగా జనించే రసవిశేషమున్నూ, స్వరమయమైన ఒకరాగంలో ఉండగల నాదాలయొక్క సంపుటీమూలంగా జనించే రసవిశేషమున్నూ అచ్చంగా సర్వవిధాలా మూడుమూర్తులా ఏకీభవించడం ఎట్లాజరుగుతుందీ? అవి ఏకీభవించడమే జరిగితే, అనగా పద్యం చెయ్యగలపని రాగమూ రాగం చెయ్యగలపని పద్యమూ నిర్వహించగలిగితే వాట్లకి

వేరువేరు జన్మలు ఎందుకు వచ్చాయి ?— అనేమో స్తరు ఆలోచనలో పడేసరికి కొందరు : అట్టెట్టె ఆగండి. పద్యరసవిశేషమున్నా రాగ రసవిశేషమున్నా మూడుమూర్తులా ఏకీభవిస్తాయని మేం అనుకోము కాని, అవి సరాసరికి స్పర్శలోకి రావచ్చును. అంతటి నేర్పరి పుట్టి వచ్చి ఎప్పుడేనా ఆ సంఘటన సిద్ధింపజేసి ఏకముహూర్తంలో ఆ జమిలి ఆనందం మాకు కలిగిస్తాడేమో చూద్దాం అని మా ఉద్దేశం — అని సవరణ ప్రతిపాదిస్తారు. అంటే ఏమిటో తెలుసునాండి ? కుడిచెవు లోంచి పద్యగమనం చెడకుండా పద్యాన్నీ, ఎడం చెవులోంచి రాగ గమనం చెడకుండా రాగాన్నీ ఏకకాలమందే ప్రవేశపెట్టుగుని ఆజోడింపువల్ల కలిగే ద్విగుణీకృతానం దాన్ని క్రోలడానికి సంసిద్ధంగా ఉన్నాం. మా తరవాయిలేదు. పాడేవాడిదే ఆలస్యం. వాడు అన్యుడై ఒప్పుతూ, కీర్తనలోలాగ తాళం వేస్తూ కూచోక, ఈ పని నిర్వహించాలి. అంత అపూర్వానందంలో మేం పడగలమయ్యా పడేసేవాడుంటేనూ అంటూంటే, నీకెందుకయ్యా బాధా ఏడువూనూ మధ్యా !— అనడం అన్నమాట. కాని, అది లోకోత్తరమైన శ్రవ ణాభిరుచి. అటువంటి అభిరుచికి పద్యప్రకటన కాలంలో మాత్రమే దోహదంచేస్తూ కూచోడానికోసం కాదు, నటుడు రంగం ఎక్కడం. నాటకకర్తమాటలవల్ల జనించే నటుడు, తన అభినయంవల్ల జనహృద యాల్లో అన్యుడై తోచడానికి వెళ్ళే నటుడు, అన్యభాషా అన్య వేషం అన్యావస్థా స్వీకరించిన నటుడు, పద్యరాగవిశేషాల సన్ని హితత్వం ఎక్కడ ఉండగలదో యత్నిస్తూ అంచనాలువేస్తూ కూచో డానికి తగిన సావకాశం లేనివాడని నటుల అభిప్రాయం. రాగజీవం పోషించాడా స్వత్వమే స్థాపించుగుంటాడు, అది హృద్యంగా ఉంటే మెచ్చేదీ అసహ్యంగా ఉంటే తిట్టేదీ అతన్నే ! అది నాటకం కాదు. పైగా, రాగాన్ని పోషించడంలో పద్యంయొక్క గురులఘువ్యాపారం

గమనించడా ఛందస్సుకి మరణం. అదీ గమనించాడా, ప్రతిపద్యాన్నీ కీర్తన చేశాడన్నమాట. కూడదని శ్రోతల వాదన. ఇదీ క్షోభ.

పోనియ్యండి. తెలుగులో పద్యంచెప్పిన ప్రతివాడికీ రాగప్రజ్ఞ ఉండిందే అనుకుందాం. పోనీ, కేవల రాగప్రజ్ఞ కలవాడేకాడు, ప్రతీ పద్యకర్తా ఒక 'సంగీత కళా రహస్యనిధి' — ఒక వాగ్గేయకారకుడు, అందాం. అంతటివాడు, అనగా కీర్తన రాయకుండా ఊరుకోలేనివాడు, కీర్తనరచన మానేసి, ఫక్తు పద్యాలే కూర్చాడని అనుకుందాం. తను చెప్పిన ఒకానొకపద్యం అతడు నృతిపెట్టి నృతిలోనే పైకి రానియ్యగా, అది భైరవిలో వెలువడగా, దాన్ని రచించి, తరవాత దాన్ని లిఖించి, తన స్వంతభైరవి ఖర్చుపెట్టి ఆ ఒక్కపద్యాన్నీ తనివితీరా ఆనందించు గున్నాడు, అనుకుందాం. అప్పట్లో తనకి గలిగిన ఆనందం భైరవిరాగం మినహాయిస్తే తరిగిపోయేటట్టు ఆ ఆసామీకి తోస్తే, ఆ పద్యానికీ భైరవికీ విడగొట్టరాని బాంధవ్యం జన్మతః ఏర్పడిందని అతడి విశ్వాసం, అన్నమాట. అటువంటి విశ్వాసం కలవాడైతే, అతడు, ఆ పద్యాన్ని తను భైరవిలో అంటూాంటే తనికి కలిగిన ఆనందంలాంటిది. మరోడికి కలిగించాలంటే, ఆ సంగతి ఆ పద్యం నెత్తిమీదో అడుగునో పక్కనో ఎక్కడోఅక్కడ తెలుపుదు చెయ్యాలిగాని, ఊరుకోవడం భావ్యంలా కనిపించదు. కాని, ఎంత గానరహస్యం తెలిసి రామరాజ భూషణుడైన పద్యకర్తాకుడా ఇంతవరకు అట్లా ఏ పద్యానికీ రాగం సూచిస్తూ ప. రా. రాయలేదు. పోనీ, ఏ మహనీయుడైనా రాశా డనుకుందాం — 'ఈ పద్యం ఉచితమైనంత భైరవి కలిపి పాడాలి' — అని. అటువంటి పద్యం, ఎవరో కనిపెట్టి నా చేతులో ఉంచారను కుందాం. నా స్వంతఖర్చునిమిత్తం ఆ పద్యానికి నాకు చేతనైనంత అవ సరమైనంత స్వకీయభైరవి జోడించి నేను ఆనందించుగుంటాను. ఎందు చేతంటే, గాయకుడైన ఆ పద్యకర్తయొక్క భైరవిని ఆ గాయకుడి

కంఠమే ప్రకటించాలిగాని, అది అన్యకంఠసాధ్యం కాదు. నా భైరవి అందులో కలిపినా ఆ కవనగాన రసాయనం ఒకటో రకంగా ఉంటుందా అంటే, చెప్పవలిసింది నేనే గనక పైపెచ్చు భైరవి నాదే గనక, ఆ మిశ్రణం నా కోసమే పాడుకునేటప్పుడు — తక్కిన వాళ్ల ప్రమేయం నాకుండదు గనక — నేను నా భైరవి సామగ్రిని ఆ పద్యంయొక్క అక్షరాలసందున వెదజల్లుతూండడం, ఆనందించుగుంటూండడం, నా రాగాలంకారంతో ఆ పద్యంగోలకి ఐదోతనం వచ్చిందనుకుంటూం డడం జరగవచ్చు. ఇంతవరకు పేచీ లేదు, నయమే. అయితే, ఆ పద్యాన్ని నేను ఇతరుల చెవిమీద వెయ్యడానికి వెళ్లినప్పుడుకుడా, నేను నా భైరవిని కట్టువిప్పి ఆ పద్యంలోకి ఇసుక్కుకలపడం అనేది ఒక మీరరాని శాసనంఅనుకుని, అట్లాచేసి, ఆ మిశ్రణం ఆ యితరులకి కూడా ఒకటో రకంగా ఉంటుందని భావించడం జ్ఞానయుక్తంకాదు. ప్రతీవాడి భైరవీ ప్రతీయితరుడికీ రంజకంగా ఉండితీరాలా? "అబ్బ, ఉండకపోతే వాణ్ణి ఆ పద్యం పాడమన్నవాడెవడూ, మరోపని చూసు గోకా?" అని విమర్శ రావచ్చు. అందువల్ల గాయకుడైన పద్యకర్త పద్యం ఫలానారాగంమీదే ప్రతీవాడూ ఇతరులకి వినిపించాలి — అని శాసిస్తే తీరిపోతుంది. కాని అతడింకా ఏమి శాసించాలీ అంటే: పద్యానికి సహజంగా ఉంటూండే నడకప్రకారం పద్యాన్ని ఉచ్చారణ చెయ్యడం ఘోరం అనిన్నీ మంచికంఠంవాడొచ్చి శ్రావ్యరాగం తెచ్చి ఉచితమిశ్రణం పాకం చేస్తేతప్ప తన పద్యానికి పుట్టగతులుండ వనిన్నీ- శాసించాలి. గానంగురించిన అంత శాసనం చెయ్యడానికి పద్యకర్తకి ఎన్ని గుండెలుండాలీ! ఇదంతా గానం నేర్చిన పద్యకర్తమాట. ఇక తక్కిన పద్యకర్తలు — 'శిశుర్వేత్తి పశుర్వేత్తి' అంటూ శ్లోకించడం, గానం, మధురం అని తమరే కనిపెట్టినట్టు చెప్పడం, రాగాభరణావిన ర్జనవల్ల పద్యజన్మకి వైధవ్యం రావచ్చునని భయపడ్డా ఒప్పుగోక పద్య

ప్రౌఢకి రాగాలంకరణం రసవిజృంభణకి దోహదకరం అని పైకి అంటూ తంటాలుపడతారు. కొందరు తమరు రచించిన పద్యాల పాదాలలో రాగాలపేర్లు భిన్నార్థాలతో ఉండే వ్యవసాయంచేసి రానిచ్చి, ఆయా పాదాలు ఆయారాగాలమీద పాడలేకపోయేవాడు వాటి ధరిమేనా రాకూడదన్నట్టు జాగ్రత్త పడేవారున్నారు. ఒక రాగంపేరు పద్యాదిని వచ్చేసరికి దానిబాపతు రసం అక్కడ చిప్పిల్లిపోదా అని వాళ్ల ఆశ.

వేరువేరు వ్యక్తిత్వాలుగల పద్యరాగాల్ని జోడించేటప్పుడు, ఏ ఒకదాని వ్యక్తిత్వానికీ భంగం రాకుండా నిలబెట్టాలంటే చిక్కులు చాలా ఉన్నాయి.

పద్యగాన సమ్మేళనం గురించి టాల్‌స్టాయ్ వ్రాసింది.

"వేగ్నరు అనే జర్మనుగాయకుడి గానంలో ఒక విశేషం ఉంది. అతడి అభిప్రాయం కవిత్వానికి గానం దోహదం చెయ్యాలని. ఒక పద్య కావ్యంలో ఉండగల భావలేశాల్నికూడా గానం స్థాపించి బలపరచాలని అతడి పట్టు.

15వ శతాబ్దంలో ఇటలీదేశస్థులు పురాతన గ్రీకు నాటక ప్రదర్శనాన్ని పునరుద్ధారణ చేస్తున్నాం అని భ్రమిస్తూ, గానం జోడించి నాలుకాలు పన్నడం మొదలెట్టారు. ఆ జోడింపు కేవలం కృత్రిమం. కొత్తలో దాన్ని విలాసజీవులైన భోగులుమాత్రం మెచ్చుకోడం జరిగింది. వారైనా దాన్ని సర్వదా మెచ్చుకోలేదు. మోజార్ట్, వీబర్, రోజినీ మొదలైన అపరూప ప్రజ్ఞావంతులైన రచయితలు ప్రదర్శనానుకూలమైన విషయాలే ఎత్తుగుని వాటివల్ల తమలో జనించుతూండే ఆవేశానికి లొంగిపోయి, ఏవో కొన్ని పదాలు మాటెట్టుగుని గానం చేస్తూ వచ్చినంతవరకే మెచ్చుగున్నారు. అందువల్ల ఆ సంగీతనాటకాల్లో శ్రోతలకు కావలసిన ముఖ్యమైన పదార్థం ఒకపద్యంయొక్క పదాలకి

జోడింపబడ్డ గానమే అయిందిక్కాని, ఆ పదాల అర్థం ఎంతమాత్రం కాలేదు. మరికొంత కాలం అయేసరికి, అటువంటి బాపతు నాటకమే అయిన 'మ్యాజిక్ ఫ్లూట్' లో, ఆ పద్యారాగాల జోడింపు కొంచెం కంపుకొట్టింది. అయినా ఆ ప్రదర్శనం ఏ కృత్రిమంగానో రక్తి కడు తూనే ఉందన్నారు గాని జనం దాన్ని గురించి విరక్తి చెందలేదు.

అప్పుడు వేగ్నరు ఆ సంగీతనాటకంలో సంగీతాన్ని లోబరుచు కుని, అది కవిత్వం చెప్పినమాట విని పనిచేసేటట్లు సవరణచెయ్యడానికి వచ్చాడు. అయితేం? ప్రతీకళకీ దాని సీమ ఉంటుంది. ఒక కళలోని ఏదైనా భాగం అచ్చంగా మరోకళయొక్క భాగానికిమల్లే ఎన్నటికీ ఉం డదు. ఒకవేళ వస్తే, రెండు వేర్వేరు కళలభాగాలు దరిదరికి రావచ్చును. అందుకని, మూడునాలుగు కళలదాకా అక్కర్లేదు, రెండుకళలగురించి ఆలోచించితే చాలు. నాటకకళ, గానకళ — ఈ రెండు కళలగురించీ ఆలోచిస్తే: ఈ రెండు కళల్నీ ఏక కాలంలోనే జోడింపుగా ప్రకటిం చాలంటే, ఒక కళలో చెయ్యవలిసిన పని మానేస్తేతప్ప తక్కిన కళలో పని చూపించడం అశక్యం. 'సంగీత నాటకం' అనబడేదాల్లో, ప్రతీ సందర్భంలోనూ, గానకళకి నాటకకళ లొంగి, లొంగినదై, కైవారంచేసేదై, కిందుచేయి అయిపోతూండగా, వేగ్నరు వచ్చి ఆ స్థితి తారుమారుచేసి, నాటకకళకి ఉన్నతస్థాన మిప్పించి, గానకళని సహాయ భూతంగా ఉండే అవస్థలో ఉంచి, అప్పుడు రెండూకూడా యథో చితంగా జీవించేటట్టు చేద్దాం అనుకున్నాడు. కాని, అది ఒక అసాధ్యం. ఏమంటే. ప్రతీ ఒక చిత్రకృతీకుడా, అది నిజంగా ఒక కళే అయిననాడు, ఒక కళాకర్తయొక్క ప్రత్యేక, గాఢ, స్వాంత, హృదయ పూర్వక, అద్వితీయ చిత్తవృత్తుల ప్రకటన. అటువంటి ప్రకటనకి అదియే సాటి. ఒక గానకల్పన అట్టిది. ఒక చేష్టాకల్పన వేరొకటి —

ండూ యథార్థకళలైతే. అట్టి సందర్భంలో ఒక కళలోని ఒక ్పన వేరొక కళలోని మరొక కల్పనతో తూచాలుతప్పక సరిగా ండవలెనంటే, ఇటు సూర్యుడు అటు పొడవాలి. ప్రకృతులు వేర్వే న రెండుకళలలోని భాగాలు దేనికది ప్రత్యేకత నిలుపుగుంటూ నికది అపూర్వమైఉంటూ, దేనికది విశిష్టత కనపరుస్తూ, అప్పుడే ల్లీ మూడుమూర్తులా ఒక దానిని ఒకటి పోలుతూ ఉండడం అనేది సంభవం అని ఒప్పుగునితీరాలి. సకలవిషయాల్లోనూ ఒకేమాదిరిగా ోకంలో ఇద్దరు మానవు లుండరు, చెట్టుకి రెండు పత్రాలుండవ్. ివుడి సృష్టిలోనే ఆ రీతిగా ఉంటే, ఇక మానవసృష్టిఅయిన చిత్ర ళలలో రెండైన కవనగానాల్లో అచ్చంగా సరిపోయే పట్లు ఉండ లవు. ఒకవేళ ఉన్నట్టు తోచినా, వాటిల్లో ఒకటి యథార్థకళ, ండవది మిథ్యాకళ — లేకపోతే రెండూకుడా దగా కళలే. ఏమంటే ండు సజీవపత్రాలు సర్వథా ఒకేమాదిరిగా ఉండజాలవుకాని, రెండు ్రతిమ పత్రాలు ఉండవచ్చును."



# 9. వాద ప్రతివాదన

కొందరు: కవిత్వంలో గానం నక్కి ఉంటుంది, అందుకని పద్యాలు పాడుకోడంనిమిత్తం తయారుచేస్తారుగాని మరో పనికి కాదు-అంటారు. గానం భావరాగతాళయుక్తం అనో నృత్తగీతవాద్యం అనో అనుకుంటే పద్యంలో గానం ఎక్కడ నక్కి ఉంటుందీ? పద్యం కవిత్వరూపాలలో ఒకటి. పద్యం నియతమైన నడకగల పదసమూహం. పదాలకి అర్థమే కాకుండా నాదంకూడా అంతకిపూర్వమే ఉండిన కారణం చేత పద్యంలో నాదసౌఖ్యం ఉండదని ఎవరూ అనరు. కాని, గద్య కూడా కవిత్వరూపాలలో ఒకటి. గద్యకూడా ఏదో నడకగల పదసమూహమే. గద్యంలోకూడా నాదసౌఖ్యం ఉంది. కాబట్టి, పద్యం పాడుకోడానికి ఎంతహక్కు మనికుందో, గద్య పాడుకోడానికికూడా అంతే హక్కుంది. ఇల్లాంటి హక్కు మనకి పురాణకాలక్షేపాలలోనూ హరికథలలోనూ దొరుకుతూంటుంది. ఆ రెండు చోట్లా వచనాన్ని రాగంతోటే మోసేస్తారు. అయినాసరే, నాటకరంగంమీాది నటుడు వచనం పాడడు. ఒకవేళ ప్రతీనటుడూ ప్రతీవచనమూ పాడడం లంకించుకున్నాడా, వృత్తాంతం బోధపడక, పరమానందయ్యగారి శిష్యుడి అవస్థ తటస్థిస్తుంది. పురాణ హరికథా కాలక్షేపాలలో దారి వేరు. వాళ్ళు గద్యపద్యాలు పాడినా, ఆ ముక్కలు మళ్ళీ విడదీసి అంటూండి, ఇంకా ఆగి వాటికి అర్థమూ విశేషాలూ చెప్పి, ఇంకా సరంఅయితే వ్యాఖ్యానాలూ, ఉదాహరణలూ, దృష్టాంతాలూ, పిట్ట కథలూ జోడించి, బహునాయకత్వం లేదుగనక, స్వాంతపూచీమీాద కాలక్షేపాలకి రక్తి తెచ్చుకుంటూరు. కాని, నటుడు పౌరాణికుడు కాడు, హరిదాసుకాడు — తాను తనుకాడు. అతనిది ఏకోచ్చారణ. అతడు ఏదేనా అని, 'బొడ్డు తుమ్మాలు' పెట్టుకుని మళ్ళీ అదే అనడానికి

వీల్లేదు, మరోటి అనకూడదు. అదీకాక, అతడు గద్యకుడా పాడడం ప్రారంభిస్తే దానికి 'ఫుల్‌స్టాపు' ఉండకపోవచ్చును. పైగా నాటక రంగం ఒకడిది కాదు, అనేకులది. వాళ్ళంతా కలిసిగాని ప్రదర్శనానికి రక్తి తీసుకురాలేరు. వచనవిషయంలో ఉచ్చారణ నటుడు గ్రహించాడు. తనకంఠధ్వనీ తను అంటూన్న పదాలూకుడా మొదటిసారి వినేవాళ్ళకికుడా సంగతి అవగాహన అయేలాగు అతడు వాచికంచేస్తాడు. అటువంటప్పుడు పద్యంమాత్రం ? పద్యంలోని మాటలకి అర్థం ఉండదా ? ఆ మాటలకి స్పష్టోచ్చారణ అవసరంలేదా ? గద్యలో చెప్పిపారెయ్యడానికి వీల్లేని మహత్తరభావం ఏదో ఉన్నప్పుడేకదా పద్యం రచించడం ! గద్యే స్పష్టంగా ఉచ్చరించవలిసొచ్చినప్పుడు పద్యం మరెంత స్పష్టంగా ఉచ్చరించాలీ ! స్పష్టోచ్చారణకి రాగమా అనుకూలించేది !

ఈ గద్యంచిక్కు వదుల్చుకోడానికి కొందరు : పద్యం పాడడానికి బాగుంటుంది, వచనం బాగుండదు—అంటారు. ఏ అర్థమైనాసరే ఆరోపించడానికి వీలైన మాటల్లో 'బాగుండడం' ఒకటి. అనగా, ఒకరికి బాగున్నది మరొకరికి బాగుండదు. అదీకాక గాయకుల అభిప్రాయంవేరు. పద్యం కాదు సరిగదా, వచనమైనాసరే, ఆఖరికి ఏ రెండు ముక్కలైనాసరే, ఇస్తే, మన చిత్తం వచ్చిన రాగంమీాద మన చిత్తం వచ్చిన తాళంమీాద, మనకి ఓపిక ఉన్నంతసేపు పాడి, మనకి తన్మయత్వం తెప్పించగలడు, అథమం మనచేత 'చాలు' అనిపించగలడు, గాయకుడు. దానిపేరే గానంలో 'పల్లవి పాడడం'. కాబట్టి గానముంటే సరి, దాన్తో ఏ ముక్కల్ని ఎంజేసినా చెయ్యొచ్చు. శాస్త్రం చెప్పినట్టు, జుట్టుంటేసరి, కొప్పెట్టుగున్నా, జడేసుగున్నా, ముడేసుగున్నా, ముచ్చటముడేసుగున్నాను !

కొందరు : 'అవునవును. కాని, పద్యంలో నడక ఉండడంచేత, పద్యం 'నన్ను పాడుకోవయ్యా నా రాజా !' అని పఠితని పిలుస్తూ

న్నట్టు ఉంటుందిగనక, అటువంటి దీనాలాపం తోసిపుచ్చడం ధీర లక్షణం కాదు కాబట్టి, పద్యం పాడాలి, అన్నారు. కాని, పద్యం అల్లా పిలుస్తూన్నది గానంచేసి మెప్పించగల ప్రజ్ఞ గలవాళ్ళనేనా? ప్రతివాణ్ణీ పిలుస్తుంది. అందుచేత, ఎవళ్ళ యథాశక్తిగానం వాళ్ళు దానికి అర్పించి ఆనందించుకోవచ్చు. ఎవ రాపగలరూ? అప్పుడు వాళ్ళు తమ గానంతో కవి కవిత్వానికి ఎదురై స్వాగత మిచ్చి, తమ హృదయపీఠాలమీదికి దాన్ని ఎక్కించుకోవచ్చును. కాని, నాటక రంగంమీద అన్యుడై ఒప్పవలిసినవ్యక్తి తన గానం సంపుటీచేసి కవి యొక్క కవిత్వాన్ని అభినందించడానికి రాడు. మాటలలో ఉండే వృత్తాంతం శ్రోతలకి అవగాహన అయేరీతిగా నటుడు ఉచ్చారణ చెయ్యాలి. అతడు తనమాటలన్నీ లోగడ కంఠతాపట్టి ఉన్నా, అవి ప్రస్తుతసందర్భాన్ని అనుసరించి ఆ క్షణంలో అతడికే తోచాయూ అన్నట్టు ఉచ్చారణ ఉండాలిగాని, ఎరిగున్న సరుకు ఏకరువెట్టినట్టు ఉండకూడదు. ఆ పదాలవల్ల తనకి గలిగిన చిత్తవృత్తివంటిది సభ్యుల హృదయాల్లో పుట్టించాలని అతని ఆశయం. పద్యంలో అర్థభావ రసాల్ని తన గానంలో రంగరించి ఆ గానాన్ని అతడు సభ్యులకి అంద జేస్తే, దానివల్ల వాళ్ళ హృదయాల్లో పద్యంలోని అర్థభావరసాలు పుట్టవు. వాళ్ళు ఇతరానందంలో ఉంటారుకాని, నటుడి అవస్థలో ఉండరు. ఇదికాక, సరే ప్రతిపద్యంలోనూ నియమితమైన నడక ఉంటుంది. ఇంద్రగణాలు వచ్చే పద్యంలో నడక నియమితమేకాని స్థిరంకాదు. పోనీ స్థిరమైన నడకగల వృత్తాల్లో ఒకటైన ఉత్పలమాలని విచారణ చేద్దాం.

కేరడమయ్యె కమ్మ పరికింపగ నేడుకదా
ఈ విధి నద్దురాత్మ వధియింపకపోవుదునేని
కాచిన వాడ వీవ మము గౌరవు లెగ్గొనరించుచో

వీటిలో ఒకేవిధమైన నడక ఉంది. కాని, ఆ నడక ఏస్వరంలో? పైపద్యాలలో ప్రతీదాన్నీ ఏ షడ్జమంలోనో, ఏ మధ్యమం లోనో చదవగలంగదా! అప్పుడు పద్యం ఎందుకు నడవదు? అది నడిచేటప్పుడు అమాంతంగా ఏ రాగం జనిస్తుంది? ఏ రాగమూ ఎంత మాత్రమూ జనించదు. యథార్థం ఏమిటంటే పద్యకర్త తన నాదం యొక్క—స్పష్టోచ్చారణ గల వర్ణంయొక్క — గురు లఘు (పొడుగు— పొట్టి) ప్రమాణాన్నిబట్టి మాత్రమే తన రచన చేస్తాడు. అంతేకాని, గాయకుడు గమనించవలిసిన నాదంయొక్క స్థాయిలూ స్వరాలూ కుడా గమనిస్తూ నిల్చిపోడు. అనగా, స్వరజ్ఞానంతో నిమిత్తం లేకుం డానే పద్యకర్త తన పని చూపించగలడు. కాబట్టి పద్యంనడక అర్థ స్ఫురణకి అనుగుణంగా ఉండాలిగాని, తేరగా కొట్టితెచ్చిన రాగం యొక్క జీవాన్ని నిలబెట్టడానికి తనే కుంటకూడదు. పద్యంలో నడక ఉందిగనక పరాయి రాగంకుడా తెచ్చి పద్యోచ్చారణ చెయ్యాలి అనే వాళ్ళు, పద్యానికి సహజమైన నడకని నిలబెట్టక, రాగదాసులే అవు తూంటారు. నడకా నిలబెడతాం అనే వాళ్ళు, కీర్తన పాడుతున్నా రన్నమాట. పద్యాన్ని కీర్తనగా పాడవచ్చా అనేది ప్రస్తుతసమస్య కాదు.

ఈ చిక్కులోంచి తప్పించుగోడానికి కొందరు: కవిత్వంలో కొంత ఆనందం ఉంది, గానంలో కొంత ఆనందం ఉంది. పద్యం పాడే టప్పటి ఆనందం పద్యం పఠించేటప్పటి ఆనందంకంటె పైన జేనడేనా ఉండితీరుతుంది. కాబట్టి పద్యం పాడాలి — అంటారు. కాని, పద్యం కేవల గణపంజరం కాకుండా కవిత్వమే అయుంటే, కొంత ఆనందం ఏమికర్మం, మిక్కిలి ఆనందం కలిగించాలి. ఆ ఆనందం ఏ యితర కళ తోనూ జోక్యం లేకుండానే కలిగించాలి. ఎవరికైనా బ్రహ్మానందం కలిగేటప్పుడు రెండు బ్రహ్మానందాల జోడింపుగురించి తర్కించడం

రెండు అనంతాల మొత్తంగురించి పేచీపడ్డట్టు అవుతుంది. పద్యంలో కొంత ఆనందంమాత్రమే ఉంటుందని వాదించేవాళ్లు, ఆ పద్యం కవిత్వం కాదని ఒప్పుగుంటున్నా రన్నమాట. అల్లాగే, కొంత ఆనందం కలిగించే రాగమూ గానం కాదు. రెండు కళల సంపుటీవల్ల ఒక మిశ్రకళజనించవచ్చుకదా అని నమ్ముతూ, రెండు కళాభావాల సమ్మేళన వల్ల కళజనిస్తుందని, ఇల్లా వాదించేవాళ్లు, భ్రమపడుతున్నారు.

రెండు వేర్వేరు కళల మిశ్రణంవల్ల కొత్తకళ జనింపచెయ్యడంలో తప్పేమి ఉండగలదూ! అని కొందరి బాధ. తప్పేమీలేదు. కాని, ఆ కలపడంలో ఏ ఒకటిగాని రెండూగాని నాశనం కాకూడదు. ఒక కళయొక్క విహారణస్థలాలతో అచ్చంగా ఏకీభవించే విహారణ స్థలాలు మరోకళకి ఉండవు. ఉంటే అవి వేరుకళలు కానేకావు. కాని, ఒక కళయొక్క కొన్నిపట్లు మరొక కళయొక్క కొన్నిపట్లకి తుల్యంగా ఉండవచ్చు, నరాసరిగా స్పర్శలో ఉండవచ్చు. ఆ రెండుకళల రహస్యాలూ తెలిసినవాళ్ళకిగాని అటువంటి పట్లు తోచవు. కవనగానాలు రెండూ నాదాధారాలు. కవనంయొక్క సూక్ష్మప్రమాణం శబ్దం, గానంయొక్క సూక్ష్మప్రమాణం స్వరం. అర్థవంతంఅయిన శబ్దానికి రసవంతంఅయిన స్వరం సంపుటీచేసి నవ్యకళ సృష్టించేవాడు కీర్తనకర్త. కాని, శబ్దప్రపంచం గేయ, పద్య గద్యరూపాలలో ఉండగలదు. అందులో పద్యరూపంగురించి మన సమస్య. పద్యాలు రచించడాని కల్లామూలం రాగాలు నేర్చుగుంటూ కూచోరు, పద్యకర్తలు. కాని, చాలామంది పద్యకర్తలు తమ పద్యాన్ని రెండోవారు మూడోవారికి ప్రకటించవలసిన అవసరం వచ్చినప్పుడు పాడితీరాలి, అంటారు. కొందరు పద్యకర్తలకి కొన్ని రాగాలు వచ్చునుట, శ్రావ్యంగా పాడగలరుట, అంచేత తమ పద్యాలు మంచిపీకవాడు పాడాలిట! అటువంటి వాళ్లు తమ పద్యాల్ని స్వరపరిస్తే తీరిపోతుందిగదా! అంత రాగప్రా

పీ(?)శ్యాం ఉన్న వాళ్లే ఆ పద్యంధరిమేనా వెడతారు. కాని, ఎందుచేతో కాని, వాళ్లు అట్లా చెయ్యక మెత్తగా ఊరుకుంటారు. ఊరుకుని, వినిపించేది తమరే అయినప్పుడు, రాగరథంమీద ఝుమాయించేసి, శ్రోతల మెప్పు పొంది, ఆ మెప్పు పట్టిగెల్లి తమ పద్యభావానికి జమ రాసుగుని, దానికి కవిత్వముద్ర వేసేసుగుని, రాగరహితంగా ఆపద్యాన్ని ఉచ్చరించేవాడు తమ కవిత్వాన్ని పాడుచేస్తున్నాడని గోలపెడతారు; కొందరు శ్రోతలుకూడా ఆ గోలలో పద్యకర్తలు ఒంటరిగా తైపోకుండా కనిపెడతారు. ఇతర పద్యకర్తలకి రాగాలు రావుట. వాళ్లల్లో కొందరు నోరు మెదపకుండానే పద్యం రాసేస్తారట, అనగా వాళ్ల పద్యాలు నాదరహితంగానే వెలుస్తాయిట, మంచికంఠంవాళ్లొచ్చి పాడితే, ఇంకా బాగుంటాయిట, అసలులో ఎంతబాగున్నాయో తెలుసుగోడం, అవి నాదశూన్యంగా పుట్టడంవల్ల, అసంభవంట! తక్కినవాళ్ళు కాస్తకాస్తే అనుకుంటూ, వెనక్కి వెడుతూ, ముక్కలు మారుస్తూ, నియమితస్థలాల్లో అక్షరసామ్యం (పోనీ నాదసామ్యం) కలిగేటట్టు చూసుగుంటూ, రాస్తారట! కాని, వాళ్ళనోళ్ళు మంచివైనా, వాళ్ళ గొంతికలు మంచివికావుట, అందుకని తమ పద్యాల్ని-రాసింది తమరేగనక తమ కవిత్వాన్ని – తీసిగెళ్ళి వాటితో జనాన్ని ఐక్యంచేసి ఆనందపరిచే పూచీ పడడానికి మంచిగొంతిగగల ప్రతివాడికీ సంపూర్ణస్వాతంత్ర్యం ఇచ్చేశారుట! ఈ రకం పద్యకర్తలు తమరే రచించిన తమ పద్యాన్ని తమరు మళ్ళీ పైకి అనరు, పాడలేరుట, పాడరు. శ్రావ్యకంఠంవాడు వచ్చి వాళ్ళ పద్యాలు పాడడంతోటే, తమ పద్యరచన కవిత్వంగా మారి ప్రపంచాన్ని ఆకర్షించిందిగదా అని సంతోషించుగుంటారు. సహజంగానే రసాత్మకంఅయిన గానం వల్లకాక తమరు రచించిన పదాల అర్థభావాలవల్లే రసోత్పత్తి అవుతోందని వాళ్ళ విశ్వాసం. అనగా, తను కనీవినీఎరగని ఏ పాకం

వస్తేనాసరే జనం ఆనందిస్తున్నారుగదా అంతేచాలు, అని వాళ్ళ సంబరం! సాధారణ నటుడికి పద్యవిషయంలో మరికాస్త ఎక్కువ బాధ. అతడు అన్యుడుగా ఒప్పవలిసిఉన్నా స్వాంతంతాలూకు గానం పద్యం వెలువరించేటప్పుడు మాత్రమే పాడాలి. అతడు పద్యశబ్దాలకి సంపుటీచేసే రాగం అర్థాన్ని పెంపొందించదు. పైగా తను పట్టు గొచ్చిన రాగానికి అనుగుణంగా రుబ్బినట్టు తల తిప్పడం, చేతుల్తో గాలిని నరకడమూ కావిస్తూండాలి. అటువంటి చేష్టలు అతడి అభిన యాన్ని పెంపొందించవు, సరిగదా దానికి ప్రతికూలంగా పనిచేస్తాయి. కాబట్టి, పద్యార్థం లోగడే తెలిసిన చదువరులకీ, ఎంత అపస్మారంగా మాటలు వెలువడ్డానసరే వాటి అర్థాలు నోల్లుకుని భావించుకోగల సూక్ష్మబుద్ధులకీ, నటుడి నవ్యరాగం రంజకం కావచ్చు. కాని, నాటక సభలో ఆ పద్యం విననివాళ్ళూ, ఒకసారి రాగధోరణిలో విసిరితే తెలుసుగోలేనివాళ్ళూ, అక్షరాస్యులుకానివాళ్ళూ కుడా ఉండగలరు. అర్థం తెలిసిన అదృష్టవంతులు పద్యంమీాద దృష్టి పెట్టుగోనక్కర్లేదు గనక, రాగాస్వాదన చేస్తూ 'ఒహో' 'ఆహా' అంటూ తక్షణాల్లాను కోరే గానాన్ని మెచ్చుగుంటూండేటప్పుడు, అర్థం తెలియనివాళ్ళు కుడా ఆలోచనాత్మకమైన పద్యాన్ని మెచ్చుగుంటూ ఉండాలా? పద్యంలోని మాటలూ నటుడి గొంతిగయొక్క సంగతులూకుడా మొదటిసారి వినేవాళ్ళు తమ దృష్టి ఎటుఉంచాలీ? పద్యం పాడడం ద్వ్యర్థికావ్యం. అందులో పద్యం-దానికి అర్థ, భావ, రసాలుండాలి. అర్థమిది, భావమిది—అని ఆ పదాలలోనే ఉంటుంది. రసభేదం ఫలానా అని నిర్ణయం వీలుపడదు. అటువంటి రసభేదనిర్ణయం చెయ్యడానికి కుడా రాడు నటుడు. ఆ పదాల్ని తను ఒకేసారి అభినయయుక్తంగా, ప్రపంచంలో అటువంటి పదాల్ని అర్థస్ఫురణ చెయ్యడానికి ఉచ్చారణ చేసే రీతిలోనే, ఉచ్చారణచేసి అన్యుడై ఒప్పాలని అతడి ఆశయం,

అది ఒకటి. గానం రెండోది. గానానికి అర్థం తెలియదు, భావం తెలియదు, కాని రసస్ఫురణ ఉంటుంది. వీటి కలయిక ఆస్వాదించి ఆనందించడంలో :

ఒక కథ వినియెడి తఱి వే
ఱొక కథపై దృష్టియిడిన నొక యర్థము దో
పక పోవుఁగాన నేకా
ర్థకావ్య మెట్లట్ల వినఁగఁదగు నొక టొకటిన్

అని సూరన్న హెచ్చరిక! — అనుకుందాంపోనీ, అంటే, గానానికి అర్థం తెలియదు, ప్రతి పద్యంలోని ప్రతి ముక్కా రెండేసి సార్లూ అనరు. కాని, సభ్యుల్లో మాటలు వినేవాళ్లకి రాగమూ రాగం వినేవాళ్లకి మాటలూ అందకుండా పోతాయిగదా పాపం, వాళ్లు చిక్కులోపడిపోయి చీలిపోతారుగదా, అని కొందరి నటులకి అనిపిస్తూండి, సభ్యులు తమకి మిగిలిన రెండోపని చూసుగుని ఆస్వాదన పూర్తిచేసుగోడానికి అనుకూలించేనిమిత్తం, పద్య పాదాన్ని మరోసారి అంటూంటారు. కాని ప్రతీపాదాన్నీ రెండేసి సార్లు అంటే, చాలా అసహజంగా పరిణమించవచ్చు ననే భయంచొప్పున, పద్యం యొక్క మొదటిపాదాన్ని మాత్రమే రెట్టించి చక్కాపోతూంటారు. కొందరి నటులకి అటువంటి మొహమాటం లేకపోవడంవల్ల వాళ్లు పద్యంలోని శబ్దసమాసాలన్నింటినీ రెండుకాదు మూడుకాదు ఎన్నో సార్లు వెనక్కీ ముందుకీ ఉప్పట్లాడినట్టు దంచి, పదార్థాన్ని గుండకొట్టి వస్త్రకాళితం చేసేస్తారు. రాగ సమ్మేళనం వీలుండదు అని అందరూ అనుకునే గద్యలో పైవిధంగా మాటల్ని మళ్లీమళ్లీ ఉచ్చారణ చెయ్యనీండి, ఆ నటుడికి మతిలేదని, పద్యరాగపాకం మెచ్చే శ్రోతే సెలవిస్తాడు.

మరి కొందరు: పోనీండి, ఏకొంచెం రాగం కలిపినా కలప వచ్చు. సృతిలో ఉంటూ రాగం తేలిస్తే చాలు. ఆ కాస్త పీలిక రాగమూ అంటేసినంతమాత్రంచేత పద్యార్థానికి వచ్చే లోటు ఏమీ ఉండదు — అంటూ క్షుద్ర రాగమేనా ఉండాలని ముచ్చటపడేవారు ఉన్నారు. కాని, నిజంగా గానకళ కంఠంలో ఉన్న వ్యక్తి కాస్తకాస్త గానంచేస్తూ కూచోడు. తనివి తీరా మనస్ఫూర్తిగా పాడితేగాని, అది గానంచేసే వాడికే గానంకాదు, తక్కిన వాళ్లకి గానం ఎట్లా అవుతుందీ? గానజ్ఞులు అది గానంకాదని చెబుతూండేటప్పుడు, ఆ గానం చేసేం మానేం? అర్థంతో ప్రసక్తిలేకుండా, పదాలు చెయ్యలేని పని చెయ్యగలిగి, గాయకుడి అభిమానకళఅయిన గానం, మరో పనిమీద రంగంఎక్కి మరోవ్యక్తిగా ఒప్పవలసిన నటుడిచేత చిన్న చిన్న మోతాదుల్లో సృష్టింప బడడం ఎట్లా? గానం చిన్నెలూవన్నెలూదాల్చి అభివృద్ధిగాంచనప్పుడు, అంతాకుడా అనియమితం అయిన దీర్ఘాలే తీస్తూండినప్పుడు, ఉత్కృష్టగానం ఇదీ అని ఏర్పాటుకానప్పుడు, త్యాగరాజు పుట్టి కొంతవరకు గానం దారిని పడనప్పుడు, ఎవరు ఏమోస్తరు దీర్ఘాలు తీసినా తక్కినవాళ్లకి అది గానంలా కనిపించేదేమో. ఎరగం. ఆ బేరం నేటి కాలంలో ఎట్లా కుదురుతుందీ? ఇక, పామరులకి అర్థం తెలియకపోయినా పద్యం వాళ్ల చెవుల్లోకి శ్రావ్యంగా ప్రవేశించడం గురించి మాట్లాడ్డం నంఘాన్ని మోసగించడం. ఏమంటే: జనసమక్షంలో ప్రకటింప తగ్గ పద్యానికి అర్థమే కాకుండా భావం కూడా స్ఫురించాలి. అప్పుడుగదా జనానికి బోధ! నటుడు అది సానందంగా నిర్వహించాలి. ఉచ్చారణరీతి నేర్చి రంగం ఎక్కాలి. అంతేగాని, తనెరుగున్న క్షుద్రరాగం ఒకటి పట్టుగువచ్చి యథాశక్తి వ్యవసాయం చెయడం మొదలెట్టి, శ్రద్ధతో విని అవగాహన చేసుగోవలిసిన పద్యాన్ని పాడగానే, జనబాహుళ్యం శ్రద్ధతో విననవసరంలేని రాగపు

మూలుగునే ఆస్వాదిస్తారుగాని, పద్యంలోని పదాల్ని లక్ష్యపెట్టనే పెట్టరు. పామరజనం తరచున వాదించి క్షుద్రరాగమేనా లేకపోతే వాళ్లకి మహాయిబ్బంది అని చెప్పేవాళ్లు, కవిభావానికి ఆ పామరుల్ని దూరంచెయ్యాలి అనడమేకాకుండా, పద్యాస్వాదన విషయంలో వాళ్ల అజ్ఞానాన్ని ఖాయపరచి శాశ్వతం చెయదలిచిన పుణ్యాం, అను కోకుండా, కట్టుగుంటున్నా రన్నమాట! అటువంటి పామరుల నిరర్థక శ్లాఘకుడా మూటకట్టుగుని ముదిసిపోయి, దాన్ని పద్యశ్లాఘకిందా నటనాశ్లాఘకిందా జమకట్టించాలనా, వాళ్ల బాధ? అజ్ఞానులచేత 'అవును' అనిపించడానికా రాగం?

'పద్యంలో ఉండగల రసాన్ని ఆస్వాదించగా, అది రాగంలోకి దిగుతుంది. ఆ మోస్తరుగా పద్యాన్ని ఆస్వాదించి ఇతరులచేత ఆస్వాదింప చెయ్యలేనివాళ్లు రాగం తియ్యలేక, తీసేవాళ్లని వద్దంటారు' అనే అభిప్రాయం కొందరు వెల్లడించారు. పై వాక్యంలో 'రసం' అనే మాట ప్రవేశించి ఉంది. అనిశ్చితమైన ఉత్కృష్టపదాలలో అది ఒకటి. ఇది ఫలానాఅని ఇన్ని ముక్కల్లో చెప్పాలంటే సామాన్యులకి కోపంవస్తుంది. తెలిసినవాళ్లని అడిగితే, కావలిసినంత గ్రంథం చెప్పి గభరాయింప చేస్తారు, అదేమిటో తేల్చకుండా! భాషల్లో ఉండే కొన్నికొన్ని పదాలు అట్లాంటివి! వాట్ల అర్థాన్ని ఎవరి త్రాణ ననుసరించి వాళ్లు గ్రహిస్తాం టారు. ప్రకృతి మానవుల స్థితిగతులూ మహిమాస్వభావాలూ ఆకార ఆంతర్యాలూ గ్రహించిన మానవుడు తన హృదయం ఈశ్వర సంకల్పాలకి ఉప్పొంగినప్పుడు ఆర్ద్రహృదయుడై ఒహో, ఆహా, ఒస్, అబ్బా, అల్లానా, పోనీలే, అయ్యో, ఔరా మొదలైనవి అనడం సార్థకఅనుభవం. అక్కడితో ఉండ బట్టలేక ఆ మానవుడు తత్తుల్యమైన అనుభూతి ఇతరమానవులకి కలిగించాలనే సదుద్దేశంతో బయల్దేరి తనకి మిక్కిలి అనువైన సాధనం అందునిమిత్తం ఎన్నుకుంటాడు, —

పదమో, స్వరమో, రంగో, రామో! ఎన్నుకుని అప్పటి తన చిత్తవృత్తి సమగ్రంగా ప్రకటిస్తాడు. అతడు అనుకున్నరీతిగా పని జరిగిననాడు, తోడిమానవుల హృదయాల్లో ఆవిర్భవించేది 'రసం'. కవి స్వీకరించే సాధనం పదాలు. కవి పదాలు ప్రయోగిస్తాడు. కాబట్టి పద్యంలో రసం ఎంత విపులంగా ఉన్నా దాన్ని పదాల కూర్పుద్వారానే ఆస్వాదించాలి. ఆ పనిలో రాగమెందుకూ? రాగం అనేది ఏదో ముస్సుందే మనకి వచ్చుండి, దాన్ని పలికించాలనే ఉద్దేశమే మనకి ఉన్నప్పుడు తప్ప దానంతట అది పుంక్తోంచి బయల్దేరడం ఎట్లా? పద్యదర్శనం కాగానే రాగజ్ఞానానికి రాగాలు పుట్టతాయా? భోజమహారాజుని చూస్తే కవిత్వం పుట్టేదిట, అన్నట్టు! తిన్నగా పద్యం చదవలేనివాడు మూలుగులోకి దిగచ్చుగాని రాగంలోకి ఎట్లా దిగుతాడూ? అసమర్థుడైన చదువరో పతితో పద్యంలో ప్రవేశపెట్టిన మూలుగుని ఖండించడంబదులు, ఖాయపరిచి, ఖరీదుకట్టి అదిరాగం అయిపోవాలని పట్టుట్టడం ఏమి సరసం! ఇక, రాగపు మొహం ఎరక్కుండా పుట్టిన పద్యం, మనం దాన్ని ఎంత ఆస్వాదిస్తేం గనక, రాగంలోకి దానంతట అదే ఎల్లా దిగుతుందీ? పోసీ, ఒక పద్యంలోని పదాలరసం యావత్తూ వెళ్లి ఒకేరాగపు సంగతుల్లోకి ఎట్లాదిగుతుందీ? రంగంఎక్కిన నటుడు ఒక్కొక్క పద్యాన్ని ఎన్ని సార్లు తను ఆస్వాదించాలీ, ఇంతపనీ జరగడానికీ? ఎన్నిసార్లు శ్రోతలచేత ఆస్వాదింప చెయ్యాలీ? పోసీ, ఒక నటుడికి గానంకూడా వచ్చు ననుకోండి, అతడికి తెలియకుండానే పద్యం ఏదో ఒక రాగంలోకి దిగుతుందనుకోండి. కవి రచించిన పద్యంలోని పదాలన్నింటినీ సార్థకంగా సభకి వడ్డించినపిమ్మట అన్వయవ్యక్తిని స్ఫురింపచెయ్యవలసినవాడు, ఆ పదాలమధ్య తన స్వంత రాగ సంగతులు చిమ్ముతూ తన వ్యక్తిత్వాన్ని జ్ఞాపకం చేసుకోవడం ఎందుకొచ్చినపనీ? తనకి రాగం వచ్చినట్టు సభకి తెలియ

పరచడానికి అదా అదను? పోనీ తనకి రాగాల ఆస్తి ఉన్న సంగతి మొదటే సభకి తెలియపరిస్తే! మరో నటుడికి రాగాలన్న మాటేమిటి, కవిత్వం కట్టడంకూడా వచ్చు ననుకోండి. నాటకపద్యం ఆస్వాదించగా ఆస్వాదించగా, అది వెళ్లి కవిత్వంలో దిగుతోందని చెబుతూ, అతడు తన స్వంతకవిత్వపై త్యం, నాటకపద్యంలోని శబ్దాలసందున జొనప వచ్చా! అప్పుడు నాటకపద్యానికి మెరుగు పెట్టినట్లై రసం ఇనుమడించదా? — అంటే, కూడదుట. ఎందుకు కూడదనగా, చేసే పనియొక్క అవకతవక వీధిని పడిపోతుంది. కాని, రాగంలో పదాలు కాక మనకి అర్థం తెలియని స్వరాలుమాత్రమే ఉండడంచేత, జరుగుతూన్న హాని గోచరించడంలేదు. ఇంకోనటుడికి అనేకభాషలు వచ్చిఉండచ్చు. వచ్చినంతమాత్రాన్ని, ఒక తెలుగురచయితో రచించిన నాటకపద్యం ఉచ్చారణచేసే మధ్యరంగంలో అవన్నీ ఎట్లాదొర్లించడం? ఒక తెలుగుపద్యం అభినయించే పట్టులో, రసం అభివృద్ధిచెయ్యడానికి ఇంగ్లీషుమాటలు (నటుడికి వచ్చునుగనక) మిళాయించెయ్యవచ్చా? —అదీ నాదజనకమే గనక? అన్నింటికీ ఏమి, పోనీ, పద్యం ఆస్వాదించగా ఆస్వాదించగా శృతిమించి రాగాన్ని పడుతుందనేవాళ్లు, ఆ రాగాన్ని ప్రకటించి ఊరుకోకూడదూ, పద్యంలోని మాటల్ని పూర్తిగా వదిలేసి? రాగాభినయమే తెలుగునటుడి కళ అని నిర్ధారణేనా అయిపోతుంది!

ఒకరి అభిప్రాయం: ఒక కళ ఇతరకళల్ని ఉపాంగాలుగా తీసుకోవచ్చు. సాధారణంగా సంబంధంగల కళల్నే తీసుకుంటారు. గాయకుడు తను గానంచేసేటప్పుడు కొన్నిపదాల్ని ఉపయోగించుకున్నట్టే (రెండూ నాదజనకాలే గనక), పద్యాన్ని ప్రకటించేవాడు కొన్ని స్వరాల్ని ఉపయోగించుకోవచ్చును—అని. కాని ఈ ఉపమాన ఉపమేయాలకిభర్జించని విషయం ఒకటుంది. గాయకుడు పదాలు ఉపయోగించుగునేమాట రూఢే, కాని అతడు అప్పట్లో కల్పించుగున్న బాపతు

కాదు. అంతకు పూర్వమే స్వయంగా తనో, లేక తనకి నచ్చిన అన్యుడో సృజించినవి. అనగా, ఆ పదాలు గాయకుడు ఆ క్షణంలో సృష్టించే కవిత్వం కాదు. కాని, గానం దారి వేరు. గానానికి వర్తమానమే కాని భవిష్యం లేకపోవడంవల్ల, ఎప్పటి గానం అప్పుడే సృజింపబడాలి, ఎవరి గానానికి వాళ్ళే రూపం ఇయ్యాలి. ఒక కవి రచించిన పదాల్ని మనం మరొకరితో చెప్పడానికి వీలుంటుందిగాని, ఒక గాయకుడి రాగం మనం మరొకరితో మనివి చెయ్యడం అసాధ్యం. కాబట్టి, రాగం అనేది అదినరకే రచింపబడి నిర్ణీతమై వ్యవహరించడానికి వీలైన ఆకారంలో ఏ సీసాలోనో ఉన్నట్టు—కాస్తంత రాగం కలుపుకుంటేం — అనడం, గానంయొక్క మహోత్కృష్టలక్షణం విస్మరించడం.

మరి కొందరు మొహమాటం విడిచి: కవిత్వం ఎంత గొప్పదైనా పద్యాన్ని పఠించి ఊరుకుంటే బోసిగానూ బోడిగానూ ఉంటుంది. కాబట్టి పద్యవైధవ్యం తొలగించాలంటే రాగాలంకరణ విధాయకం. అందుచేత నాటకరంగంమీద నటుడు పద్యాలు పాడాలి—అంటారు. ఆంధ్రపద్యాన్ని బోసి, బోడి అనడం ఆంధ్రఛందశ్శాస్త్రానికి శూన్యం పెట్టడమేకాక, వెయ్యేళ్ళ కృషిమీద వెల్తిమాటాడి నోరు పారేసుకోవడంకుడానూ! అయినా, పుట్టువితంతువులైన ఆంధ్రపద్యాల వైధవ్యం తప్పించడానికి, వీరేశలింగంపంతుల్ని మించాలని చూసే ఉత్సాహవంతులు ఉండగలరు. చెడ్డ రాగం, వాళ్ళు, తీసుకురానియ్యరు. అదీ వితంతువే! మంచి రాగానికి ఆకర్షణ ఉంటుంది. అదీ కాదు. ఆకర్షణగల రాగమే మంచిది గనక అల్లాంటిదే పట్టుకొచ్చి కలపాలని వాళ్ళ పట్టుదల. కాని, ఆకర్షణశక్తి ప్రతికళకీ ఉంటుంది. నటుడి కళ నటనం. నటనంమూలంగా ఒకడు జనాన్ని ఆకర్షించినప్పుడే అతడి నటనం ఒకకళ. అట్లా చెయ్యలేక, చెయ్యలేనివాడు ఊరుకోక,

పై పెచ్చు అన్యకళకి ఆకర్షణ ఉందని ప్రకటిస్తూ, దాన్ని మాటు పెట్టి జనాకర్షణ చెయ్యడం తన కళకి తను శత్రువున నే సంగతి ఒప్పేసుకుని ఒప్పేసుకోడం. పైగా, గానం జనాన్ని ఆకర్షించడమే కాదు, పరవశుల్ని చేసి చుట్టపెట్టేసి మరి వాళ్ళని వదలదు. జనం గానలోకం లోనే ఉండడం జరుగుతుంది. నాటకానికిగాని నటుడికిగాని పరమావధి అది కాదు.

పద్యం అనేదానికి రాగం అనేది ఇతరమానవహృదయాలకి దాన్ని పాకించడానికి సాధనం అని కొందరి వాదన. కాని, తన హృదయం ప్రవేశించడానికి అక్కర్లేనిది, ఇతరమానవులగురించి కావాలనుకోడం పరితయొక్క స్వాతిశయం. పద్యంలో స్వతస్సిద్ధంగా ఉండే నడకే ఆ పనికి సాధనం. నడిచే లక్షణం పద్యానికి సహజంగానే ఉంటూండేటప్పుడు దాన్ని పాకించడమూ దేకించడమూ కర్మం ఏమొచ్చె! నడక కవులకి ఒక ఆయుధం. ఛందస్సు వేదపురుషుడి పాదాలు. తెలుగుపద్యాలు ఎన్నోరీతుల్లో నడవగలవు. ఉన్న సాధనం గమనించక అగమ్యసాధనం మరో టేదో ఉంటేగాని వీల్లేదనడం, తెలియవలిసింది తెలుసుగోక, తెలియజాలనిది బహు స్పష్టంగా తెలుస్తోందని అనుకోడం.

కొందరు నిర్మోహమాటస్థులు అన్నారు: "మేం నాటక పద్యాలు ప్రదర్శనానికి వెళ్ళకపూర్వమే ఎరుగుదుం. చూశాం. వాటిల్లోని పదార్థం మాకు తెలుసు. అచ్చుపడ్డవి అప్పగించడంలో ఉండేవిశేషం గమనించడానికి వెళ్ళం మేం. వాటిని పురస్కరించుగుని నటుడు తిప్పుగోడాలుకూడా మాకు తెలుసు. ఆ పద్యానికి నటుడు తన తాలూకు గాంధర్వం ఎంతవరకు ఉచితంగా అర్థభావాభినయాలకి భంగం రానీకుండా లుంగచుట్టగలడో చూడాలని," అని. అనగా, పద్యంలోని పదాలమీద వాళ్ళకి గణ్యత నశించి, నటుడి కంఠం

మీదమాత్రమే మనసు పోతుందన్నమాట. కాబట్టి లోగడ నాటక పద్యం చదివినవాళ్లకి అందులో చూస్తే అల్పరాగమే లక్ష్యం. ఇక చదవనివాళ్లకి సరేసరి. శృతి వెయ్యడం, ఏదో కొంత గానం చెలరేగ బోతుందని ఒక విధమైన బజానా వంటిదికదా! పాత సరకు కాదు, శ్రద్ధ అవసరంలేని కొత్త దినుసు ప్రారంభం అవుతోంది అనే సూచన కదా! అందుకని చదవని వాళ్లూ అందుకే చెవులు నిక్కబొడుచుకుని ఉంటారు. 'మహారాజు వస్తున్నారు' అనే కేక వినబడగానే జనం దృష్టి మహారాజు వచ్చేవేపు మళ్లడం సహజంకదా? అందుకనే సంభాషణల్లో, 'ఈ వేళ హరిశ్చంద్రుడు ఎవరు వేస్తారండీ?', 'ఫలానా వారు', 'బాగా పాడతాడా, టిక్కట్టుసొమ్ముకి తిరిగొదకాలా?' అనే మోస్తరుగా వినబడుతూంటుంది. ఓ నలభై యేళ్లు సంగీత నాటకాలు ముమ్మరంగా జరిగాయి. సాహిత్యనాటకాల్లో చేర్చతగ్గ నాటకాలు కుడా సంగీతపరంగా చెల్లిపోయాయి, సంగీతనటులంతా ఆయా నాట కాల్లోని సాహిత్యమంతా నేర్చవలిసిన అవసరం కలిగినా తీరిపోను, వాళ్లు నేర్చిఉండేవాళ్లు, రాగస్మరణ లేకుండా భావాభినయాల జాగర్త పడిఉండేవాళ్లు. మొదటి సంగతి, వాళ్ల భాషాజ్ఞానం పెరిగిఉండేది. దాన్నిబట్టి, నటనం—నటుడికళ, అభివృద్ధి చెందిఉండేది. సంగీత నటుల్లో వెయ్యి పద్యాలు రాగించగలవాళ్లు ఉన్నా, చాలా వాట్లకి సారస్యం గాని, భావంగాని, అర్థంగాని తమరికి ఎక్కడ తెలిసిపోతుందో అన్నట్టు తయారవుతారు. అనగా, పద్యపాదాలకి రాగరజ్జువులు బిగించి లాగుతూ పదశవాల్ని నోటితో ఈడ్చేస్తారు. కాని, 'రాగం చొరనియ్యకూడదు, అది గాయకుడి కళ, నేను గాయకుణ్ణైనా ఇక్కడ ఆ కళ రానియ్య కూడదు, రానిచ్చినా నాకూ గాయకుడికీ సాపత్యం తెస్తారు, తెస్తే— నావి పొలికేకలని తేలవచ్చు, కాబట్టి నేను పద్యాలు పఠించవలె' అని నటుడు అనుకోగలిగిననాడు, 'పద్యం అంటే ఏమిటి? దాని లక్షణా

లేమిటి? దాని విశేషా లేమిటి? దాన్ని నేను ఎట్లా ఉచ్చారణచేస్తే అందులో ఉండే పదాలు జీవించి, పాత్రసిద్ధి జరుగుతుంది? కవిత్వరూపం ఎటువంటిది? వృత్తనియమాలు ఏవి? అలంకారాలు ఏమిటి? నడక ఏమిటి? పూర్వకవిత్వం ఎట్టిది? మొదలైన ప్రశ్నలు నటుడిమనస్సులో పుడతాయి. కాని, సంగీతనటుడు, ఏమి చేస్తున్నాడూ! పద్యంలో దొరికే కవిత్వంసంగతి అవతలపెట్టి, తనకి వచ్చిన భైరవీ, కాంభోజీ, తోడీ పద్యానికి కలిపేరీతిగురించిన నిరంతరఆలోచనలో పడుతున్నాడు. అన్యు డెవడైనా ఎక్కడేనా ఏదేనా సంగతి వేస్తే, అది రంగంమీదించి తను ఎక్కడ దొర్లించవచ్చో చూసుకుంటూ ఉండడం, అన్యుడు ఆ సంగతి అభేరిలోవేస్తే తను ఆనందభైరవిలో వెయ్యడం. ఇల్లాంటి ఎత్తులతో గానంలోనూ కాక, గానశాస్త్రంలోనూ కానటువంటి వ్యవసాయంలో ఉండిపోయే సంగీతనటుడు పద్యోచ్చారణకి ఎట్లా అర్హుడూ? పద్యం అతడి సొమ్మెట్లా అవుతుందీ?

అదీకాక, అక్కడక్కడ పద్యాలు తగుల్తూంటాయికాబట్టి, పద్యాలు రాగాలతో అనాలిట— అల్లా నటులు శ్రమరహితంగా పాడడానికేట రచయితలు పద్యాలు అక్కడక్కడ రానియ్యడం! కాని, నాటకం విశేషభాగం పద్యరూపంలోనూ అక్కడక్కడ గద్యాత్మకంగానూ ఉంటే, అప్పుడు గద్యలే పాడతారా పద్యాలు మానేసి? పోనీండి, నాటకం యావత్తూ పద్యరూపంలో ఉంటే అంతా రాగాలెట్టి పాడడమే? అయితే నాటకం ఆడడమా పాడడమా? ఒక పార్శీకంపెనీ వాళ్లు కాకినాడలో 1916లో ఒక నాటకం అంతాపాడేశారు. కారణం ఏమంటే, ఆ నాటకకర్త నాటకమంతా ఒక రకం ద్విపదలో రాసేశాడట! కాబట్టి రాజు, మంత్రి, బంటు, రాణి, దాసి అంతా కూడబలుక్కుని వచ్చేసినట్టు ఒకే రాగం — (ఫీలు అని జ్ఞాపకం) జోడించి నాటకపద్యపాదాల్ని సభవాళ్లమీద దొర్లించేశారు — ఖైబరుప్యాస్

లోంచి రాళ్లు దొర్లించినట్టు! నాటకం జరుగుతూన్నంతసేపూ శృతి మోగుతూనే ఉంది. తబలా వాగుతూనే ఉంది. ఏ వృత్తరూపమో ఒకటి పదునెట్టి ఒక నాటకకర్త తెలుగులో నాటకం రాస్తే, అది పాడదమేనా, ఆడదమా ?

కొందరు : గానం 'అమ్మ్యూజ్మెంట్' అనిపించి శ్రమోపశమనం చేస్తుందిగనక పద్యం రాగం తియ్యాలి, అన్నారు. నాటకకర్త శ్రమోపశమనంగురించి చాలా జాగర్త పడతాడు, అందుకనే, కథలో, ఘట్టాల్లో, ఉదంతాలలో, పాత్రల్లో, భాషలో—రకరకాల వైవిధ్యం గమనించి మరీ నిర్వహిస్తాడు. గంభీరరంగం తరవాత తేలికరంగం అందుకనే, అంక, రంగ విభజన అందుకనే—అనగా అప్పుడప్పుడు తెర పడుతూండడం. అన్ని పాత్రలూ ఒకరే ధరించక పాత్రకి ఒకరుచొప్పున ధరించడం అందుకనే. పైగా, పద్యం జరిగేకాలంలో రాగం ఎట్లా అని మన విషయంగాని, నాటకరంగాన్నించి గానాన్ని ఊడ్చి పారెయ్యాలని ఎవరూ అనలేదు, నేనూ అనను. రంగాలమధ్య, నాటకం రక్తి చెడకుండా, కవనగానరసజ్ఞులు మెచ్చేలాగ, గాయకుణ్ణి పెట్టి, అతడిచేత ప్రదర్శనశ్రోతలకి గానం ఇప్పించవచ్చు. నాటకసమాజానికి ఒక సార్థకగాయకుడు చాలు. చిత్రకారుడు ఒకడు ఉండడం లేదూ? అతడు అదివరకే చిత్రించిన తెరలు ప్రదర్శనంలో చూపిస్తున్నారుగాని, పద్యం జరిగే క్షణంలో నటుణ్ణి, యథోచితంగా అభినయిస్తూ, తెరలు చిత్రించమంటున్నారా ?

కొందరు కళాభిమానులు : హరిదాసు పద్యాలుపాడి రక్తి కట్టించడంలేదుటండీ, పాడ్డంలో ఉంటుంది మజా! అనేస్తారు. కాని, జరిగినట్టు నమ్మబడే సంగతి చెప్పేవాడు హరిదాసు, అప్పటికప్పుడు జరుగుతూన్నట్టు భ్రమింపచెయ్యడానికి రంగంఎక్కేవాడు నటుడు. హరిదాసుమాత్రం అప్పుడప్పుడు నటించడా అంటే, మానసికంగా,

వాచికంగా నటించవచ్చు. కాని, వెన్వెంటనే తనుగానే తోచి వ్యాఖ్యానం చేసుకోగలడు. వెనక ఎవరోరాజు తన చిక్కులు తను పడుతూ ఎట్లా విచారించాడో మనకి చెబుతూ, తన స్వంతగానం మిళితంచేసి మనల్ని, హరిదాసు, ఆనందయుతంగా విచారంలో పడే స్తాడు. నటుడు, ఎవరో రాజుయొక్క సంగతి చెప్పి మనల్ని ఆనంద యుతంగా ఏడ్పించడానికీ, ఆనందయుతంగా భయపెట్టడానికీ రాడు. తనే ఆ రాజులా మనకి తోచాలనీ, కనిపించాలనీకూడా వస్తాడు. ఏ రసంలో అయితేం, ఏదో ఒక అవస్థయొక్క అనుభవం ప్రకటించి వ్యాపింపచెయ్యదలిచినవాడికి ఆనందమూ గానమూ ఎల్లా పుడ తాయీ? సభ్యులకి తన అవస్థ అవగాహనఅయి వాళ్ళకి సానుభూతి కలిగి తద్వారా వాళ్ళకి ఆనందం కలగాలిగాని!

'నాటకం కొన్ని కళల సమీకరణంగనక పద్యాలు పాడడం మానకూడదు' అని ఒకాయన సెలవిచ్చారు. వారి అభిప్రాయంలో, తమరు వాడిన 'నాటకం' అనేదానికి అర్థం 'సంగీతనాటకప్రదర్శనం' అనిన్నీ, 'కళ' అనే దానికి 'కవన గాన చిత్ర శిల్ప కళలలో ఒకటి' అనిన్నీ, 'స మీ క ర ణం' అనగా 'సం పు టి' అనిన్నీ కుడా ప్రశ్నింప బడ్డమీదట అన్నారు. పై వాక్యంలోని మొదటి భాగం సత్యమే. నాటకప్రదర్శనం కంటికీ చెవికీకుడా ఉత్సవమిచ్చి ఆత్మానందం చేకూర్చాలి. కాబట్టి కళలన్నీ రంగంమీద ఉండవచ్చు. గద్యపద్యయుక్తమైన కవనం, గేయ యంత్రమూలకమైన గానం, యవని కాదికమైన చిత్రణం, పరికరవేషాదికమైన శిల్పం, అక్కడ ఉండవచ్చు. కాబట్టి, పద్యంయొక్క ఉచ్చారణ జరిగే కాలంలోమాత్రమే రాగసృష్టీ, తత్పద్యరాగసంధానమూకుడా నటుడే చెయ్యాలి అనడం, 'ఏదో నా యిష్టం, ఇల్లా పోనీండి, అన్నానుగదా మంచో చెడ్డో' అన్నట్టుంది కాని, సబబుగాలేదు. కవన, గాన, చిత్రకళల సంబంధాలు చెప్పడంలో

రసానికి అనుగుణంగా బొమ్మలున్నాయని చెప్పేవాళ్లూ నమ్మేవాళ్లూ ఉన్నారు. కాని, ఎందుచేతో, నటుడు రంగం ఎక్కి, రసానికి అనుగుణంగా బొమ్మలు చిత్రించగలపాటి నేర్పరైనా అయిఉండాలి, పైగా ఆ బొమ్మలతడు నాటకకర్త రచించిన పద్యం వినిపించే క్షణం లోనే, అర్థానికి ఏమీ భంగం రాకుండా, కనులపండువుగా, చిత్రించాలి, అప్పుడుగాని పద్యం బాగుండదు—అని వాదించేవాళ్లు లేరు. కాని, అట్లా చెయ్యగల చిత్రణనటుడు ప్రజ్ఞావంతుడు కాడా? సంగీతనటుడు పద్యగానం చేసేవాడయితే చిత్రనటుడు పద్యచిత్రం అప్పటికప్పుడు వేసేవాడవుతాడు. నాటకప్రదర్శనాలలో మనికి లభించే చిత్రకళ యావత్తూ, నటుడు తన పద్యమోక్షకాలంలో ప్రసాదించే సరుకా? సంగతి యేమిటంటే: చిత్రరచన రూపంపొంది నిలవగల కళ. అందువల్ల నటవర్గానికి చెందని ఎవరో చిత్రకారుడు లోగడే చిత్రించిపెట్టిన తెరలు వెనకదిక్కుగా ఉపయోగిస్తారు. ఒక బస్తీవీధి, ఒక అరణ్యం, ఒకవనం, ఒక దేరాలవరస — ఇవి సర్వసాధారణంగా ఉండే తెరలు. ప్రదర్శనరంగాలకి అనుగుణంగా తెరలు మారుస్తూంటారు. అది రక్తికరంగానే ఉంటుంది. కాని, చాలాచోట్ల రంగం మారిందికదా ఏదో తెరమార్పు కూడా చెయ్యక పోతే బాగుండదు అని చెప్పేసి, తెర పిరాయిస్తారు—ఒక్కొక్క వ్యాస లేఖకుడు మొహమాటంకోసం కొత్తపేరా మొదలెట్టినట్టు! కాని ఏ ప్రదర్శనానికి ఆ ప్రదర్శనపు తెరలూ అంటూ ఉండవు. అన్ని ప్రదర్శనాలకీ అవే తెరలు. అనగా ఒక ప్రదర్శనపుమాటలు మరోప్రదర్శనానికి పనికిరావు గాని, తెరలు పనికొస్తాయి. కొత్త ప్రదర్శనానికి కొత్త తెరలంటూ ఉండవు. పాత తెరలు 'టచ్' చేస్తూండడానికీ, తెరమీద నాటితేదీ వేసి దాన్ని 'అప్-టు-డేట్' చెయ్యడానికీ, ఒక చిత్రకారుడు ఉంటాడు. తెరలపని అతడిది. అంతేగాని ఏ నటుడూ

తెరలపని ఎన్నడూ చూడను, పద్యం మాట్లాడే కాలంలోనూ చూడను. చివరికి దమయంతి, సావిత్రిపాత్రలు ధరించే వ్యక్తులకైనా, భర్తల చిత్రపటాలు చిత్రించారని కథల్లో ఉన్నా, చిత్రాలు రచించడం రానక్కర్లేదుట! ఇదీ చిత్రరచన సంగతి! ఇక, నటుడు తను పద్యంలో ఉండేముక్కలు చెప్పి అభినయించవలసిన అవసరంలో రాగం చుట్టుగోడం ఎందుకూ గొంతికిక్క? అల్లా చేస్తేగాని కళల సంపుటి సిద్ధించదా? అల్లాచేస్తే సిద్ధించదా? అతడు పోషిస్తూన్నది ఏ కళ? ఏ కళవల్ల ఇన్నీ వచ్చాయో, దేనివల్ల తను జనించాడో దాన్ని యథాగమనంతో ఎదటివాళ్ళకి మొట్టమొదట శ్రుతం చేసిన మీదట కదా కవి సృజించినపాత్రకి జననం? అందునిమిత్తం చూపించగలిగిన శ్రద్ధ చూపించి, చేయగలిగినంత ధ్యానం చేసి, తద్వారా తన మనస్సూ వాక్కూ చేష్టా మార్చుకోగలిగినంత మార్చుకుని, ఆ మార్పు నిలబెట్టుగుని, పోషించి, దాని పరమార్థం తను గ్రహించి, గమనించి, ఆచరించి, సభాసదుల్ని రంజింపజేస్తున్నాడా? అనగా, కవిత్వాన్ని అతడు గౌరవిస్తున్నాడా? మూడుకళల సంపుటీముచ్చట సంగతి అల్లా ఉంచండి. తాళగమనం లేకుండా, పద్యగమనానికి భంగం రానీకుండా, రాగసంపుటి చేయగలడా ఎటువంటి అపూర్వసంగీతనటుడైనా?

'గానం దేవకళ. నాటకరంగాన్నించి దానికి స్వస్తి చెబితే అది నష్టం అవుతుంది. ఒక్కొక్కరి యిష్టానుసారం ఒక్కొక్క కండ తీసివేయుటకు వీలులేదు. అట్లుచేసిన నాటకప్పాకలు తగులడి పోవును, అని ఒకరిబాధ. ఉచ్చారణలో పద్యంయొక్క ప్రత్యేకజన్మ గురించినది చర్చావిషయం. నాటకరంగం ఒక రకం కాదు. ఇదివరకు భాగవత రంగం, వచన రంగం, సంగీత రంగం ఉన్నాయి. పద్య నాటక రంగంగురించి మన తర్జనభర్జన. గానం దివ్యకళే. అది రంగం మీద ఉండావచ్చు. ఒక పద్యానికి బయటినించి తెచ్చి తగి

లిపించే రాగం, ఆ పద్యంయొక్క 'కండ' అనడం అధర్మం. (అంతేకంటె పద్యంయొక్క నడక సహజంగా ఉంటుంది గనక దాన్ని ఒక కండ అనడం సబబు) పద్యానికి రాగాన్ని 'కండ' అని ఒకరు ఉత్ప్రేక్షిస్తే, 'శని' అని మరొకరు ఉత్ప్రేక్షించి అది పద్యాన్నించి విరగడై పోతే చాలు, తల తడిమి చూసుకోవచ్చును అంటారు. ఉత్ప్రేక్షలు హేతువాదంలో రెండువక్షాలా ఒప్పుతాయి. కాని, రాగం తెలియని వాళ్ళు పద్యం ఎప్పుడు రచించ గలిగారో, అప్పుడే స్థాపితమైంది, రాగం పద్యానికి కండ కాదని. ఇల్లాంటి 'కండ'లు ఎన్ని చెండి ఇది వరకే యిచ్చారూ—శిబిచక్రవర్తిలాగ—ఇప్పుడు మరోటా అనడానికీ! 'అట్లాయితే నాటకప్పాకలుపోతాయి' అంటే ఎట్లాయితే? పద్యాన్ని యథాగమనంతో చెప్పడంతో లేనా? అన్యత్వారోపణసిద్ధికి తపస్సు ధారపొయ్యనివీ, ప్రజలకి సానందబోధ చెయ్యనివీ అయినప్పుడు నాటకప్పాకలు ఉండేం లేకేం? అవి రాగప్పాకలుగా మారి ఉం టాయి. పద్యం నటుడుపాడకపోతే గానం పోతుందనడం ఘోరం! అన్యుడుగా ఒప్పవలిసినవాడి నోట పుట్టి సావకాశం లేకపోవడం వల్ల హడావిడిగా పెరిగి నలిగి పోవడం బదులు, హాయిగా గాయకుణ్ణి ఆశ్ర యించి అది బతగనేనా బతుగు తుంది.

# 10. అనర్థాలు

ఒక రావు హరిశ్చంద్ర వేషం వేశాడనుకోండి. అతడు వచనపు ముక్కలు మాట్లాడేటప్పుడు శబ్దశక్తియొక్క మహిమవల్ల శ్రోతల అంతరంగాల్లో వస్తుచ్ఛాయలు కల్పితమై, పూర్వాపరోక్షసంఘటనల అనుభవాలు కలిగి, హరిశ్చంద్రుడి అవస్థ (నటించే రావు సామర్థ్యాన్ని బట్టి) గోచరిస్తుంది, ఆ నటుడే హరిశ్చంద్రుడు అనిపిస్తాడు. కాని, ఆ రావు రాగంలో పద్యం అందుకున్నా, అందుకోడానికి 'ఊ'ం అనుకున్నా, ఎదర ఉన్నది 'ఫలానా రావు' అని శ్రోతలకి తోచిపోతుంది గాని హరిశ్చంద్రుడు మరి తోచడు. గానానికి వృత్తాంతప్రమేయం లేదుగనక, అది వ్యక్తిత్వస్థాపనే చేస్తుందిగాని, అర్థభావాలద్వారా అన్యత్వం స్థాపించడానికి నటుడు చేసే యత్నానికి దోహదం చెయ్యదు సరిగదా ప్రతిబంధకంగా పరిణమిస్తుంది. రాగాన్ని జొనిపి 'అది ఎల్లా ఉంటేం ఉంటుందీ, అదే వింటూండడం అజ్ఞానం, ఏ పదాల శ్రావ్యతకోసం దాన్ని తెచ్చారో, ఆ పదాలు విని అర్థంచేసుకోడం జ్ఞానం,' అని వాదించడంలో జ్ఞానం కంటె తక్కిన దేవెక్కువ కనపడుతుంది. అర్థంతో నిమిత్తంలేని రాగమే శ్రోత మొదట ఆలకిస్తాడు, శ్రమఉండదుగనక! కష్టతరసులభతరవ్యాపారాలు జమిలిగా మనకెదురైనప్పుడు ప్రప్రథమంగా సులభతరవ్యాపారదిశలో మన మనస్సు వెడుతుంది అనుకోవడమే సమంజసంగానూ సవివేకంగానూ తోస్తుంది.

యోచనచేసి పండితులు సక్రమపరిష్కరణ చెయ్యకుండా ఉపేక్షించడంవల్ల, తెలుగుపద్యం పాడడపుఅకృత్యం ఏదార్నో ప్రవేశించి ఎంత లోతుగా వేరుదన్నిందీ అంటే: తెలుగుపద్యం పాడకపోతే కవనగానసంస్థలకి ఒక్కదెబ్బని పరమద్రోహంచేసేసి పాపం కట్టుగుంటాం అన్నమాట, అనేభావం పఠితకీ శ్రోతకీకూడా కలిగేటంత! 'యద్యదాచరతి శ్రేష్ఠ

స్తత్తదే వేతరో జనః, స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే?' 'పాపంబులు కర్జములని యేపున జేయంగ నవియు నింపగు, ధర్మవ్యాపారంబుల కార్యములై పరిణతిపొందెనేని యట్టుల సెల్లున్.' అను-రాగంతో వినడం సంగీతనాటకసభ్యులు ఆర్జించుకున్న గొప్పహక్కుల్లోఒకటి. సంగీత నాటకసభ్యులకి పద్యంగాని, రాగంగాని అక్షరాలుగాని ఏమీగాని తెలియకపోడానికికుడా హక్కుందిట. వాళ్ళకి అటువంటి క్షుద్ర రాగాభిరుచి నేర్పిపెట్టడంవల్ల, అది క్రమేపీ ఇతరసభాసభ్యులకి కుడా సంక్రమించింది. సారస్వతసభలోనైనాసరే, వక్త, ఒక కవి రచించిన పద్యంలోని పదాల్ని యథాక్రమంలో ఉచ్చరించాడా, వాడి పని అంతే! ప్రతీ సారస్వతసభ్యుడూకుడా పెదిమి విరిచేసి, 'ఛీ, ఆయనగొంతిగ ఏడిసినట్టుంది. పద్యంలో ఏదో భావముంటేమట్టుకు? చక్కని గొంతిగ వాడు దానికి తియ్యటిరాగం పేళంగించనప్పుడు, ఆ భావం ఎవడికి కావాలీ?' అనేస్తారు. అల్లా ఎక్కడ అనిపోతారో అని, కొందరు వక్తలు, తమరికి వచ్చిన కూనురాగం (ఆనకట్టు పూర్వందో, ఇక్ష్వాకుల నాటిదో) తీస్తూ, పద్యంలోని ఉత్కృష్టభావాన్ని ప్రకటించడానికి యత్నించి, హాస్యాస్పదులైపోతారు. అట్లా కాకుండా ఉండడానికి మరి కొందరు: 'నా గొంతిగ బాగుండదు. నాకుగానం రాదు. అయినాసరే నేను మూలగక మానను. మీరు భరించితీరాలి, గత్యంతరం లేదు.' అనే లాంటి ఉపోద్ఘాతంలో క్షమాపణపరభాస్తు పారేసి, దీర్ఘాలు మొదలెడతారు. వేరే కొందరు, రాగాలు విరజిమ్మి విజృంభించగల దిట్టల్ని మొదట్లోనే ఏర్పాటు చేసుగుని, పద్యరచనయావత్తూ వాళ్ళ అధీనంలో ఉంచేస్తారు. అల్లాంటివాళ్ళు తమ గొంతిగల గిరికీలతో రాగసంగతుల్ని తూటాలు పువ్వులు కక్కినట్టు కక్కిపారేస్తూ పద్యాన్ని ఎగరేసి అది నేలపడకుండా దాన్ని అంతరిక్షంలో నిలబాటు చెయ్యగల సమయంలో మాత్రమే ఆ పద్యభావాన్ని మెచ్చుగుంటున్నాం అని హర్షధ్వానలు

చేస్తూ, అట్లా కాకుండా యథాగమనంతో పద్యాన్ని ప్రకటించేప్పుడు అది తద్దినపుమంత్రంలా తగులడిపోతుందని యోగ్యతాపత్రం ఇస్తే, దాన్ని తలదాల్చే రసజ్ఞులుఛందస్సు తెలిసినవాళ్లల్లోఉంటూన్నప్పుడు, పద్యభావానికి పట్టేదుర్గతి ఇంతాఅంతానా! తేరగావస్తే చాలు, ఇతరుల తాలూకు ఎంత సొమ్మైనా పుచ్చుకోగల ధర్మాత్ములున్నారు. అసలు మజా అంతా అల్లాంటి సొమ్ములోనే ఉంది, పుచ్చుగుంటే అల్లాంటి సొమ్మే పుచ్చుకోవాలిఅని మెచ్చేవాళ్లుంటారు. — రేపెప్పుడేనా అల్లాంటిది తమరికికూడా దఖలుపరుచుగోవచ్చునని గావును!

అసలు నటుడు, పద్యం పాడడం అనేది ముసుగులో గుద్దులాట. ఉమ్మడిగా ఉన్నంతకాలం ఏమీ ఒడుదుడుకులుండవ్, అంతా గుంభితంగా గుప్పిడిలో ఉన్నట్టు సాగిపోతుంది. కాని, పంపకాలై వేర్లు పడేసరికి కళ్లు బయటపడి, ఋణాలు తేల్తూంటాయి. ఇది గృహకృత్యంలో మాట. ప్రస్తుత విషయంలో వాటాదార్లు నలుగురు — (1) పాత్రధారి. ఇతడు రంగం ఎక్కడం అన్యుడై ఒప్పడానికి. మానసిక అవస్థ తెలిస్తేగాని వ్యక్తి ఒప్పడు. అర్థస్ఫురణమే అయే పదాల వల్లగాని అవస్థ తెలియదు. ఆ పదాలకర్త అన్యుడు. అవి ఇతడు తనవిలా అంటాడు. (2) పద్యకర్త. పద్యరచయిత మరొకడు. పాత్రధారి పద్యరచయితకూడా అయిఉండినా, అది లోగడే రచించి ఉంటాడుగాని, ఆశువు చెరగడు. (3) రాగకర్త. నటుడే — కాని రంగంమీద ఒప్పవలసిన వ్యక్తికాడు. పూర్తిగా మాటుమణగవలిసిన పాత్రధారీ కాడు, ఆ పాత్రధారియొక్క గాత్రం మాత్రమే. దానితో అతడు రాగం విసరాలి. రాగంలో అవ్యక్త ఆనందమే ఉంటుందిగాని, అవస్థ తేలదు. పాత్రధారిగాత్రం పాత్రధారివ్యక్తిత్వాన్ని స్థాపించేస్తుంది. (4) ప్రేక్షకులు. నాటక ప్రేక్షకులు శ్రోతలుకూడానూ. వాళ్ళల్లో ఉండరాని వాళ్ళుండరు. అడ్డమైనవాళ్ళూ

ఉండవచ్చు. స్ఫూర్తిలేకపోయినా సరే మానవత్వం ఉండి భిక్షు భరించగలిగితే నాటకప్రేక్షకత్వం లభిస్తుంది. నటుడు కర్తరచించిన గద్య పద్య గేయాలు కంఠపాఠంచేసి, గద్య స్వాభావికంగానూ చెప్పేస్తూండేవాడు, అది అవగాహన అయి, అతడు సమర్థుడైతే అన్యత్వం సిద్ధించేది. పద్యాలు అతడికి వచ్చిన గానంతో పాడకపోతే అవి జీవించవన్నీ, అసలు చచ్చిపోతాయేమో అనిన్నీ అతడి భయం. చెప్పవలిసిన ముక్కలు మరుపు రావడం జరిగితే, తనుతీసే రాగం చాలా ఉపయోగపడుతుందిగదా అని అతని సంతోషం. భణుతులు నేర్చి అతడు మట్లూ, పాటలూకూడా పాడుతుంటాడు. ఈ రెండు పన్లూ చేసేటప్పుడు అతడు నటుడు కాడు, తనే. కనక ఆ కూ పద్యాల్నిగాని పాటల్నిగాని మళ్ళీ మళ్ళీ అతణ్ణి పాడవలిసిందిగా జనం గోలెట్టి అడిగేటప్పుడు, తనే తనకీ ఇతరులకీ గోచరిస్తూ ప్రజల మొర ఆలకించి, అతడు వాళ్ళు చెప్పిన ప్రకారం చేసేవాడు, లేకపోతే ప్రదర్శన ప్రేక్షకులు తమ హక్కుల ప్రకారం జంతు ధ్వనులు సృష్టిస్తూ గోలచేసి నెగ్గేస్తారు. ఎవో చవటచెత్త మాటల్తో అల్లిన బుట్టలాగ పద్యాన్ని గణించి, దానికి ప్రాణప్రతిష్ఠ చెయ్యడానికి తనే వీరకంకణం కట్టినట్టు నటుడుంటాడు. రెండోపాటూ ద్వారైన పద్యకర్త, తెలియకపోతే సరేసరి తనకి గానం తెలిసినా పద్యాల్ని స్వరపరచడు, లయపరచడు, రాగసూచనేనా చెయ్యడు, అవి తన నోట్లోంచి ఎల్లా మొలిచాయో చెప్పడు, మూగనటిస్తాడు, మంచి రాగంతీసేవాడు ఝుమాయించి పాడితే శృతి మించి శరీరాగాన్ని పడిపోయిం దంటాడు, సంసారిపక్షంగా తేలిస్తే తన పద్యంలో 'ఫోర్సు' పైకిరావడానికి వీల్లేకపోయిందంటాడు, ఉద్ధతమైన వాడూ నటుడై తన పద్యకవిత్వాన్ని తగలపెట్టేస్తున్నా దంటాడు, ఉచిత రాగం ఉచితంగా కలిపితే ఉచితంగా ఉంటుం దంటాడు. అది ఒక

అంత్య పరిష్కారణా వాక్యం అనిన్నీ, దానికి మరి తిరుగులేదనిన్నీ అతడి సంకల్పం. అదీ కాక, నాటక కర్త, తన గేయం గాయకుడు పాడాలని ఉద్దేశించవచ్చు అల్లాగే తన పద్యం సారస్వతుడు పఠించాలని కోరుకోవాలిగాని, పద్యమూ గాయకుడే పాడాలని కోరుకో కూడదు. కాని పద్యకర్త అల్లానే కోరుకుంటూ ఉంటాడు. కోరుకున్నా క్షుద్రరాగుడు తప్ప పద్యగానానికి గాయకుడు తేరగా రాడు. ఆ క్షుద్రరాగుడే నయం అని పద్యకర్త ఉద్దేశపడితే ఏమన్నమాటా? సాహితీ పరుడు తన పద్యాన్ని పఠిస్తే వాడికి లోతుపాతులు తెలిసిపోతే చిక్కుగదా, అందుకని అటువంటి వాడకి పద్యరచనా ప్రకటన దూరం అయేనిమిత్తం తన పద్యాలు పాడితేగాని వీల్లేదని తను పట్టుడుతూంటే, సారస్వతుడు కానటువంటి క్షుద్రరాగుడు ఆపని చెయ్యడానికి, సిద్ధపడితే, పద్యగానం మెచ్చారా, ఆమెప్పు తను తన పద్యానికి జమ రాసుగోవచ్చు, ఛీ అన్నారా తనుకూడా ఇతరుల్తో కలిసి ఆక్షుద్రరాగుడి నిర్వహణం బాగులేదు తనది ఎంతమంచి కవిత్వం అయితేం — అని వాదించి, ఎప్పుడూ తనదే విజయం అని చెప్పుగోవచ్చుగదా — అని. కాబట్టి పద్యానికి రాగం మెలిపెట్టడంలో తేరసామ్ము దఖలు పడడం రూఢిగవక ఎటుపోయి ఎటొచ్చినా, తనకి కొంతలాభం ఉండి తీరుతుందని నాటకపద్యకర్త సంతోషం. ఇక, ప్రదర్శన ప్రేక్షకుల్లో ఒక్కొక్క గడసరి: ఒక చెవితో ప్రదర్శనమూ రెండో చెవితో రాగరసమూ కళ్ళతో నటనారసమూ ఒకే క్షణంలో జుఱ్ఱుకుని ఆనందం ముప్పేటగా పొందుతూన్నట్టు వాదించగలడు, గాని తను వాడకం చేసే శబ్దాల నిర్వచనంలోకి వెళ్ళేటప్పటికి, ఇవతల వాళ్ళు అనవసరంగా ఆరాలు తీస్తున్నారని మళ్ళీ వాదించగలడు. అసలు సంగతి తనూ రాగసౌఖ్యంలో మాత్రమే ఉంటాడు. తక్కిన అందరికీకుడా రాగం తప్ప మరేమీ కుడా అక్క-

ర్నే లేదు. గద్యం జరిగేటప్పుడు తమరికి సంగతులు ఒక్కొక్కప్పుడు బోధపడతూంటాయే గాని, పద్యం పాడేటప్పుడు తమరు అర్థంకోసం బాధపడమనిన్నీ, కొన్ని కొన్ని పద్యాలలో లోగడ గద్యంలో ఉండే అంశమే ఉంటుందనిన్నీ, మరికొన్నింటిలో నాలుగు పురాణ సంప్రదాయాలు స్మరించబడుతూంటాయిగనక వాటిని వినిపించుకో నక్కర్లేదనిన్నీ, పద్యాలు వేడుకగా విలాసంగా మంచిగాత్రంవాళ్ళు తమ అభిమానరాగాల మీద విసరడానికి పనికొచ్చే పదాలు కలిగి ఉండే రకమనిన్నీ, అవి బాగా తమరికి హుషార్ ఎత్తేలాగ పాడేవాళ్ళు రంగం ఎక్కుతారనే తమరు ప్రదర్శనానికి ఎంతసొమ్మైనా పోసి నిలబడ్డ జనం తలలమీద బల్లపరుపుగా పడుకుని టిక్కెట్టు సంపాదించుకుంటాం అనిన్నీ చెబుతారు. కొందరు శ్రోతలు విశేషగానం పుచ్చుకోలేరుట అందుకని నటుడు పద్యం ప్రకటించే సమయంలోనే పాడాలట, ఎక్కువగా నటుడు పాడితే కూతలు మొదలు పెడతారు. వాడుచాలా తక్కువగా పాడే నటుడుగాని, అసలు పాడనేలేని నటుడుగాని అయ్యాడా వాణ్ణి మోసేస్తారు. కాబట్టి క్షుద్రరాగం వల్ల వాళ్లకీ లాభమే. ఏమంటే దాని ధర్మమూ అని, ప్రదర్శన ప్రేక్షకులు తమరి చిత్తం వచ్చినట్టు క్షణక్షణమూ చెలరేగడానికి వీలుంది, ఆ శాస్త్రరాగమూ నటుడు పాడడా, వాళ్ళు నోరుమూసుగుని చూస్తూ ఆలకిస్తూ ఉండిపోవలిసొస్తుంది. ఇలాగ్గా, పాత్రధారీ, పద్యకర్తా ప్రదర్శన ప్రేక్షకుడూ ముగ్గురూకూడా లాభాలు మూటగట్టుకుంటున్నాం అని మురుస్తూంటే, తక్కినవాళ్ళకి బాధ ఎందుకూ? అంటారా ఎక్కడో నష్టం కలిగించని లాభం అంటూ ఉండదు గనక! నేటివరకు పద్యపఠితే తయారుకాలేదు. పద్యపఠనం కళే కాలేదు. పద్యగమనం జనాన్ని ఆకర్షించనేలేదు. పద్యశరీరాన్ని చెవిని వేస్కుగుని జనబాహుళ్యం ఆనందించడం జరగనేలేదు. పద్య

భావానికీ పద్యశ్రోతకీ మధ్య వాఖ్యాత ఉంటేనేకాని పద్యానికి గతి లేకుండా పరిస్థితులు ఏర్పడ్డాయి. ఇవి నష్టాలు కావా?

ఈ పీడ విరగడ చేసుగోవాలని కొందరు: నాటకంలో పద్యాలు తీసేస్తే తీరిపోతుంది. అంతా వచనంలో ఉండిపోతే తగాదాలు ఉండవ్ కదా—అంటారు. నిజమే. కాని, అటువంటి వాదన ఏంధర్మం? నాటక కర్త పద్యరూపంలో అమూల్యభావాలు అందియ్యకూడదు అని ఆంక్ష ఎందుకూ పెట్టడం? నటుడికి ధారణ తప్పదుగదా, పద్యరూపం ధారణ కెంతవీలూ? సరిచూసుగోడానికీ, నచ్చచెప్పడానికీ, పద్యరూపం ఎంత ప్రయోజనకారీ? 'నువ్వు ఫలానా గద్యరూపంలోనే రచించు' అని నాటకకర్తకి హద్దు ఏర్పరచడం ఎందుకూ? 'అద్దు మీరినవారిని దండింపబడును' అని రైలుబద్దెలదగ్గిర రైల్వేఅధికారులు కడుతూండి నట్టూ? ఒకొ్కక్క నాటకకర్తకి పద్యరూపం స్వాభావికంఅయి అతడు తన భావం అన్యత్రా చెప్పలేడేమో— 'కవిత్వంబులు నాకు చెందనివియేమో అంటివా నాదు జిహ్వాకు నైసర్గికకృత్య మింతియ సుమీ' అనే ధూర్జటిలాంటివాడు! విలవ గలిగి అపరూపాలైన వాక్యాల్ని పద్యరూపంలో ఉండగలిగితే, మనం నాటకరంగాన్నించి ఎందుకూ పోదన్నుకోవడం? పద్యాన్ని ఎట్లా వెలువరించడమూ అనే బాధలో, పద్యాన్నే లాగెయ్యమనడం లాయక్ కాదు.

చేస్తూన్న పని తప్పూ అని విశదంఅయిపోయినప్పుడు, కొందరు గడసర్లు అది పట్టిగెళ్ళి ఎవళ్ళనెత్తిని రుద్దడమా అని చూస్తూంటారు. అల్లాగ్గా: కొందరు నాటకకర్తలు, నటులు పద్యాలు పాడాలని మేం కోరలేదు, వాళ్ళే తమ లోట్లు కప్పుకోడానికి పద్య రాగాల్ని జోడించు గుంటున్నారు—అంటారు. ప్రతి సంగీతనటుడూ అట్లా చేస్తాడని మనం సూత్రించకూడదుగాని, ఆ మాటలో సత్యం లేకపోలేదు. పద్యానికి ఉండగల అర్థభావస్వారస్యాలు గ్రహించవలసిన నిమిత్తం లేకుండానే

పద్యం గుమ్మంగా వినొచ్చు. అందులోనే సవ్వాశేరులో బోలెడు. పరాసికంలాగ, 'వన్స్ మోర్' పొందవచ్చు. సీసపద్యంలాంటిదాల్లో పాదాలకి పాదాలే ఎగరగొట్టచ్చు, చిదపకుండా బూరెకి బూరే మింగేసినట్టు. (ప్రాంప్టింగు (అందింపు ముక్కలు) పూర్తిగా అందే వరకూ దీర్ఘాలు అధికంగాతీయ్యచ్చు. మరుపొచ్చిన ముక్కల జాగాలో రెండు చల్లని సంగతులు జార్చవచ్చు. ఎవడేనా సంగీతనటుడు ప్రదర్శనవేళకి దగాచేసి మాయంఅయినప్పుడు మరో నాటకరాగుడు పద్యాలముక్కలు 'ప్రాప్టింగు' మీద అందుకుని పాడేసి, నాటకప్రదర్శనం జరిగిపోయేటట్టు చూడవచ్చు. రంగం ఎక్కవలసినవాళ్ళల్లో ఎవడైనా రైలుమీద రావలిసుండి, అది ఆలస్యం అయితే వాడు రంగం మీదికి హాజరయేదాకా, రంగంమీద ఉన్నవాడే పాట సాగించవచ్చు. కాని, ఏమాట కామాటే చెప్పాగోవాలి. నటుడు కొద్దివాడుగనక, అతడంటే మనికి నల్లేరుమీది బండిగనక, అతడిమీద మన చిత్తం వచ్చినట్టు అనేశాం. వాళ్ళేమంటారో వింటే, కొంచెం ఆశ్చర్యం వేస్తుంది. 'ఈ నాటకంలో ఏముందండీ మా మొహాం? ఉన్నపళంగా ఆడితే ఒక్కడు కూచోడు. ఆ పద్యాలుకుడా ఎవడికీ తెలియవండి, ఏమీ బాగుండవు. పాడడం మానేశామా, నాటకం చచ్చిపోతుంది. ఏవో తడకపదాలంటూ లేకపోతే రాగవిజృంభణకి వీల్లేదుగనక, ఆ నాటకం తీసుగున్నాం' అంటారు. నాటకరచనలో పసలేకపోడాన్నీ, నాటకపద్యంలో జీవం లేకపోడాన్నీ కమ్మేసి ఏదో కృత్రిమరక్తి కట్టించేటందుకా రాగం? అటువంటి వ్యాపారం క్షుద్రనాటకకర్తలకి లాభం గనక పద్యాలు పాడాలా? ఇక, నాటకసభ్యులలో చాలామందికి లోగడగాని అప్పట్లో నటుడు చేసే ఉచ్చారణాభినయాలవల్లగాని పద్యార్థం అవగాహన కాకపోయినప్పుడు, వాళ్ళకి మా చెడ్డచికాకు తటస్థిస్తుంది. గద్య విన్నట్టుగానే వాళ్ళు పద్యమూ వినవలిసొస్తుంది.

గద్యంలోకంటె పద్యంలో విశేషాలు ఉండగలవు. పద్యపఠనం జరిగితే, అటువంటి సభ్యులు తమ మెప్పు తక్షణమే కురిపించి, తమకి చైతన్యం ఉన్న సంగతి ఖాయపరచడానికి వీళ్లు పోతాయి. వాళ్ళకంటె పద్యపఠిత పై చేయి అవుతాడు. అది వాళ్ళకి ఇష్టం ఉండదు. వాడిమీద ఏదో కొంత అధికారం చెలాయిద్దాం అంటే వాళ్ళకి ఏమీ కనిపించదు. పద్య కవితాస్వాదన వాళ్ళవల్ల కాకపోయినా, ఆ విషయం పైకి తెలియకుండా, వ్యవహారం నడిచిపోవాలంటే, పద్యానికి ఏదో ఒక రాగం తెచ్చి తగిలించాలని కోరడమే! వాళ్ళకి ఏ రాగమూ అనిగాని, ఒక రాగం పేరుగాని తెలియకపోడానికి హక్కు ఉంటుంది. పద్యానికి రాగం—మినిమమ్ రాగం కలిపినా, ఏ మాత్రం శృతి ఉన్నా తక్షణమే తమ మెప్పో నిరసనో ప్రకటించెయ్యడానికి తయారు ఉంటుంది. ఛందస్సుని విస్మరించి, పద్యాస్వాదనకి దూరులై, కాస్త రాగపీలిక తగిలించినప్పుడుమాత్రమే కవిత్వం మెచ్చుకునేవాళ్ళ గండం గడపడానికా, ఏ రాగప్రమేయమూ లేని కవిచేత ప్రత్యేకకళగా రూపొందింపబడ్డ పద్యాన్ని రాగపాశంతో బరబరా ఈడవడం? అయితే అడ్డమైన వాళ్ళ లోట్లూ కప్పుకోడానికా, పద్యరాగసమ్మేళనం! నటుడూ పద్యంలోమాత్రమే క్షుద్రరాగం కోరి, నాటకకర్తా పద్యంలోమాత్రమే క్షుద్రరాగం కోరి, ప్రదర్శనశ్రోతా పద్యంలోమాత్రమే క్షుద్రరాగం కోరడమా? ఆ క్షుద్రరాగం గానమా? గానానికి పట్టవలసిన దశ ఇదా? ఛందస్సుకి పట్టిన దుర్దశ అదా? ఏమో ఏమైనాసరే, ఆ రెండింటినీ కలపడంలోనే కొత్త కళ అన్యాడై తోచవలిసిన నటుడే, తను ఏమైనాసరే—సృష్టిచేసి తీరాలని బుకాయించడమా! అల్లా ఎక్కడ ఉంది—అంటే, అనాదినించీ అల్లానే వస్తోంది—అని సమాధానం. అందుచేత, సభ్యులు నాటకకర్తని ఏమీ అనరు, అనలేరుగనక. అతనికి లోట్లూ ఉండచ్చు, వాటినిమించినగుణాలూ ఉండవచ్చు పాపం

టూరు, అల్లాంటివాళ్ళతో వైరం పెట్టుగోలేక. వాళ్ళు నటులమీద విరుచుకుపడిపోతారు. 'ఆ నాటకం బాగుండకపోతే, ఈ నటులు ఎందు కయ్యా అది ఆడడానికి సిద్ధపడడం? అసలు ఒకనాటకగ్రంథం రాగానే, అందులో ఉండగల పద్యాలు వెతిగి తన క్షుద్రరాగప్రజ్ఞతో వాటిని పాడుకుంటూకూచోకుండా, ఆనాటకం మంచినాటకమో కాదో చెప్ప గల నటుడేడండీ అసలూ? తనకి వచ్చిన బంజరురాగాలతో విజృంభ ణంగా పాడుకుంటూ స్వారిచెయ్యడానికి పనికివచ్చే పద్యజంతువులు అందులో కనపడకపోతే, అదేం నాటకమండీ, వెధవ నాటకం? ఎక్కడా పద్యంలేదు నా బొందాలేదు' అనే మోస్తరుగా వాళ్లు వాదించి, 'కవి గొప్పవాడు. నాటకం రాశాడు. పాట రాకుండా అతడు పద్యాలు రాయడానికి వాక్కుంది. పద్యాలు లేకపోతే నాట కమే గాదు. పాట వస్తేగాని రంగంమీదికి రాకూడదు. అన్యుడై ఒప్పవలిసిన నటుడే పాడాలి. పద్యమే పాడాలిగాని, వచనం కూడదు. ఒకవేళ తను గాయకుడైతే, కచేరీచేస్తూ స్వరంవేస్తూ కూచోకూడదు, చచ్చిచెడి రాగంమాత్రం తేల్చి ఊరుకోనూ కూడదు. ఎంత కావాలో అంత, ఉచితమైనంత, (ఎంత? అంటే, మాకు తెలియకపోడానికి వాక్కూ, మరోడు నిర్ణయిస్తే దెబ్బలాడ్డానికి వాక్కూ, మేం వదు లుకోం. ఏ నిర్ధారణ చేసినా మాకు పేచీపెట్టే వీలు పోతుందిగనక!) రసపోషణ చేస్తూ. సహజంగాఉండే నడకచొప్పునకుడా తాళనియమం పాటించకుండా, అద్భుతమైన కళ కల్పించాలి,' అనే అసంభవసమ్మే ళన కోరుతూన్నట్టు నటిస్తారు.

నటుడు తన పాత్రని పద్యభాగంలోమాత్రం రాగిస్తూ ఒప్పిం చడానికి చేసే యత్నంలో రెండుమూడు విశేషాలున్నాయి.

ఖలులయి నాఁడు లక్కయిలుఁ గాల్చి, విషాన్నము పెట్టి, జూదపుం గొలువు ప్రవేశపెట్టి, మముఁ గ్రూరత జీవధనంబులందుఁ జే

దల నొనరించి, చాలకది, ద్రౌపదిఁ గొప్పునుబట్టి యీడ్చి, చీ
రల సభ నొల్చినట్టి ధృతరాష్ట్రజు లేఁ గలుగంగ స్వస్థులే?

అనే పద్యం అభినయించి భీముడై తోచాలని ఒక రాజయ్యా యత్నిస్తున్నాడనుకోండి. ఓంప్రథమంలోనే రాజయ్యా అది క్రోథం అని నిర్ధరించి దానికి సరిపడ తనదగ్గిర సిద్ధంగా ఇదివరకే ఉన్న 'భూపాలో' 'వసంతో' దానికి పట్టించేసి, ఆ కలగాపులగం సభవాళ్ల మీద వడ్డిస్తే అతడికి మన్నన అవసరంలేదు. ఆ పద్యం కోపంతో పాడాలిగావున అను కుని అట్లా చేసినంతమాత్రాన్ని అతడు నటుడు కాడు. ఆ కోపం ఎందుకో అతడి హృదయ శల్యాల్ని పట్టాలి. ఎందుకో తెలియపరుస్తూ అది సభ్యహృదయాలకి పాకాలి. ఎందుకో తెలుపుడయే పద్ధతిలో కాకుండా, అతడు కోప్పడినంతమాత్రాన్ని సభవాళ్లకి కోపంజనించదు. చాలా మంది పద్యరాగులు నాటకరంగంమీద కోపంలో ఉండగా సభ నవ్వులో ఉంటారు. సార్థకనటుడైన వ్యక్తియొక్క కోపానికే సభవాళ్లలో కోపం జనించడం. ఒకపాటి వాడు, పద్యం మొత్తానికి కోపం అని లెక్ఖ వేసు గునేవాడు. కాని నటుడైనవాడు పద్యంమొత్తానికే కాదు, పద్యంలోని ప్రతిపదానికీ సారస్యం ఉందని గ్రహిస్తాడు — 'సావాగ్యారసవృత్తిః' పై పద్యంలో, 'ఖలులు, కాల్చి, విషాన్నము, జూదము, క్రూరత, పేదల, కొప్పునుబట్టి యీడ్చి, చీరల, సభ, నొల్చినట్టి' — అనేవి అన్నీ రసవత్త రములే. "ఇవన్నీ కూర్చినపిదప జనించే రసాన్ని ఏకలాటుగా నేను గ్రహించేసి మీ కిస్తున్నాను, ఇందులో ఏం పదాలుంటే మీకేం?" అనే రాజయ్య భీముడూ కాజాలడు, రాజయ్యా కాజాలడు. ఆ పదాలు రచింపబడ్డమీదట నటుడు జనించాడు. ఆ పదాల్ని మార్చిగాని, విడి చిగాని, తన యితరకల్పన అందు జొనిపిగాని వ్యవహరించేవాడు, తండ్రి అయిన నాటకకర్తకి తను పుట్టకుండానే ద్రోహం తలపెట్టేపుత్రుడు! ఆ పదాలలో ఉండే భీముడి అవస్థ సభవాళ్లకి తెలియాలి. అంతేగాని,

ఆ పాత్ర ధరించిన రాజయ్యకి ఏమేమి తెలివితేటలుఎందులో ఎందులో ఉన్నయో, రాజయ్యకి ఎన్ని రాగాలు వచ్చునో, రాజయ్య ఎంతకవిత్వం చెప్పగలడో, రాజయ్య ఏమిబొమ్మలు చిత్రించగలడో చెక్కగలడో వెల్లడి అవడంకాదు, విషయం. అటువంటి సందర్భంలో రాజయ్య బయల్దేరి-భీమపాత్రగురించి కవి రచించియిచ్చిన పదాలుయావత్తూ సభవాళ్లచేత ఆరగింపు చెయించినమీదట భీమవ్యక్తిత్వంవాళ్ల మనస్సుల్లో గోచరింపచెయ్యదలిచి, వచ్చి పద్యంలోమాత్రం తన రాగ కళ సంపుటీ చెయ్యడం అనేది, తన్ని చూసి సభ్యులు రాజయ్య అను కోవాలనే కుతూహలమే కాని, భీముడనుకోవాలనే తాపత్రయం కాదు. మరొక ప్రజ్ఞావంతుడు భీమపాత్రధరించి తను పద్యం అభినయించే దోసం దులో అదృష్టంచేత తనకున్న శిల్పశక్తీ పాకశక్తి రుచి చూపించడం మొదలెడితే, సభవారికి వసాళం అంటిపోతుంది. కాని, సాధారణ రాగనటుడు 'ఖలులయి' అనేపద్యంవంటిదానికి మామూలు వ్యాపా రమైనట్టు 'భూపాల' వంటిరాగం మొలిపెడతాడు. ఎందుకంటే: 'ఈ పద్యంరసం క్రోధం, భూపాల రసం క్రోధం, అంచేత అవి నా గాత్రంలో కలిశాయి. మీకు రాగం రాదుగావును, ఏదో పేచీ లేవదీస్తున్నారు' అంటాడు. వెంటనే అతణ్ణి మనం ఆపి, అతడి అభిమానకళ 'నటన' గనక, పద్యానికి అర్థమూ భావమూ ఫలానా అని తెల్పాలని అతణ్ణి కోరవచ్చు. తెల్పలేకపోతే అభినయం అభిమానకళ అని అతడు ఏ మొహం పెట్టుగుని చెప్పగలడూ ? తరవాత 'భూపాల' భావం ఏమిటి అని మనం అతణ్ణి అడిగాం అనుకోండి, 'దీని భావమేమి తిరుమలేశ' అన్నట్టు. దానిభావం అతడూ చెప్పలేడు. ఏ మానవుడూ చెప్పలేడు. అయితేమరి భూపాలే అందులో కలపవలిసిన అవసరం ఏమొచ్చిందీ ? అది క్రోధానికి పనికొస్తుందనా ? అది శాంతానికి వాడిన గానరహస్య వేత్తలున్నారే ? చివరికి, ఆ రాగం తనకి పూర్వమే వచ్చిఉన్న రాగా

లలో ఒకటిగనక, ఆ రాగం కలుపుతూ భీమపాత్ర నిలపెడతానంటాడు, అతడు. ఇందులో విశేషం ఏమిటంటే, భీమపాత్ర నిలబెట్టడానికి లోగడే తనకి వచ్చిఉన్న స్వంత మాటవరస వాడడు, కవి రచించినవే భీమ పాత్రకి వేరూ, రామ పాత్రకి వేరూ కొత్త మాటలు వాడతాడు. కాని పద్యం ఉచ్చారణ చేసేటప్పుడు లోగడే తనకి వచ్చిఉన్న క్షుద్ర రాగాలు రంగరించి, భీమపాత్ర, రామపాత్ర, ప్రతీ రాజుపాత్రా అవే రాగాల్తో నిలబెట్టేస్తాడు. పద్యానికి భావమే కాదు, సమర్థుడైన రాజయ్య ప్రతిపదార్థం చెప్పగలడు. తత్తుల్యంగా భూపాల రాగానికి ఏం చెప్పగలడూ? 'భూపాల'కిగాని ఏ రాగానికి గాని అర్థముండదు, అనగా అర్థం మానవులకి తెలియదు. గానంఅవ్యక్తం అది గానానికి ఉండే లోటుకాదు, విశేషం; కళంకం కాదు, మహిమ! అంటే, గానానికి మానవులు కల్పించుకునే అర్థాలతోనూ పెడర్థాల తోనూ నిమిత్తం లేకుండానే హృదయాకర్షణ చెయ్యగల ప్రభావం ఉంది. అల్లాంటి స్థితిలో, 'ఖలులయి' అనే భీమపాత్రపదానికి, ఏ రాగంలో ఏ భీమపాత్రసంగతీ, 'నాడు' అనే ఏ భీమపాత్ర పదానికి, ఏరాగంలో ఏ భీమపాత్ర సంగతీ—అనేవయినాల్లోకి వెడితే ఎవడు తేలగలడూ? రాజయ్యా తేలలేడు. మరోచిక్కు. భీమపాత్రపద్యం మరో రామ పాత్ర కి పనికి రానప్పుడు, భీమ పాత్ర యొక్క రాగసంగతులు రామపాత్రకి ఎట్లాఉపచరిస్తాయీ? పైగా, మనం తీసుకున్న పద్యానికి ఏదో రౌద్రరసం అనవచ్చుగాని, ప్రతీ పద్యానికీ రసనిర్ణయం ఎక్కడ వీలూ? పద్యాల్లో ఉండేది పదాలేగనక, పదాలన్నింటినీ, తొమ్మిది భాగాలు చెయ్యాచ్చా? (అన్నం చతుర్థా విభజ్య—అన్నట్టు!) తొమ్మిదిరకాల పదాలూ సందర్భించే రచన నవ రసభరితమా? ఇక్కడికి పద్యం సంగతి అట్లాఉంచి, భూపాలకేసి చూస్తే, అందులో క్రోధం ఉండాలో, దాని ద్వారా క్రోధం ఇతరుల్లో

జనింపచెయ్యవలసిన నటుడులో ఉండాలో కాని, భూపాల వినేవాళ్లకి క్రోధంలో పాడినా ఆనందమే, విచారంలో పాడినా ఆనందమే, హాస్య యుతంగా పాడినా ఆనందమే. కాబట్టి, పదానికి ఒక సంగతిచొప్పున గానంలోంచి తప్పుకు వచ్చి సంపుటీచెయ్యడం అసాధ్యం. పోనీ, బహు విధప్రజ్ఞావంతుడైన నటుడెవడేనా ఆ నిర్వహణం తను చెయ్యగలుసని. నడుంకట్టినా, అది యితర రంగం కాదు, నాటకరంగం అనే సంగతీన్నీ కవి చిత్తవృత్తికి తను ప్రత్యక్షరూపం దాల్చిన సంగతీన్నీ జ్ఞాపకం ఉంచుగుంటే ఒకసంగతి విశదం అవుతుంది—'ఖలులయి' అనే పద్యాన్ని పఠించి అభినయించినప్పుడు కారణావస్థక్రోధమైతే ఫలితావస్థకూడా క్రోధమే అవుతుంది. కాని, మనం పైన ముచ్చటించుగున్న అసాధ్య రీతిగా దాన్ని అతడు పాడగలిగినా కారణావస్థ క్రోధమైనా ఫలిత రసం ఆనందమిళితమై తీరుతుంది. అనగా, సభ్యుడు, "ఆ, ఇల్లాంటి పాడుపన్లు చేసి మమ్మల్ని అవమానపరిచినవాళ్లు, నేను బతికి ఉండగా ప్రశాంతంగా ఎల్లా ఉండగలరూ?" అన్నట్టు గద చేతులో ఉన్నట్టు కోపం పూనక, చప్పట్లు చరుస్తూ (అదీ గానం మహిమ!) "ఓహో, ఆహా" అంటూంటారు. భీముడు వేషంకట్టిన రాజయ్యకి బిరుదు తక్షణమే కటాక్షిస్తూ కూచుంటారు. అట్లాగే, హరిశ్చంద్రుడు, నలుడు, రత్నాంగి, మల్లమ్మ గాగలవాళ్లు పద్యాల్లో రాగాలెడుతూంటే సభ వాళ్లు బలేబలే అంటూ చప్పట్లు కొడుతూ, చీమేనా కుట్టనట్టు కులాసాగా సావకాశంగా ఉండడమేకాదు, 'ఈ వేషాలు కట్టిన వాళ్లు మా ఉద్దేశంలో ఎంత ప్రవీణులండీ, ఎంత ఆనందంగా రాగాల్తో ఏడిచారండీ' అని సూచించడానికి అరుపులు ఈలలు మొదలైనవి ప్రకటించి, అదంతా — అధికారం తమది గనక — మళ్లీ తిరగతోడి జరిపించాలని కుడా గోలచేస్తారు. ఇందులో సభ్యుల తప్పు ఏమీ లేదు. శృతితో గానం ప్రారంభం అవుతుంది. గానానికి శ్లాఘ తక్షణమే ఉంటుంది,

ఉంటే! ఉండాలికూడానూ. ఎందుకంటే, ఆ గానరూపం మళ్లీ దొరకదు గనక, గానం కాలనిగళబద్ధంగనక. ఒకడు ఒకపాటలో ఒకచోట వేసిన సంగతులు పసందుగా మనకి తోచిన సంగతి మర్నాడు అతడితో మళ్ళా చెప్పడానికి వీలుండదు. అందుకని, రాజయ్య రంగంమీదికి ఏ ఉద్దేశంతో ఎక్కరానీండి, అతడు గాత్రంవిప్పేసరికి అది సభవారికిరుచిస్తే తక్షణం మెచ్చేస్తారు, నచ్చకపోతే కూసేసి మోసేస్తారు. కొందరు కుశాగ్రబుద్ధులు అన్నారు: సభవారు మెచ్చుగునేది రాజయ్య సంగీతం కాదు భీముడి గానమే అన్నారు. అనగా, వాళ్ల నమ్మకం, భీముడికి—అట్లాగే రాజులైన హరిశ్చంద్రుడూ నలుడూ మొదలైనవాళ్లకి—ఓ కాసిని రాగాలు ఎందుకు వచ్చిఉండకూడదూ? — అని. వచ్చి ఉండచ్చు. కాని ఎదటభీముడు లేడు. లేనిభీముడి ప్రజ్ఞలు చాలా ఉండవచ్చును. భీమగానంఅని మనంవినలేదుగాని, భీమపాకంఅని వింటూంటాం. రాజయ్య మన కాసంగతి రుచి చూపిస్తే, పద్యఅర్థభావ అభినయాలకి భంగం రానీకుండా! అందుచేత, భీముడికి రాగాలు వచ్చిఉండవచ్చుననడం, 'ఆలులేదు చూలులేదు, కొడుకుపేరు సోమలింగం' అనడమే.

క్షుద్రరాగం తొడగడం మూలాన్ని చచ్చుపద్యాలు రచ్చకెక్కడమేకాక, పద్యమణులు అక్రమంగా వీధిని పడుతున్నాయి. నటుడు ప్రపంచంలోని మానవుల్లో ఒక్కొక్కరిని లేకపోతే ఒక్కొక్కమాదిరిని అనుకరిస్తే, ఒక్కొక్క నటుణ్ణి వేలకొలది మానవులు అనుకరిస్తారు. పెద్దల మాటలు పిన్నల పాటలు! ఒక నటుడు ఒక పద్యం ఏ భైరవి మీదో పాడేశాడనుకోండి, అర్థం చెడకుండా! అది వినే బాలురూ పామరులూ, దాన్ని అనుకరించే యత్నంలో, సమగ్రంగా దాని అర్థభావాలు గ్రహించుకోవలిసిన నిర్బంధం లేకపోవడంవల్ల, పదాల్ని చెడగొట్టి, అర్థంతో నిమిత్తంలేని గానఫణితిమాత్రం ఫోటోలాగ దింపగలరు. ఏమి అంటే, అర్థయుతమైన పద్యమూ అర్థాతీతమైన రాగమూ

జోడింపబడేటప్పుడు పద్యావగాహానకి బుర్రప్రయోగం అవసరం, రాగ గ్రహణానికి బుర్ర అనవసరం—హృదయుంచాలు. క్షుద్రరాగానికే ఆనందపడి మెచ్చుకుంటూ, ఆ దెబ్బతోనే పద్యంయొక్క అర్థభావసారస్యాలు తెలుసుకోకుండానే తెలుసుకున్నవాళ్లలాగ నటించే శ్రోతలు ఎక్కువైపోయారు. ఇదంతా ఎప్పుడూ? పఠిత, తను ముందు అర్థంచేసుకుని, ఆ అర్థం శ్రోతలకి కుడా అవగాహన కావాలని తంటాలుపడుతూ శ్రావ్యరాగం తెచ్చి, ఉచితంగా పద్యానికి జోడించినప్పుడే! అతడే, అర్థం తెలుసుగోకుండా (అట్లాంటివీలు ఉంది గనక) దంచేసి, చొక్కా పాట చెరిగేశాడా, ఎంత ప్రమాదం? 'వాళ్లకి తెలుస్తుందా, ఏమనుస్తుందా? ఎట్లా చదివితేం?' అని పఠిత వాదించడం నేరం, అనౌచిత్యం. సభ్యుల్లో పామరులు ఉండవచ్చు, అనక్షరాస్యులు ఉండవచ్చు. అటువంటివాళ్లకి కూడా నాటకప్రదర్శనానికి వెళ్లగల హక్కు ఉంది. వాళ్ల మూర్ఖత్వాన్ని నిరసించడం మరీ మూర్ఖత్వం. అటువంటి వాళ్లని కుడా ఆకర్షించి వాళ్లకికుడా బోధ చేసేటట్టు ఉంటేనే అభినయం ఒక కళ, లేనినాడు, నటన విద్య ఎందుకూ? యథార్థ బోధకుడా జరిగిన పక్షానికి, ఇప్పుడు తెలియని వేడుకగా ఉండే ముచ్చట అప్పుడు తెలిసే వేడుకగా మారుతుంది. 'నాటకప్రదర్శనం అంటే బోధ పడేవేడుకే గావునర్రోయ్' అని ప్రజలు ఇంతవరకు గ్రహించుగోడానికే అవకాశం కలగలేదుగాని, కలిగి ఉంటే వాళ్లు ఇల్లా ఊరుకుంటారా? సంగతి గ్రహించవలిసిన అవసరం ఉన్నప్పుడు, మాటలతో మెలివేసుగుని ఉండే ఇతర నాదం—శ్రావ్యనాదం అయినాసరే—చాలా ప్రతిబంధకం అని పామరులూ ఒప్పుగుంటారు.

పద్యానికి రాగం జోడించడంలో అనర్థకాలు ఇంకా ఉన్నాయి. పద్యాల్లో గుణాలలాగే దోషాలుండ గలవు. ఎంత 'స్వరార్ణవం' చదివి వచ్చిన సంగీత నటుడైనా, రాగసంధానంలో గుణాలలాగే దోషాలుండ

గలవు. అనగా పూర్వదోషాలు మటుమాయం కావు సరిగదా, నటుడి రాగదోషాలు వాటిని చేరతాయి. వీటికి అభినయదోషాలు కలుస్తాయి. అందువల్ల పద్యారాగాభినయం అనే ముప్పేట కళ ప్రదర్శించే సంగీత నటుడికి, ముమ్మరమైన గుణశ్లాఘకంటె ముమ్మాటికీ దోషనిరసన దక్కి తీరుతుంది.—అతను చేసే అభినయం పద్యం మూలంగా కొంత వరకు అర్థవంతమూ రాగంమూలంగా కొంతవరకు అర్థశూన్యమూ అయి ఉండడంవల్ల! అదికాక, నాటకరంగ రాగకల్లోలం ఎన్నో అల్లర్లకి కారణం. రాజువేషం సంగీతనటుడు, తన రాగప్రజ్ఞ చాలాతడవలు ప్రకటించుగోవచ్చు,—అతడి పాత్రకి చాలా పద్యాలు రచింపబడి ఉండడం వల్ల. అందువల్లే, కొన్నింటి ప్రకటన పాడుగా ఉన్నా, మరికొన్నింటి కేనా 'వన్సుమోర్' కొట్టించుగోవచ్చు, మొత్తంమీద గండం గడు పుగోవచ్చు. కడమ వేషాలకి ఎప్పుడో వస్తుంది పద్యం—తోకచుక్క లాగ ! అది కాస్తా శృతిలో ఉండకపోతుంది. బ్యాడ్ మింటన్ ఆటలో, 'సెంటరు' లాగ రాజుంటే, 'ఫ్రంటు'ల లాగ తక్కిన వాళ్లుంటారు. వాళ్లకి ఎప్పుడో గాని 'పోయింటు' రాదు, అ ఒకటీ చెడిపోవచ్చు. అంతా అతణ్ణి తిడతారు. 'సెంటరు' వాడు చాలా యత్నాలల్లో పీగిపోయినా, కొన్నింటిలో మెప్పు లాగవచ్చు గనక వాడి సంగతి తోసుగుపోతుంది. తక్కిన వాళ్లు ఒకవేళ్ల శృతిలో ఉన్నా వాళ్లని ఆట్టే ప్రజ్ఞ చూపనియ్యరు. వాణ్ణి వీలైనంత త్వరగా అయిందనిపించి లేవదీసేస్తారు—ఉపనయనంలో వటువుని అన్నందగ్గిర్నించి అర్థకుసిగా లేవదీసినట్టు. ఈ సంగతి ఇట్లా ఉండగా, కొందరు రాజువేషగాళ్లు, తమరు రంగంమీద ఉంటూన్న సమయంలో, తమ సమక్షంలో, సందు దొరక పుచ్చుగుని తమరి కంటె అధికగానం చేసి మెప్పు లాగేస్తా రేమోకదా అది తమకి నామర్దా కదా అనే భయం చొప్పున, పక్క వేషాలకి కవి రాసిన పద్యాలు తీసెయిస్తారు—కోరలు తీయించేసి

నట్టు! మ రేమీ లేదు, తమరు అభినయించే రాజు పాత్రకి ఏకచ్ఛత్రాధిపత్యం ఉండిఉన్నా మానినా, పాత్రధారులైన తమరికి రంగ రాగ చక్రవర్తిత్వం సంక్రమింప చేసుకోడానికి! ఆ రకం వేషధారులు వేషధారులే కాని నటులుకారు, నాటకద్రోహులు. సమత్వానికి స్థలంగాని నాటకరంగం అనేది ఈర్ష్యలకి కాదు. పాత్రలన్నీ నాటకకర్తకి ఇష్టమే. పాత్రలు నాటక కర్తయొక్క మానసిక సంతతి. తనకే ఇష్టంలేని పాత్రల్ని కర్త సృజించడు. పద్యబాహుళ్యాన్ని బట్టి పాత్రాధిక్యం నిర్ణయించుకోడం మూర్ఖత్వం. అటువంటి నిరూపణం చేసుగోడంవల్లే, కొందరు సంగీత నటులు తమకి పద్యవిస్తారం లేని పాత్ర సందర్భించినపుడు ఏదో వంక కల్పించుగుని ప్రదర్శనంవేళకి రాకుండా పోవడం! వాళ్లని సంగీత రంగంలో ఏమనచ్చో గాని, నాటకరంగంలో నటులని మాత్రం అనకూడదు. ఇవన్నీ పద్యమధ్యరంగంలోని క్షుద్రరాగం యొక్క ఫలితాలే. వీటి నన్నింటినీ మించి ఒంట్రెత్తుతనం నాటకరాగాల మూలాన్ని పుడుతుంది. పక్కవాడి వేషం ఎల్లానో అల్లా ఛీ ఛీ అనబడితే చాలు, తన వేషం బాగున్నట్టే అని ఒక్కొక్కడి తృప్తి. ఇక నాటకప్రదర్శన సభ్యుల్ని రాగశ్రోతలనే అనాలికాని, ప్రేక్షకుల ననే కూడదు. వాళ్ల నిరసన మెప్పుగా వెంటనే మారగలదు. ఒక సావిత్రి నాటక ప్రదర్శనంలో సావిత్రిపాట తమరికి నచ్చకపోవడంవల్ల సావిత్రి పాత్రధారిని ఏడిపించి దరువులెయ్యడం అరంభించారు, సభ్యులు. మరి కాస్సేపట్లో యముడు వచ్చాడు. వాళ్లకి అతడి రాగం మరీ అధ్వాన్నంగా ఉండడంవల్ల, సావిత్రి రాగానికి శ్లోఘా యముడి రాగానికి మోతా ఆ సభ్యులే వెంటనే కటాక్షించారు. మొత్తంమీద నాటక ప్రదర్శనం ఏడిసినట్టుందని ఆ సభ్యులే అంటూండడం. విమర్శకులు కుడా, ప్రదర్శనం అయితే బాగుండలేదు కాని, ఆ సత్యవంతుడు మహాశ్రుగా పాడేశాడు—అంటూ ఆ పాత్రధారి గౌరవం మాత్రం రక్షించిపెడతారు.

పద్యంనించి రాగం తొలిగిపోయిన నాడు, ఇప్పటిలాగ సత్యవంతుడు స్వంతరక్తి కట్టించుకోలేడు, తన కంఠంలో వచ్చే పాత్రధారులంతా యథారీతిగా అభినయిస్తే తప్ప. అప్పుడు, ఎవళ్లపని వాళ్లు చెయ్యాలి కాబోలు, లేకపోతే ప్రదర్శన ప్రపంచం నడవదు గావును అనే గ్రహింపు కలుగుతుంది. ఆ రాత్రి మొత్తానికి తన వేషం ఒక్కటే మెప్పు పొందే లాగ, కొందరు రాజువేషగాళ్లు తక్కినవాళ్ల శృతి వగైరాలల్లో మార్పులు లోపాయికారీగా చెయించి వాళ్ల యత్నాలు ధ్వంసం చెయించడం ఎరుగుదుం. కాలక్రమాన్ని ప్రస్తుత సంగీతనటుడి ఆయుర్దాయమంతా హార్మోనియంలో ఇమిడిపోయింది. అతడు రెండు ప్రాణాలు హార్మోనియంమీదా, మరో రెండు తబలామీదా పెట్టగా, ఒంటి ప్రాణంతో రంగంమీద నుంచుంటాడు. అతడికి హార్మోనియమే మార్గదర్శి. అతడు శృతిలోగాని ఏడవడు, శృతిలోగాని నవ్వడు; కోప్పడడు, శపథం చెయ్యడు, శరణివ్వడు, చావడు— గొప్పపని ఏదీ చెయ్యడు. పాపం, అతడి తప్పేమిటి? సభవాళ్ల ఉద్దేశంలో చెయ్యకూడదుట. వాళ్ల తప్పుమాత్రం ఏమిటీ? అట్లాంటి అభిరుచి, వాళ్లకి సంగీతనటుల మూలాన్నే సంక్రమించిందిట, అది వాళ్లు మరిగారట! శృతి బనాయిస్తే తప్ప రసమూ ఉప్పొంగదుట, హుషారూ లేకెత్తదుట! కవి అదృశ్యుడై ఉండడమూ, పద్యంయొక్క అర్థభావాలు ప్రదర్శకులకీ శ్రోతలకీ కుడా అక్కర్లేక పోవడమూ సంభవించినప్పుడు ఇతరులు నోరు విప్పడం నోరు చేసుకోవడం అవుతుంది. హోటళ్లలో శుచిలాగే! వడ్డించే వాళ్లకి శుచి ఉండదుగనక, తమరు శుచి పాటించడం లేదని తినేవాళ్లు! తినేవాళ్లకి శుచి ఉండదు గనక, తమరు శుచి పాటించడం లేదని వడ్డించే వాళ్లు! యజమాని ఎల్లాగూ అదృష్టవంతుడు గనక అదృశ్యుడై ఉంటాడు. రెండు పక్షాలంటూ ఉండీ, రెండింటిలోనూ విడివిడిగా

కొంత కొంత మెతగా అంటూ ఉంటే తప్ప ప్రపంచంలో చాలా పేచీలు సాగనే సాగవు. ఒంటి చేతి చప్పట్టుండదు.

ఒక కవి రచించిన పద్యాన్ని లిఖితరూపంలో మనం మొదటి సారి చూడడం తటస్థించగానే, అదేమిటో తెలుసుగోడానికి మనం పాటు ప్రారంభించంగదా! పద్యరూపంలో మనకి కవిత్వం దొరుకుతుం దని పుట్టెడాసతో ఉంటాం. ఒక్కొక్కప్పుడు మన ఆశ నిరాశ అయి పోయి అందులో చెత్తాచెదారమూ ఉండవచ్చు. అటువంటి ఘటాన్ని మనం 'కవిత్వం' అని పిలవడానికి తటపటాయించాలి. మరి పద్యంలో కవిత్వం ఉందో లేదో తెలుసుగోవడం ఎట్లా? మన తాలూకు కూను రాగమూ అందుకు తోడ్పడేది? రచయితయొక్క పద్యపేటికలో కవితా ధనం ఏముందో అని తెరవడానికి మన తీవ్ర రాగమూ తాళంచెవి? పద్యంయొక్క అర్థం, భావం, భావన, సహజత్వం, నాదం, నడక, అలం కారం, ధ్వని, ఔచిత్యం, సంప్రదాయం, రీతి, శయ్య — ఇల్లాగ్గా ఎన్నో గుణాల్లో ఏ కొన్నో అందులో ఉండడంనించికదా మనం దానివల్ల ఆకర్షింపబడడం? అటువంటి లక్షణాలు ఏమాత్రమూ గమనించక, క—చ—సీ—మ, లాంటి గుర్తులవల్ల ఆ రూపం గద్య కాదని మాత్రం తెలుసుగుని, వెంటనే తమ స్టాకులో ఉన్న బంజరురాగనికి కళ్లెంవదిలి విహరిస్తూ, ఆ దెబ్బతో అది తమరుసంపూర్ణంగా ఆస్వాదించేసినట్టు మురుస్తూ, ఆ కవిత్వం గురించిన యోగ్యతాపత్రంకుడా వెంటనే యివ్వ గల తెలుగువాళ్ల విచక్షణ మెచ్చుతగ్గదిలా కనిపించదు. అయినా సరే చాలామంది మరొకరి సీసపద్యంవంటి దానికేసి చూస్తూండడం, తమరు యథాశక్తి మూలుగుకుంటూ ఉండడం, ఎకటి పద్యాన్ని మెచ్చుగోడం —తమకి చాలా రుచించే తమరి గానంయొక్క సంపర్కం దానికి తగల డం వల్ల, వెంటనే దానికి యోగంపట్టి సీసం బంగారంలాగ మారుతుంది గావును! ఆ మోస్తరుగా కాకుండా, సక్రమపద్ధతినే ఒక నటుడు

పద్యాన్ని అవగాహన చేసుగున్నాడనుకుందాం! అల్లాగే చేసి[illegible], తను పద్యాసారస్యం గ్రహించిన రీతి యేమిటి, నాటక శ్రోతల నిమిత్తం తను అవలంబించే రీతి యేమిటి? ఒక పద్యం తన హృదయంలో ప్రవేశించడానికి ఒక రీతిన్నీ ఆ పద్యమే తక్కిన హృదయాల్లో ప్రవేశించడానికి మరో రీతీనా? కవి పద్యంలోని పదాలవల్ల మాత్రమే తనలో జనించే చతుర్విధాభినయమే సార్థకం అని నటుడికి గ్రహింపులేదా? అదే కదా తన కళ. అది ఇంకా రంజుగా ఉంటుందని ఎవరో అన్నారని మరో కళలో తను చొరబడి రాగం తెచ్చి కంఠానికి ఉరిపోసుగుని తన కళకీ శూన్యంపెట్టుగుని, అస్వాదపడంవల్ల సమగ్రతకీ వీల్లేక గానానికీ తలవంపు తీసుగురావడం ఎందుకొచ్చింది? అనవసరం మాటఅట్లా ఉండగా, ప్రతికూలంగా పరిణమించే తన రాగకళ సందర్భం లేనప్పుడు బలిమిని జొనిపి ప్రకటించుగోడం తన కేంలాభం? కొందరు నటులు 'సభవారు అల్లా కోరతారు' అంటారు. లోకువఇస్తే సభవారు ఏమైనా కోరతారు. నాటకసభవారిలో అస్పృహులూ అజ్ఞానులూ అధిక సంఖ్యాకులు. తనకళ ఏముటో గుర్తెరగకుండా వ్యవహరించినంత కాలం, సభవారు నటుణ్ణి ముక్కుకి తాడోసి ఈడుస్తారు, తమ ఆధిక్యం స్థాపించుగుంటారు, తమ సామ్యానికి కిట్టుబాటుకోసం జంతుధర్మాలన్నీ చేసేస్తారు. పద్యతత్త్వం తెలుసుగుని పద్యపఠనం చేసి, అభినయించడం బదులు, ఏ శృతో పెట్టుగుని తుమ్రరాగం తీసినవాళ్లు 'నటనం' ప్రత్యేక కళ కానూకాదు, దానికి మన్ననా ఉండదు—సరికదా, నటుడిమీద సవారీ చెయ్యాని ప్రేక్షక మహాశయుడుండడు, అందుచేత గావున నాటకప్రదర్శనానికి వెళ్లేది అని అతని సంకల్పం!

లలితకళలు బ్రహ్మవిద్యలు. గానం ఉత్తమోత్తమం. గానం చాలా అభివృద్ధి చెందించుగున్న వాడికే దాని తత్త్వమూ ఉద్దేశమూ బోధపడతాయి. అల్లా బోధపడినవాళ్లే అని జనం ఎంచేవాళ్ళుకుడా

కొందరు గానాన్ని అపవిత్రపరచడం ఎరుగుదుం. అందుకనే భక్తిలేని గానం వ్యర్థం అనడం. అటువంటప్పుడు, క్షుద్ర రాగాలు! క్షుద్ర రాగాలుమాత్రమే వినరగలిగి, అదివరకే గుణశీలాలు పోగొట్టుకున్నా మంచిగాత్రంమూలంగా నటవృత్తిలో పడి నటప్రతిష్ఠ కుంగదీసిన వాళ్ళని చాలామందిని ఎరుగుదుం. ఎవడిదగ్గరేనా అల్పకళ ఉండడం అమాయికసంఘానికి అపాయకరం. అల్పరాగమాత్రుడైన సంగీత నటుడి రాగసంపత్తి మూర్ఖజనామోదం ఆర్జించడానికిన్నీ శృంగార వ్యాపారాలు సాధించడానికిన్నీ ఉపచరిస్తుందనేమాట మిగిలిపోయింది. 'కొంచెం మ్యూజిక్ వినుదాం' అనే గిరీశాలు ఉండగలరు. ఎలాగో పద్యాలు అల్లడంనేర్చుగుని ప్రేమజాబులు రాసి తద్వారా తమరి ఆకర్షణ ఇనుమడిస్తుందని నమ్మేవాళ్ళుండగలరు. ప్రకృతిదృశ్యాల ఛాయాపటాలు తియ్యడంబదులు, ఆ విషయంలో క్షుద్రప్రజ్ఞకలవాడు శరీర భాగాలు వేర్వేరు వ్యక్తులవి తీసి అతికించి పని సాధించడం ఎరుగుదుం. కాబట్టి జనం సంగీతనటుడిలో కోరి మెప్పులు కురిపించే అల్పరాగకళ తమరికే హానికరం. అది సంగీతనటుడికి ఎంతవ్యర్థమో అతడు రంగం నించి నిష్క్రమించగానే తెలుస్తుంది. అప్పుడు మరొక ప్రజ్ఞవల్లగాని అతడు జీవించలేడు. మరొకప్రజ్ఞే లేకపోతే, అప్పుడు బతికీ చచ్చే ఉంటాడు, మరణించగానే, బతిగాడురా పాపం! — అంటారు.

పద్యం పాడుతూ సంగీతనటుడిచ్చే రాగానికీ, గాయకుడు చేసే గానానికీ భేదం ఉంది. పద్యంలో ఒకవిధమైన నడక ఉంటుంది. కాని సాధారణ పద్యరాగుడు నడక పాటించడు. అనేసిన ముక్కలు మరోసారీ ఇంకోసారీ దొరకపుచ్చుగుని ఆవృత్తాల్లో విజృంభించడానికీ అతనికి హక్కులేదు, వీలులేదు, పైగా స్థాయి లేదు. అందువల్ల పద్యం రాగించేటప్పుడు తెలియడంతోపాటు కొంచెం కొంచెం తెలియకపోవడంకూడా ఉంటుంది. రసంమాట అల్లాఉంచగా! కాని, గాయకుడి గా

నంలో కొంచెం కాదు, చాలా తెలియకపోవడం కనిపిస్తుంది. అర్థంకానిది మిక్కిలిగా కనిపించి ఆకర్షించేటప్పుడు, అందులో ఏదో మహత్తు ఉంది మనకి తెలియదు—అని మనకి అనిపిస్తుంది. సంగీతనటుడి విషయంలో 'ఏమిటీ ఆ అర్థంలేని గిరికీలూ!' అనిపిస్తుంది. చాలామందిని చంపిన వాడు వీరుడుకాగా ఒక్కణ్ణి మాత్రమే చంపినవాడు హంతకుడైనట్టు. గాయకుడి నాదంలో అర్థం లేకపోవడాన్ని మనం క్షమించేస్తాం. అతడి నాదంలో అర్థం మనం వెతకనే వెతకం, అందుకోసం అతడిదగ్గిరికి వెళ్ళనే వెళ్ళం. ఈ సంగతి విస్మరించి కొందరు తమాషాగా మాట్లాడుతూంటారు— 'ఇంగ్లీషులో గానం ఉందీ అసలూ? ఆ కూతలే వాళ్ళ గానం? నాకు అదేమీ బోధపడదండీ, మన 'కళ్యాణీ' మన 'లతాంగీ' బోధపడ్డట్టూ! అని. కాని, కళ్యాణీ లతాంగీమాత్రం బోధపడతాయా? ఎవరి కళ్యాణీ లతాంగీకూడా ఎవరికీ బోధపడని దినుసే. ఆన వాలుపట్టడం అనేది బోధపడడం కానేరదు. అయినాసరే 'హాహా హాహై' అంటూ లేచిపోతూ ఏమిటూ హింసిస్తానిగానం? దీర్ఘాల్తో సాగదీస్తూ ఒకరకంగా పడిపోతూ వణుకుతూ అస్తమించే గానం, ఏమిటూ ఇంగ్లీషుగానం? ఏం బాగుంటుందీ?' అనే అభిప్రాయాలు వినబడుతూంటాయి. కాని, ఎవరి గానం వారిది. హైందవుల గానం కేవలం కసరత్తని ఆంగ్లేయుల అభిప్రాయం (Ancient India–Vol. IIBose) గానభాష స్వరాలు. స్వరాన్ని భాషాంతరీకరణం చెయ్యడం అసాధ్య కృత్యం. పద్యం పదాలలో ఉంటుందిగనక, కొంతవరకు కాకపోతే కొంతవరకేనా భాషాంతరీకరణం చెయ్యవచ్చు. అందుకనే ఇంగ్లీషు రానివాళ్ళు: 'ఇంగ్లీషువాళ్ళకి కవిత్వం ఉందండీ?' అనిగాని, "ఇంగ్లీషు కవిత్వం నాకు బోధపడదండీ!" అనిగాని అనరు. ఏమంటే, 'మీ కాభాష రాదేమోనండి' అని ఎవరేనా అనగల్రు — అని. అట్లాగే, ఇంగ్లీషుగానంయొక్క స్వరభాష నేర్చి అప్పుడు గమనించాలి.

ఆ గానం ఎట్లా ఉంటుందో! అటువంటి అర్థంతో జోక్యం లేకపోవడం అనే విషయం మనం గాయకుడిదగ్గిర గణించంగాని, కూను రాగాలు తీసేవాడిదగ్గిరా, కొంత బోధించడానికి వచ్చినవాడి దగ్గిరా, కొంత వృత్తాంతం చెప్పడానికి వచ్చినవాడిదగ్గిరా, తన వ్యక్తిత్వం మాటుపరుచుగుని అన్యవ్యక్తిలాఒప్పడానికి రంగం ఎక్కినవాడిదగ్గిరా ఎంతమాత్రమూ క్షమించం. అందుచేతనే, పాఠాలు చెప్పడానికి వచ్చినపంతులు రాగధోరణిని మొదలెడితే 'అయ్యా! మమ్మల్ని చంపక చెప్పేదేమిటో చెప్పు, మహాప్రభో' అనవలిసుంటుంది. అల్లాగే, ఉపన్యాసకుడు వచ్చి రాగాలెడుతూ నుంచుంటే, 'సంగతేమిటి, బాబూ, మమ్మల్ని తినేస్తున్నావు' అనవలిసివస్తుంది. సంగీతనటుణ్ణికూడా, 'మమ్మల్ని కోపంలో పడండంటున్నావు, ఎందుకో చెప్పవయ్యా, దీర్ఘాలు తీస్తూ కూచోక' అనిగాని, 'విచారం తాడిప్రమాణంలో వస్తూన్నట్టున్నావు. పాదానికి ఓ రాగం చొప్పున పిరాయిస్తున్నావు, చూడండి నా తడాఖా అనక, ఏమి కొంప మునిగిందో చెప్పి మరీ అఘోరించవయ్యా' అనవలిసి ఉంటుంది.

వ్రాతప్రచారం లేనప్పుడూ అచ్చుయంత్రాలు రానప్పుడూ నటుడు చెప్పే పదాల్లో ఏవి పూర్వరచితాలో ఏవి తత్క్షణకల్పితాలో చెప్పడం సాధ్యంకాకపోయి ఉండవచ్చు. కాని, అచ్చు సామాన్యవ్యాపారమైన ఈ రోజుల్లో, ఆ విభజన చెయ్యవచ్చు. కాని, ప్రదర్శనానికి పూర్వమే ఎవరైనా ఆ నాటకగ్రంథం చదివి ఉండాలి. నాటికకర్త ఆ గ్రంథంలో అందిచ్చినది నటులు ఎట్లా ప్రదర్శిస్తారో, కల్పించిన అవస్థలు ఆంతర్యంలోకి పట్టించుగుని ఎల్లా ప్రకటిస్తారో గమనించాలనే కుతూహలంతోగదా నాటకప్రదర్శనానికి వెళ్ళడం. నాటకకర్త పదాలలో చెప్పలేని వ్యాపారం ప్రదర్శన మిత్తం రచనే చెయ్యడు. మట్లూ, టప్పాలూ, టుమ్రీలూ అతడు పాత్రధారుల్ని ఉద్దేశించి రచించాలి

గాని, పాత్రల్ని మనస్సులో పెట్టుకుని కాదు. గానకర్తృత్వం పాడేవాడిదేగనక, పాటలు రచించిన నాటకకర్త నాటకకర్తృత్వంలో కొంత భాగం మరొకరికి ఇచ్చినవాడవుతాడు. గద్యనాటకకర్త గద్యంలోనే రచిస్తాడు. పద్యనాటకకర్త సమగ్రంగా పద్యరూపంలోగాని, గద్యమిశ్రితంగాగాని రచనచేస్తాడు. కవనగానరహస్యవేది కీర్తనరచన చేస్తాడు, కాని హావభావాలతో సందర్భాలు జరిగిపోతూ సంగతులు చెప్పబడుతూండే నాటకరంగంమీద అన్యపాత్ర రూపించే వాళ్లకోసం రచించడు. అట్టివాడు ఏదికీర్తనలైనా రాస్తాడు. లేదా ఏదైనా పౌరాణికగాధ భక్తి పరంగా ప్రజకి వినిపించడానికి, గానబాధ్యత యావత్తూ ఒకడిమీదే ఉంచి గేయాలుకుడాగల పదరచన చేస్తాడు. అదే 'హరికథ'. కాబట్టి, నాటకంలో సాధారణంగా గద్యపద్యాలు ఉంటాయి. ఆ రచనని ఎంత అనుసరిస్తే అంత గొప్పనటుడు కావలసినమాట. అయితేం, అట్లా జరుగుతూండదు, అందుకు విలోమంగా విలువ కడుతూంటారు, సంగీతనాటక ప్రదర్శనశ్రోతలు.

పద్యాలు పాడడం వల్ల పద్యంలో ఉండగల శబ్దాలంకారాల మీద ద్వేషం జనించింది. రాగసౌఖ్యం విక్రవీగి నిరంకుశమై పద్యపదాల నాదసౌఖ్యాన్ని కిందుచెయ్యడంకాదు. శూన్యపరిచింది. పద్యం పాడేటప్పుడు పదాల అర్థాలు ఎల్లా గమనించరో, అట్లాగే ఒక శబ్దంలోని వర్ణసాహచర్యంవల్ల కలిగే నాదంగాని ఒక పాదంలోని పదసాంగత్యంవల్ల పుట్టగల నాదంగాని సభ్యులు వినిపించుగోరు. వినిపించుగోకుండా తయారయారు సభ్యులు – అహ, తయారు చేశారు సభ్యుల్ని. ఆంధ్రకవులలో నాదసౌఖ్యం ఎరిగిన కవులెవరో, అది వాళ్లేరీతిగా కల్పించారో గమనించే యత్నం ఆంధ్రులు చెయ్యరు. ఎవరేనా ఒక పద్యంలో కొన్ని రాగాల పేర్లు వచ్చేటట్టు రచిస్తే, వారికి నాదరహస్యం తెలిసి నట్టే? రాగాలు తెలియడం అంటే రాగాలపేర్లు తెలియడమా?

'చక్కని రాజమార్గము' కృతిలో ముక్కలూ ఖరహరప్రియ రాగం పేరూ నేర్చినవాడు ఇతరులదగ్గిర పాడడానికి అర్హుడే? ఇది కాక, నాదసౌఖ్యం కల్పించి రచించవలిసిన సందర్భాలూ, తరుణాలూ, అవసరాలూ సమ నింపులేని కవులు హాస్యాస్పదు లవుతారు. అటువంటివారి 'పద్యం' పాడడమే జరిగిందా పకపకా నవ్వొస్తుంది— 'నరులార తరులార గిరులార సురలార...' మోస్తరుది. అప్పుడు రసిక సభ్యులు కవి తన పాడిత్యం చూపించి తమర్ని డబాయించడానికి ఆ ముక్కలు దొర్లిం చాడని అభిప్రాయపడి 'కొయ్, కొయ్' అని కేక లేస్తూంటారు. నాటకమే అదీ?

పద్యానికి రాగం జోడించవలిసిన ఆచారం ధర్మమూ అని సంగీత నటుడి జ్ఞాపకశక్తి యావత్తూ రాగంమీదే ఆధారపడుతోంది. తన నాటకపుస్తకంలో తన పాత్రకి ఉన్న పద్యంపక్క, 'తోడి,' 'భైరవి,' 'ధన్యాసి' మొదలైనవి రాసుకోవడం నటుడి అలవాటు. 'తోడి' అను పేరెట్టిన పద్యాన్ని అతడు తోడిమీదే కంఠపాఠం చేస్తాడు. మరో రాగంమీద ఆ పద్యం అతడికి జ్ఞాపకమే రాకపోవచ్చు, ఒకవేళ జ్ఞాపకంవచ్చి ప్రారంభించి మధ్య ఎక్కడేనా మరిచిపోతే, వాడు గొంతికలో తోడి గొణుక్కుంటేనే కాని తరవాతముక్క స్మరణలో పడదు. ఇందులో ఉండే విశేషం ఏమిటంటే: 'తోడి' రాగం అసలు ఎవరికేనా రావాలిగాని, వచ్చింతరవాత అది మరిచిపోవడం మరి ఉండదు. బోధపడడానికి పదార్థం ఏమీ లేకపోబట్టి, మరిచిపోడానికీ ఏమీ ఉండదు. కాబట్టి ఒకొక్క సందర్భంలో సంగీతనటుడు తను పద్యాన్ని ఉద్ధరించడానికి తెచ్చిన 'తోడి' రాగంతో తయారుగా ఉంటాడేగాని, ఏ పద్యాన్ని గురించి 'తోడి' తెచ్చాడో ఆ పద్యంలోని ముక్కలు మరిచిపోతూంటాడు. అందువల్ల అతడికి అక్కడి ముక్కలు

అందియ్యాలి. అటువంటి అందింపులు ఒక్కరవ్వ మరీ ఎక్కువగా పుచ్చుకునే వాళ్లుంటారు—'నేను 'టీ' లో పంచదార ఒక్కరవ్వ ఎక్కువే వేసుగుంటాను' అన్నట్టు! ఒక రకం నటులు ముక్కల అందింపుగుడా 'తోడి'లోనే యిస్తేతప్ప అందుకోనేలేరు—ఇంగ్లీషు భాషతో చెబితే గాని తెలుగు గ్రహింపుకాదు, అన్నట్టు! అందుకని ఒక అందింపుగాడు తెరవక్క పుస్తకం పట్టుగుని హామేషా నుంచుని, నటుడితో, 'నువ్విక్కడ ఏడవాలి, ఇక్కడ కోప్పడాలి ఇక్కడ భయపడాలి' అనే మోస్తరుగా ఇచ్చే సంజ్ఞల్ని అనుసరించి, ఆ పన్లు చెయ్యడాని కల్లామూలం రాగాలు తీసేవాడు నటుడా ? కాని, ఎటువంటి అఖండధారణ గలవాడికైనా మరిచిపోవడం అనేది ఉండవచ్చు. ప్రమాదం మానవత్వంలోనే ఉంది. అయినా ఒకమాట చెప్పవచ్చు. అర్థభావాల మీద అధారపడే ధారణ రాగసంబంధ ధారణ పట్టిపోయినంత తరుచుగా పట్టిపోదు. అందుచేతనే కాబోలు, పాపం, కొందరు సంగీతనటులు పాతికేళ్లపాటు ఒక రాజు వేషం వేసిన వాళ్లయినా, మళ్లీ ఆ రాజు వేషంలోనే నేడు రంగం ఎక్కినా, వాళ్లకి యథాప్రకారం అందింపు (ప్రాంప్టింగ్) ఉండితీరాలి. అందుచేతనే కాబోలు, అర్థం చూడవలిసిన అవసరం చొప్పున మనం ఇతరభాషల్లో కంఠపాఠం చేస్తూండే పద్యాలు అంతత్వరగా మరుపు రావు. క్రియముక్క, మరిచిపోవడం గురించి నిర్ధారణలు చెయ్యడం శక్యం కానిపని అయినా, ఇంతమాత్రం అనవచ్చు. రాగంతో జోక్యం లేకుండా పద్యాన్ని కంఠపాఠం చెయ్యడం నటుడికి తప్పనిసరి అయినప్పుడు, అతడికి పద్యం ఇప్పటికంటె దృఢతరంగా జ్ఞాపకం ఉండడమే కాక, తను రంగంమీద పద్యం ఉన్నప్పుడు ఏమిచెయ్యాలో (తలా చేతులూ తిప్పడంమాని) కూడా ఇప్పటికంటె ఎక్కువగా తెలుస్తుంది. కవిహృదయం గ్రహించుగునే వరకూ పద్యం చదువుకున్న నటుడికి పద మధ్యంలో అందింపు కావలసి రావడానికి కారణం కనిపించదు.

పైగా, గానం చేసేటప్పుడు ' తోం, తరన, తదరినన, రీ' మొదలైన ముక్కలు అంటూండడమూ, పెదిమి విరవడమూ, ముఖం వికారంగా పెట్టడమూ, కళ్లు మూసుకోడమూ, తల రుబ్బడమూ, శరీరం ఊపడమూ, కుడిచేత్తో సున్నాలు చుట్టడమూ, ఎడంచేత్తో ఎడంచెవి మూసుకోడమూ, భుజాలు ఎగరవెయ్యడమూ మొదలైన చేష్టలు పుడుతూంటాయి. ఇవన్నీగాని వీటిలో కొన్నిగాని చెయ్యాలని గాయకుడి ఉద్దేశం కాదు. అతడికి అవగాహన లేకుండానే గానం అతడిచేత అల్లాంటివి చెయిస్తుంది. ఆకారం లేనిదానికి—గాలికి క్షణికాకారం క్షణక్షణమూ ఇచ్చే గాయకుడి విషయంలో అటువంటివి మనం గణించనే గణించం. అదీకాక, మనం గానం కళ్లతో వినం, పాముల్లాగ ! చెవలతో వింటాం ! కాబట్టి, అతడి గానం మనల్ని ఆకర్షించేటప్పుడు, మనకి ఏ చేష్టలూ కనపడవ్. కాని కొంత కొంత మంది గానం కళ్లతో వినేటట్టు తోస్తుంది. అట్లా విని వచ్చి, ' ఏమిటండీ పెద్ద పాటగాడన్నారూ ? ఒకటే తిప్పడం ఒళ్లు గానుగలాగ ! మూతి మట్టుకు ! ఎంత అసహ్యంగా పెట్టాడనుకున్నారు !' అంటారు. అనగా, వాళ్లు గానాన్ని చూడడానికి యత్నించారుగాని, వినడానికి కాదు. నాట్యోచ్చారణ చేసేటప్పుడు ఏదో ఒక విధమైన చేష్ట ఉండకమానదు, గానానికి అర్థం మనకెట్లా గోచరించదో అట్లాగే గానంవల్ల పుట్టే చేష్టలకీ గోచరించదు. అల్లాంటి చేష్టలు అర్థప్రాధాన్యంలేని పాటకచేరీలలో గమనిస్తూంటాం. అసలు అప్పుడు మనం గానరసంలో లీనమై ఉంటాం గనక, అవి మనకి తట్టనే తట్టవు. కాని నాటకం దృశ్యకావ్యంగదా ! రూపాలూ చేష్టలూ చూడాలి అని కూడానూ మనం నాటకప్రదర్శనానికి వెళ్లడం. కాబట్టి, చేష్టాప్రాధాన్యంగల నాటకరంగంమీద సహజగమనంతో పఠింపతగ్గ పద్యాన్ని ఏ అల్పరాగంతో ఊడవదల్చినా, అనర్థక చేష్టలు కొన్నైనా జనించక మానవు. పద్యంవల్ల సార్థక చేష్టలూ రాగం

వల్ల అనర్థక చేష్టలూ బయల్దేరగా వాటి మిశ్రణాన్ని 'అభినయకళ' అని వాదించే రసజ్ఞులు ఉంటారా?

మరిన్నీ, ఒకే సంగీతనాటకసమాజంలో క్రీరుగా పాడేవాళ్లు అనగా, వీలైనంత గబగబా గాత్రం తిప్పి గిరికీలు కొడుతూ గుక్కపట్టి రాగాలు పెట్టగలవాళ్లు) అట్టేమంది ఉండరు. ఇద్దరో ముగ్గురో ఉండవచ్చు. ఉన్నా వాళ్లల్లో ఒకడుమాత్రమే ఒక ప్రదర్శనంలో దర్శనం ఇస్తాడు. ఏమంటే, రాగపాటలో తనతో సమానస్థాయిలో ఉండే మరొకడు రాజై రంగంఎక్కితే, ఆ రాజుగాడి కున్నన్ని పద్యాలులేని పాత్ర తను ధరించి తన రాగాలాపప్రజ్ఞ కాస్త ప్రకటించుకోడానికేనా వీల్లేని బోనులో చిక్కడి 'వన్సుమోర్'కి దూరమైపోవలసిన దుస్థితిలో పడడానికి ఆ ఒకడు ఎల్లా అంగీకరిస్తాడూ? అది వాడికి ఎంత శిరచ్ఛేదం? అతను ఎక్కడ ఏంవేషాలేనా వేస్తాడుగాని రంగం మీద చిల్లరివేషాలు వెయ్యడు—'రాగం ఝుమాయించి అయిదుశ్రుతి మీద విసిరేవాడికి చిల్లరివేషాలు వెయ్యడంకర్మం ఏమిటి?' అని అతడి అభిప్రాయం. రాగాలుతియ్యలేని ఘటానికి రాజువేషం యియ్యడం ఎంతఘోరమో రాగాలు తియ్యగలవాడికి రాజుకాని వేషం యియ్యడం కూడా అంతఘోరమే అనేటట్టు వచ్చింది. అందుకనే జనం ఒక్కొక్కణ్ణిగురించి, 'చాలా బాగా పాడతాడ్రా, ఉత్తమంత్రివేషం ఇచ్చారేమిటి?' అని దుఃఖిస్తూండేవారు. అక్కణ్ణించి, చాలా పద్యాలుగల పాత్రవేషం తనకి నచ్చిన రాగాలు పాడగలవాడుకట్టినప్పుడే ఎవడైనా సభ్యుడు ప్రదర్శనానికి వెళ్ళడమూ, లేకపోతే మానుతూండడమూ జరిగింది. దాన్తో సమాజంలోని ముచ్చటాయిముగ్గురు రాగపాటకులకీ పైకి హెచ్చరికలూ నవ్వులూ దొర్లినా లోపలమాత్రం అసూయలూ తెగుళ్ళూ పుడుతూండేవి. అసలు ఒక ప్రత్యేకవ్యక్తియొక్కగానం తనకి నచ్చుతుందిగదా అని ఎవడేనా సభ్యుడు నాటకప్రదర్శనానికి

వెళ్ళడం పొరపాటు. ఏమంటే: గానం అవ్యక్తంగనక, నచ్చి ఒకణ్ణి ఆకర్షిస్తే వాడికి బ్రహ్మానందం కలిగిస్తుంది. నచ్చదా, ఛీ అనిపించి లేచిపోబుద్ధి వేస్తుంది. అనగా, గానంలో మధ్యేమధ్యే పానీయాలు లేవు. ఒక్కడి గానం నిమిత్తమే ప్రదర్శనానికి వెళ్ళే సభ్యుడు, తప్పని సరిగా కొన్ని యితరకంఠాలు వినవలిసిఉంటుంది. గానానికి ఒంట్రెత్తు గుణం ఉండడంవల్ల, ఆ సభ్యుడికి ఏ యితరకంఠమూ అప్పట్లో నచ్చదు. అనగా, అతడికి ఇతరులపాట కేకలో బొబ్బలో అన్నట్టు తోస్తుంది– తన అభ్యర్థిగానంతో పోల్చి చూస్తే! అటువంటి సమయాల్లో ఆ సభ్యుడు అల్లరీ కూతలూ మొదలెట్టి తను జీవించిఉన్నట్టు దాఖలా చూపించేస్తాడు. చేతిసొమ్ము పెట్టుగుని నిద్దరమానుకుని ప్రదర్శనానికి వచ్చిన ఆ మహాశయుడు ఏమి చెయ్యడానికి తగడు గనక! తనకి నచ్చని ఇతరగానాలు జరిగేటప్పుడు, 'చాల్చాలు, నడు, బళాబళీ, అవునవును, అబ్బా, ఒన్, అల్లానా, దిగుదిగు' అని అరుపులూ, చెవులు గింగురెత్తే ఈలలూ ఈలదరువులూ, రకరకాల జంతుధ్వనులూ, చప్పట్లూ, తాళాలూ ప్రారంభిస్తాడు. ఆయన హృదయంలో ఉన్నది ఆయన ప్రకటిస్తున్నాడుగనక ఆయనవల్ల దోషం ఏమీ లేదు. అయినా కొందరు గొప్పవాళ్ళు ఇల్లా అల్లరి చేసేవాళ్ళని గదమాయించాలని వ్యర్థంగా ప్రయత్నిస్తారు – గానశ్లాఘ ఎల్లానో గాన నిరసనకుడా అల్లాగే తక్షణజనకం అని మరిచిపోయి! కాని, సాధారణంగా ఒక్కొక్క సమాజంలో చాలా రాగాల పాటగాడు ఒకడే. ఎన్ని ప్రదర్శనాల్లో రాజువేషం వేసినా అతడే. మరోడు రాజువేషం తయారై వస్తే జనానికి నచ్చద్దూ? వాడికి ఆ కంఠం ఉండద్దూ? కంఠం తయారుచెయ్యడం ఎల్లా? అందుకని అతడే హరిశ్చంద్రుడూ, నలుడూ, రాముడూ, సత్యవంతుడూ, అర్జునుడూ అన్నీ వెయ్యవలిసి రావడంలో, ఇతర చిక్కులుండేవి. వరసని అతడు పై పాత్రలు

ధరించే సమయాల్లో పదాలు వేరువేరువే సేరుస్తాకు గాని, వేసుకునే వేషం అదే, పాడే రాగాలు అవే. కాని, సంగీతనాటకప్రదర్శన సభ్యులకి పదాలమీద ఖాతరీయే లేదు. తక్కిన తెరలూ, వేషాలూ, రాగాలూ, ఎప్పటివే, వాటిలో మార్పు ఏమీ లేదు. అందుకని, తమ కళ్ళముందు జరిగేది హరిశ్చంద్రో, చిత్రనళీయమో, మరోటో జనం మరిచిపోతూ అరుస్తూండడం జరిగేది. కొందరికి అన్ని నాటకాలూ ఒకటే. పాతిగేళ్ళపాటు సంగీతనాటకాలు చూసిన ఒకాయన చిత్రనళీయం జరుగుతూంటే 'ఛెస్, తగలేస్తున్నాడ్రా హరిశ్చంద్రుడు' అనేవాడు. — ఆ వ్యక్తే, ఆ చమ్కీకోటే వేసుగుని, ఆ తెర ఎదటే, ఆ రాగమే లేవెట్టి పాడేస్తూండడంవల్ల! దీన్నిబట్టి, సంగీతనాటక ప్రదర్శనాల్లో పాత్రధారులు తమరే కనిపిస్తూ తమరినిబట్టి పాత్రల్ని మారుస్తున్నారుగాని, కవి పాత్రకి కేటాయించిన పదాలవల్ల తమరు మారిపోయి కనపడాలని యత్నించడం లేదన్నమాట.

ఇంకో విషయం. పాటకచేరీలలోనూ హరికథల్లోనూ, ఆ పాటకుడి యొక్కగాని హరిదాసుయొక్కగాని గాత్రం తూగడాన్నిబట్టి ఫలానా శృతి అని వేసుకోడంజరుగుతుంది. ఆ శృతి ప్రారంభంలగాయతు అంతంవరకూ ఎడతెరిపిలేకుండా మోగుతూనే ఉంటుంది. కొన్ని పాటకచేరీలలో ఉత్తరాదిగానం చెయ్యవలిసొచ్చినప్పుడు (రక్తి కోసంట) ఉన్నశృతి ఆపకుండానే మధ్యమం తగిలిస్తారు. కాని సంగీతనాటకప్రదర్శనాల్లో ధోరణే వేరు. వాటిల్లో అపశకునమూ ఎదురుదెబ్బలాగ వచనం వస్తూంటుంది. ఆ కారణంచేతట, శృతి మానేస్తూంటా! 'శృతి' పూర్వంమాట, ఇటీవల 'శృతులు'. పాడేవాళ్ళనిబట్టి శృతులు మారుతూండాలి. శృతులు మారే దోసందులో అపశృతిలో పద్యం అందుకోడం సంభవించవచ్చు, అందులోనే పద్యం యావత్తూ సాగవచ్చు. అయితేం హార్మోనియం పుట్టింది, అది జోరుగా వాయించే

వాళ్లు జనించారు. మొదటి తంబురా ఆలాపించి, చిన్న హార్మోనియం, తరవాత పెద్ద హార్మోనియం మెల్లిమెల్లిగా ఆలాపిస్తూ జరిగి పక్కనించి పాకి రంగంమీదికి వచ్చి, కొంతకాలానికి నువ్వా నేనా అన్నట్టు రంగానికి ముఖాముఖిగా డీకొట్టడం ఎరుగున్న వ్యాపారమే. కాని, ఇటీవల అపశృతి తొలిగించేశారు. ఎల్లాగంటే శృతే తొలగించేశారు. శృతే లేనప్పుడు అపశృతి ఎల్లా బయల్దేరుతుందని వాళ్ల ధైర్యం. కాని శృతికి అనుగుణంగా ఉండవలసింది. గాత్రంగనక, గాత్రాలు అన్నీ శృతిలో ఉండే బాపతువి కావుగనక, వాళ్లు అపశృతి వారించ లేకపోయారు. కాని, అటువంటి అవాంతరం సంభవించినప్పుడు హార్మోనియం వాయించేవాళ్లల్లో గడసర్లు, తమకిగల చేతివేళ్లు పదింటితోనూ అందినన్ని మెట్లు ఏకకాలమందే నొక్కేసి, బ్రహ్మాండమైన ఆ అపశృతి గాత్రరాగసంగతులు భీషణనినాదప్రవాహతరంగాలలో కొట్టుకుపోయేటట్టు చేస్తారు. అనగా, ప్రదర్శనమంటే: సంగీతనటుడి రాగం, అభినయం కాక, హార్మోనిస్టు ఎంత చాతుర్యంతో రంగంమీదికి వచ్చేరాగాన్ని అనుసరిస్తూ వ్యవహరించగలడో గమనించి ఆనందించవలిసిన బాధ్యతకూడా సభవారు తమ మీద పెట్టుగున్నారు. ఒకే శృతి మోగుతూంటే అది సభ్యుల హృదయాన్ని పట్టుగుని, గాయకుడి గానం వాళ్లకి తన్మయత్వం తీసుకురావచ్చు. కాబట్టే, గాయకులు తమరప్పుడప్పుడు పాడడం మానినా శృతి మాననియ్యడు. చాలామంది హరిదాసులు వచనం అనేటప్పుడు కూడా శృతి మాననియ్యరు. శృతి మానడం పాటకి మృతి. అవిచ్ఛిన్న స్వరసంపుటి గానం అవుతుందిగాని, మధ్య ఖాళీలుగల నాదఖండాలు గానానికి విరుగుడు. ఒకప్పుడు, నటుడు పాడవలసిన పద్యాన్ని మొదట హార్మోనిస్టు తనయంత్రంమీద అభినయించి అందించగా, అప్పుడు నటుడు పద్యం అందుకోడం జరుగుతూంటుంది. నటుడికి హార్మోనిస్టు నాటకకర్తని మించిన దైవం. ఒకప్పుడు, హార్మో

సిస్టు రాకపోవడంచేత ప్రదర్శనం మానుకున్నారు. అన్ని శ్రుతులమీద అన్ని గాత్రాలవాళ్లు ఒకే రాత్రి నాటకరంగమీదినించి వడ్డించిన రాగ సంగీతపు ధప్పళం ఆరగించడమూ, కవి రచించిన నాటకంయొక్క పర మార్థం సభ్యమహాశయులు ఆనందించడమంటే? నాదలోకంలో ప్రవే శించడానికి శ్రుతి రాజమార్గం. గాయకుడు తన శ్రుతిని పురస్కరించు గుని, తన ఆత్మకి పరిచితమైన నాదమండలంలో విహరించడం సాగించి, శ్రోతల్నికుడా విహరింపచెయ్యడానికి వస్తాడు. అతడు ఆయా నాద సీమలలో ఉండే చిత్రవిచిత్రాలు శ్రోతలకి వాయువేగంతో చూపిస్తూ, వాళ్లని మళ్లీ జాగర్తగా రాజమార్గంలో పడేస్తూంటాడు. అటువంటి మార్గం ఒకటి పెట్టుగోకపోతే అతనితో బయల్దేరేవాళ్లకి అగమ్యగోచ రంగా ఉండి వాళ్లు బెదిరిపోతారు. కాబట్టే, శ్రుతియొక్క ప్రాముఖ్యం గమనించి పాటకి పది నిమిషాలు పూర్వం శ్రుతి చూసుగుంటూనే కూర్చుండే గాయకుల్ని ఎరుగుదుం. శ్రుతి అంతఉత్కృష్టం అన్నమాట. సంగీత నటుడి పద్యసంగీంతంలో శ్రుతీలయామాత్రం ఉండవు—అనిపించు గోవడమూ, నటుడి కళ? రంగాన్ని ఏమో ఉద్ధరిస్తుందని పద్యంలో ప్రవేశం ఇయ్యబడ్డ రాగం ఇల్లాగా నటుడికి మాటదక్కించడం? నటుడు తన పనేమిటో తెలుసుగోలేక, తెలుసుకోగలిగినా చెయ్యక, తనది కాని వ్యాపారంలో ఇల్లా నోరుచేసుగోవడం ఏమి బావుకోవాలనో!

ఇంకో ప్రమాదం. నాటకరంగం అనేది తత్కాల సంఘాన్నో లేక వివిధ మానవస్వభావాల్నో ప్రతిబింబిస్తూ ఉండాలి. అట్లా కాకుండా పద్యసంగీతనిర్బంధంవల్ల బయటి గానలోకంలో సంభ విస్తూండే మార్పుల్ని గంటలప్రకారం సూచించే గడియారంలాగ తయారైంది నాటకరంగం. గానలోకంలో గలిగే మార్పులుకుడా విప్లవాలే — ధనప్రాణనష్టం లేకపోతేం గనక! ఉద్రేకంవల్ల మాత్రమే పుట్టిన విప్లవాలు చేటు తెస్తాయి. యోచనతో కూడినవి మేలు

చేకూరుస్తాయి. విప్లవాలు ప్రకృతిసిద్ధాలు. అవసరంచొప్పున సహేతుక విప్లవాలు సంభవించవచ్చు. కాని సంగీతనాటకరంగంమీద మనకి 'ఉద్రేకం' దొరుకుతుందిగాని, 'యోచన' ఇంతవరకు ముఖ్యం-వెలవనే లేదు, విప్లవాలు విజృంభించ టానికి 'ఉద్రేకం' మాత్రమే గల రంగాలు మరీ ఉచితక్షేత్రాలు. అక్కడి విప్లవాలకి ప్రదర్శనసభ్యులే కర్తలు. ఏమంటే, వాళ్ల అభీష్టం తమాషాపరకం. వాళ్ళ ఉద్దేశం, సంగీతనటుడు తెగ పాటపాడి తిష్ఠవేసి పాటకచేరీ చేస్తూకూచునే బాపతు కాకూడదు. అంతమాత్రాన్ని మళ్లీ ఆనకట్టుపూర్వపు పాట, పాతకత్తుపాట, దేశవాళీ పాట, భాగోతాల్లో పాట,పురాణధోరణి పాట, మొదలైనవి దొర్లించకూడదు. పద్యంలో మాత్రమే, కాస్త రాగం, చక్కటిది, రసానికి భంగంరానీకుండా అంటే మాకు సమృద్ధి,-అని. అందువల్ల, కొత్తదేదేనా దొరుకుతుందేమో, కొత్త వింతగనక - రంగంమీదంచి వినరవచ్చని సంగీతనటులు అన్వేషంలో ఉంటారు. అక్కణ్ణించి, ఎవరైనా అరవాయన వచ్చి చేసిన ఆలాపనలూ ఎవడైనా గవాయి వచ్చి వేసిన సంగతులూ తంటాలుపడి పట్టుగుని, ఆ అనుకరణం సభవాళ్ళకి కానుకగా సంగీతనటుడు పద్యగానంలో ఇస్తే వాళ్ళు ఇంత మొహాలు చేసుగోడం జరుగుతుంది. ఆదిలో కంద గీత సీసాల్ని దరువులుగా పాడేవాళ్ళు. కాలక్రమాన్ని ఆ తాళం గతించింది. ఇప్పుడు గీతాలు దరువువెయ్యరు - కాని హాస్యవ్యాపారంలో కంద గీతాల ఆఖరిపాదాలు దరువేసి కవ్విస్తూంటారు, 'సంసారముల బాసి సంపదలను రోసి...' అనే పద్యం మొదట 'మట్టుగా' పాడబడేది, తరవాత విశేషసంగతులులేకుండా సంసారిపక్షంగా 'హిందూస్తానీతోడ' మీద పాడబడేది, ఇప్పు డానాటకం ఆడరుగాని, ఆడితే 'సింధుభైరవి' మీద పాడతారు, అక్కడక్కడ 'హా' కారం రానిచ్చి. 'హా' కారం లేందే 'హిం'దూస్తానీ వచ్చునని అవతలవాళ్ళు అనుకోరుట! కాని, వెనకటి

గానాన్నే చెయ్యగలిగి, లోకంలోని గానపరివ ర్తనబట్టి మారక, అభినయం మాత్రమే చెయ్యగలిగిన నటులుకూడా రంగంమీద మెప్పు పొందరు. 'ఆ దిక్కుమాలి పాతరకంపాటతో రంగం ఎవరెక్కమన్నా రయ్యా వీణ్ణి!' అంటూ గానజ్ఞానులయినట్టు కొందరు సెలవిస్తారు. ఏమైతేం, వెనక తను ఆ పాటతోటే మెప్పుపొంది ఉండడంవల్ల, సంగీతనటుడు తన తప్పు తెలియక బాధపడతాడు. అటువంటి సంగీత నటుడు ఆ రంగంనించి నిష్క్రమించడమే కర్తవ్యం. అతడి గానకళం గతించడంవల్ల అతడు అభినయానికి పనికిరాడు. మళ్ళీ, అతని గానా నికీ అర్థం తెలియదు, కొత్తగానానికీ తెలియదు. కాని, పాతఫక్కీ రాగం వినగానే నవ్వొచ్చేస్తుంది. మరికొన్ని వేళ్ళకి ప్రస్తుతగానాన్ని విని రాబోయేవాళ్లు తీసిపారేస్తారు. ఏళ్ళెందుకు? నిన్న పాడింది ఈ వేళ పాడుతూంటే, "పాడిందే పాడుతున్నా" డని వస్తుందిగదా! సంగీత నాటకరంగంమీద, పద్యాలూ అట్లాగే ఉండగా, వాటి అర్థభావ స్వారస్యాలూ అట్లానే ఉండగా, వాటివల్ల జనింపగల అభినయం అట్లానే ఉండగా, మార్పు ఎందులో వస్తుందో గమనించండి. అభి నయంలో మార్పువచ్చి అభివృద్ధి చెందాలి గాని, అలంకరణకోసం తెచ్చాం అన్న రాగంమూలాన్ని రంగాభివృద్ధి నశించనా! పద్యగానా నికి మితి లేదు. ఒక విధమైన హద్దు అనగా తాళం ఉన్నప్పుడే దరీ అంచూ ఉండదు, ఆవృతాలకే మితి లేకపోవడంవల్ల. మితిలేని పద్య రాగానికి మార్పుకూడా ఉండాలంటారు ప్రదర్శనసభ్యులు. వాళ్ళనేమిటి అనేది! అసాధ్యకృతికి అడ్డంపడ్డ సంగీతనటుణ్ణి అనాలిగాని.

---

# 11. పూర్వ సంప్రదాయాలు

వేదం శ్రుతి—అనగా, వినబడినది. శతాబ్దాలపాటు, అది అనగా వినగా నిల్చిన దినుసు. దాని ఉచ్చారణ గురించిన జాగర్త పడవలసిన అవసరం ఆదిలోనే కలిగింది. పద చ్యుతి కాదు, వర్ణ చ్యుతికూడా ఎక్కడా రాకుండా అర్థస్ఫురణకి చాలా దోహదం చేసే ఉచ్చారణ చేసి చూసుకుని, వేదపదాల ప్రతి వర్ణానికీ ఒక స్వరం నిర్ణయించేశారు. అటువంటి మేకుబందీ చెయ్యడంవల్ల వేదంలోని ప్రతి వర్ణమూ ' అక్షరం ' అయింది. ఋగ్వేదం పఠిస్తారు. అందుకు నాలుగు స్వరాలు వాడతారు—గానం శాస్త్రంలోని ప,ని,స,రి అనే స్వరాలు. గానశాస్త్రంలో నాలుగు స్వరాల సంపుటి ఉండగలదుగాని, అయిదు స్వరాలకి తగ్గితే ' రాగం ' అనేది జనించదు. గానశాస్త్రంలో సంపూర్ణ, షాడవ, ఔడవ రాగాల రకాలు మాత్రమే గుర్తింపబడ్డాయి. సామవేదం పాడతారు. అందులో ఇప్పటి గానశాస్త్ర స్వరాలన్నీ ఉంటాయి. కాని, వర్ణాల సందున వచ్చే మూలుగులన్నీ స్థిరపడి ఉండడంచేత, ఒకేసారి పదిమంది కలిసి సామం చెప్పినా, ఆ మూలుగుల స్వరాలన్నీ ఐక్యమై వినిపిస్తాయి—అనగా అర్థంతో నిమిత్తంలేని కేవల నాదాన్ని కూడా స్వరపరిచేశారన్నమాట. ఇంకా నొక్కి పలకవలసిన వర్ణాల సందుసపడి నలిగిపోగల వర్ణాల గురించి, అంత్యాన్ని వచ్చే వర్ణాల గురించి—ఇల్లాగ్గా ఎన్నెన్నో గురించి కాపుదలలు పెట్టి ఉండడంవల్లనే, ఎన్నిశతాబ్దాలపాటు ఎన్ని నోళ్లపడి వచ్చినా, వేదనాదం చెక్కుచెదరకుండా, ఈషన్మాత్రమైనా రూపవికారం చెందకుండా ప్రయాణం చేసి, తరవాత తరవాత లిపిలో వెలిసింది.

వేదోచ్చారణని బట్టి అనుమానిస్తే, ప్రతి అక్షరానికీ స్వరం స్థాపించాలి, అక్షరాలమధ్య ఒకవేళ మూలిగితే అందుకు కూడా స్వరం నిర్ణయించి అంతా ఒకమాదిరిగానే ఆ సందర్భాలలో మూలగాలి.

2

అయ్యో, భరతశాస్త్రం ఉంది, అంటూంటారు. ఉంది. అది నాట్యవేదం అన్నారు, భరతుణ్ణి ముని అన్నారు. సమస్తమూ అందులో ఉంది, వేదవిరుద్ధం అయింది అందులో ఉండకుండదా! అన్ని అధ్యాయాలూ కాకపోతేపోనీ: వాచికాభినయంలో ఛందోవిధానం (14 వ అధ్యా.) వాగభినయంలో కాకుస్వరవిధానం (17 వ అధ్యా.) జాతిలక్షణః (28 వ అధ్యా.) ధ్రువ, (32 వ అధ్యా.)—గమనించి, తాలవిధానః (31) కూడా పరిశీలిస్తే, శ్లోకంలోని ప్రతి అక్షరంగురించీ శ్లోకచరణపదాల మాత్రల లెఖ్ఖగురించీ ఎట్లా జాగ్రత్తపడుతూ శ్లోకాన్ని పఠించాలో బోధపడుతుంది. 17 వ అధ్యాయారంభంలో,

ఏవంతు సంస్కృతం పాఠ్యం మయాప్రోక్తః సమాసతః
ప్రాకృతస్యతు పాఠ్యస్య సంప్రవక్ష్యామి లక్షణమ్।
ఏతదేవ విపర్యస్తం సంస్కారగుణవర్జితమ్
విజ్ఞేయం ప్రాకృతం పాఠ్యం నానావస్థాన్తరాత్మకమ్।

అంటాడు భరతుడు. అంటే శ్లోకాన్ని పఠించడం ఉండేది. ఎట్లా, 14 వ అధ్యాయంలో:

మాత్రాగణ విభాగస్తు లఘుగుర్వక్షరాన్వితాః,
సర్వేషాం ఛందసామేవ లఘ్వక్షరవినిశ్చితమ్
జానీత సర్వవృత్తానాం సంఖ్యాం సంక్షేపతస్తథా।
ఏవం నిన్యస్త వృత్తానాం నష్టోద్దిష్టం విభాగతః
గురులఘ్వక్షరాణీహ సర్వం ఛందః సుదర్శయేత్.

అదికాక, గానం చెయ్యవలసిఉంటే, దాని రకమూ దాని స్థలమూ నిర్ణయించి ఉంటుంది. ఏమైనా, మాత్రలెఖ్ఖ జాగ్రత్తపడి ఛందస్సు పాటించాలనే అంటాడు.

## 3

సంస్కృతంలో నాటకం, రెండవశతాబ్దికి చెందిన అశ్వఘోషుడు నాటినించీ ఉంది. తరవాత భాస, కాళిదాస, భవభూతి, విశాఖదత్త, భట్టనారాయణ, రాజశేఖరాదులు నాటకాన్ని పోషించారు. వాటిల్లో అనుష్టుప్‌శ్లోకాలుగాక, ఇతరమైన పద్యరూపాలు చాలా విరివిగా వాడుతోచ్చారు. ప్రదర్శనాల్లో శ్లోకాలు పఠించేవారని తెలుస్తుంది— పాడవలసినచోట ఫలానా మాదిరిగా అని శాసించి ఉండడంవల్ల. ‘సంస్కృతనాటకమ్’ అనే గ్రంథంలో ‘బెర్రిడేల్ కీత్’ అనే విద్వాంసుడు ఇట్లా అంటున్నాడు:

‘The Sanskrit drama does not consist, as the theory suggests, of song and prose as its vital elements. The vast majority of stanzas, which are one of its chief features, were recited, not sung, and as it was doubtless from the epic that the practice of recitation was in the main derived......without epic recitation there would and could have been no drama at all.’ (p. 27).

మళ్ళీ మరోకచోట:

‘In the stanzas themselves, it is clear, we must distinguish between those which were simply recited; recitation must clearly have been the normal form of use, and as sung we have normally at any rate some of the stanzas in Mahārāshtri which are placed in the mouths of women. Sauraseni stanzas, on the other hand, we may assume to have been recited, but the distinction has practically vanished from the texts preserved.’

## 4

19 వ శతాబ్ది ఉత్తరార్ధంలో, విజయనగరంలో, ఆనందగజపతి మహారాజుగారి ప్రదర్శనశాలలో, శ్లోకాలు పఠించి తరవాత పాడేవారనీ, కీర్తనగా శ్లోకాన్ని వినిపించేవారనీ చెబుతారు. 'ఏషా మనో మే ప్రసభం శరీరాత్' ఎట్లా కీర్తనగా పాడేవారో, అప్పటి శ్రోత వినిపించగా, నేను విన్నాను.

## 5

సంస్కృత గ్రంథాలలోని శ్లోకాల రకాలకి, ఉచ్చారణవిషయంలో, ప్రత్యేక ఫణుతులు ఏర్పడ్డాయి. ఏ ఫణితీ రాగం కాదు, శ్లోకం అంతంకాగానే ఫణితీ అంతం అవుతుంది.

అనుష్టుప్ — నన్న నన్నా ననన్నా నా ననానా ననానా ననానా

వంశస్థ — ననాన నన్నన్న ననాన నన్ననా

మందాక్రాంత — నన్నా నానా ననన ననా నన్న నానా ననన్నా

ఉపజాతి — { నన్నా ననా నన్నన నన్న నన్నా
ననాన నానాన ననాన నాన }

శిఖరిణి — ననానానానానా ననన ననా నాన ననా

శార్దూలవిక్రీడితమ్ — నానానాన ననాన నాన ననా నానాన నన్నా ననా

రథోద్ధత — నానా ననన నానా నా ననా

స్రగ్ధర — నానానానాన నానా, ననన నననా, నాన నానాన నానా

ద్రుతవిలంబిత — ననన నానన ననాన ననాన నానా

వసంతతిలక — ననాన నానన ననాన ననాన నానా

## 6

సంగీతసాహిత్యాల సంబంధంగురించి ఒక శ్లోకం మిక్కిలి తీరుచుగా వినిపిస్తూఉంటుంది.

సంగీత మపి సాహిత్యమ్ సరస్వత్యా స్తనద్వయమ్
ఏక మాపాతమధురమ్ అన్య దాలోచనామృతమ్.

రాగాన్ని సంగీతంలోనూ, పద్యాన్ని సాహిత్యంకిందా జను కట్టుగుంటే, సంగీతం (చెవిమీద) పడగానే తియ్యగా ఉంటుందనీ సాహిత్యం యోచనతోకూడిన మరొక దినుసనీ ఈ శ్లోకం వాటిని కేటాయించి చెబుతోంది.

## 7

పై శ్లోకాన్నే మనస్సులో పెట్టగుని, వసుచరిత్రకారుడు చెప్పిన పద్యం:

సకలామోదక తాళవృత్తగతులన్ సంగీతసాహిత్య నామక
విద్యాయుగళంబు పల్కుఁజెలికిన్ బాలిండ్లజోడై సిరుల్
ప్రకటింపన్ నఖరేఖలందు నలఘుప్రస్తారముల్ సేయు సర్వ
కళాకాంతుఁడు ప్రోచుఁ దిర్మల మహారాయతిమావల్లభున్

ఇందులో ప్రస్తుతాంశం ఉపమేయాలే.
సంగీతపరంగా—సకలామోదక తాళ గతి
సాహిత్యపరంగా—స-కలామోదక వృత్తగతి.
మళ్లీ సంగీతపరంగా—తాళగతిలో గురులఘుప్రస్తారాలు
మళ్ళీ సాహిత్యపరంగా—వృత్తగతిలో గురులఘుప్రస్తారాలు.

## 8

అట్లాగే సరసభూపాలీయకర్త సాహిత్యసంగీత రసాల్ని పోలుస్తూ, చెప్పిన పద్యం:

ఒకటి యక్షర విలాసోల్లాసమున మించ, నొకటి తాళప్రౌఢి నుల్లసిల్ల
నొక్కటి నారికేళోన్నతి దాల్ప, నొక్కటి గోస్తనీగుచ్ఛకలనఁ దనర
నొకటి సువృత్తభావోన్మేష మొందఁ, నొక్కటి వల్లకీ తుంబికలనఁ జెలఁగ
నొకటి భారవిశ్లేషయుక్తిఁ బెంపొంద నొక్కటి గిరిశమతానుకారి గాఁగ

నసమ సాహిత్య సంగీత రసము లనెడు
గుబ్బపాలిండ్లు దాల్చు పల్కులవెలంది
సరసగుణహారు నోబయ నరసధీరు
నవ్యకృతినాయకునిఁగా నొనర్చుఁ గాత"

ఒకే [illegible]స్తరుగా కనిపించే సాహిత్య సంగీతాలయొక్క రసాలలో ఉండగల భేదం, ఇందులో మూర్తికవి చాలా సరసంగా విశదీకరించాడు.

## 9

ఉచ్చారణదక్షుడివల్లనే 'శబ్దం' జీవిస్తుంది. — అనే అభిప్రాయం వెలిబుచ్చుతూ, నన్నయభట్టు:

(శుక్రాచార్యుల పొట్ట చీల్చుకుని పైకి వచ్చిన కచుడు, శుక్రాచార్యులే తనకి ప్రసాదించిన సంజీవినీమంత్రం శుక్రాచార్యుల కళేబరం మీదే ప్రయోగించిన సందర్భంలో),

విగతజీవుఁడై పడియున్న వేదమూర్తి
యతనిచేత సంజీవితుండై వెలింగె
దనుజమంత్రి, యుచ్చారణదక్షుచేత
నభిహితంబగు శబ్దంబు నట్లపోలె.

## 10

తిక్కన రచనలో సంజయరాయబారంలోని,

ఒక్కొకచోఁ గడంగి ప్రతియోధులు మార్కొనునప్డు డాత్మలం
దెక్కొని మోములం బొడము నెవ్వగతోడ జనంబు "లిట్టియం
దక్కట భీముఁడైన మన యర్జునుడైనను మాద్రిపుత్రులం
దొక్కరుఁడైన నీ పగఱ నుక్క డగింపరె యొక్క ప్రేల్మిడిన్

వా రొక యాగ్రహావృత్తిం
గూరియు ధర్మంబు సెడుటకుం జాలరు దు
ర్వారబలులయ్యుఁ బాండుకు
మారులు శాంతాత్ము" లండ్రు మనుజాధీశా

అనే పద్యాల మొదటిదాల్లో 'జనంబులు' అనే మాట కర్త గాగల వాక్యానికి క్రియ రెండవదాల్లోని 'అండ్రు' గనక, భావంలో మనం వ్యవహరించేటప్పుడు మొదటిపద్యం ఉత్పలమాలగనక 'ప్రేల్మిడిన్' తరవాత వీలైనంత ఆర్భాటంచేస్తూ ఆగి తరవాతది 'కందం' గనక మళ్ళీ కొంత అట్టహాసంతో అది ప్రారంభించాలి – అని అయుండదు తిక్కన ఆశయం. రూపం పాటిస్తూ, భావద్యోతకం అయేలాగు, వాక్యపరంపర పఠించాలని అయుంటుంది.

## 11

శ్రీనాథుడి భీమేశ్వరపురాణంలోని రెండవఅశ్వాసంలో,

"మున్నాఱు శిష్యులును నే
నన్నెలఁతుకతోడ మాటలాడిన యయ్యు
ద్భ్యున్నత సౌధము మీదను
సున్నము నిగిడించినట్టి జోడరఁగులపై

ఉండి యాసారప్రసారంబులు చేయు శంభళీజనంబులచేతను మారాక మొఱింగించిన నబ్బోటి ..."

అనే పట్టులో, కందంలోని 'మున్నాఱు' అనే మాటతో ప్రారంభంఅయిన మహావాక్యానికి కర్త, కందం తరవాత ఉన్న గద్య లోని 'బోటి' గనక, 'జోడరఁగులపై ఉండి' అని అన్వయము గనక, పద్యపూర్తి అయిన సూచనగా విశ్రాంతి కూడదనిన్నీ, వరసగా, రూపం పాటిస్తూ, భావద్యోతకం అయేలాగు, రచన పఠించాలనిన్నీ, కవి ఆశయం అయుంటుంది.

ఇది కాక, అయిదో అశ్వాసంలో, శివుడు ప్రమథగణాల్తో కూడి కైలాసంనించి దక్షారామం వెళ్ళడానికి బయల్దేరినప్పుడు, శ్రీనాథుడు,

"హృద్యంబులగు గద్యపద్యంబులు తుంబురునారదాదులు పఠింప..." అంటాడు. 'పఠింప' అనడంలో శ్రీనాథుడి తాత్పర్యం తుంబురునారదాదులకి రాగాలు రావనా? పద్యం పఠించవలిసిందనా?

# 12

గురుజాడ అప్పారావుగారి బిల్హణీయం రెండవ అంకంలో :

" నారాయణభట్టు - ... ఏదీ పద్యం కలిపిచదువు.

శిష్యుడు - (చదువుతూ)

"అంకం కి మితి శశాంకే
కథ మిహా న్యాణాం విజాయ తే శంకా"

నారాయణభట్టు - తగలేశావురా, బంగారంలాంటి పద్యం! కొంచెం రాగవరసపెట్టి యాడవరాదూ?

శిష్యుడు — ( రాగవరసతో ) అంకం కిమితి శశాంకే …
( ఆ పైని చదవజాలక విరగబడి నవ్వును ).

నారాయణభట్టు — యెందుకు నవ్వుతావు ? ఓరి పాడగట్టా ! పద్యం బాగుంది కాదంటావా యేమిటి ? …”

అనే పట్టులో, రచయితకుడా పద్యం బాగుంద అనిపించుగోడానికి రాగసంధానం కోరుతూనే ఉంటాడు అని అప్పారావుగారి సూచన. ఉన్నది ఉన్నవాళంగా చదివితే, ఒక్కొక్కప్పుడు, అందులో ఏమీ లేకపోవడంవల్ల, బాగుండదు ? ఎవరు ఏం జెయ్యగలరు ? ఎవ రెంత పాడినా ఆ పద్యం బాగుపడదు.

# 12. పర్యవసానం

ఆంధ్రనాటకపద్యాన్ని రాగించడం నాటకోద్దేశానికి ప్రతిబం
. తెలుగుపద్యంలో సహజంగా ఉంటూండే గమనం పాటించి,
ృతుర శ్రద్ధతో, పద్యంయావత్తూ ఒకవ్యక్తిత్వంగలిగిఉన్న దాఖలా
ంపజేస్తూ, పద్యాన్ని ఉచ్చారణచెయ్యడం, పద్యోద్దేశానికి
వచేరువుగా ఉంటుంది. లిఖితరూపంలో పద్యాదిని ఉండే సూచ
కరంవల్లా, నాదరూపంలో పద్యానికి చేయబడే రాగసంధానంవల్లా,
త్రమే పద్యరూపాన్ని పోల్చుకోగలిగిన ఆంధ్రులు, రాగరహితం
ంనప్పుడు పద్యంకుడా తమరికి గద్యలానే ఉంటోంది అని తమ
ఠ్చచొప్పున తమ సాభిప్రాయం ప్రకటించగానే, వాళ్ళు అధిక
ర్యాకులుగదా అని భయపడి ఎటువంటి ఛాందసుడూకుడా గుండె
ునగోవలసిన అవసరం లేదు. ప్రత్యక్షసిద్ధాలైన పరమసత్యాల్ని
ఘటించడానికి అధికసంఖ్యాకత్వం తోడ్పడదు. పద్యోచ్చారణ
ుడు చెయ్యవలసిన పని గాయకుడి పని కాదు. పద్యోచ్చారణ
ద్యోజ్ఞానం కోరాలిగాని, రాగజ్ఞానం కోరకూడదు. భావంగల
్యాన్ని ప్రకటించడంలో రాగం ఆటంకం, భావంలేని పద్యాన్ని
ంచి రాగం పట్టించడం ఘోరాన్యాయం. తెచ్చే రాగం, చెడ్డ
గా అయుండాలి, ఆకర్షించేదైనా అయుండాలి. చెడ్డరాగం తీసుకు
కూడదుగదా. పోనీ, ఆకర్షించేరాగం తెచ్చి కలిపి పద్యాన్ని
టించామా, శ్రోతల్ని ఆ రాగమే ఆకర్షిస్తుంది, పద్యంయొక్క
గాలమీద వాళ్ళకి ధ్యాస లేకుండా చెయ్యగల ఒంట్రెత్తుతనం గానా
ఉంది. క్షుద్రరాగం తెచ్చికుడా లాభం లేదు. మనం ఎంత క్షుద్రుడి
ద ఆధారపడినా, ఆ క్షుద్రుడికి మనమే ప్రాముఖ్యం ఇచ్చినట్టవు
ంది. లేకపోతే అసలు అంత క్షుద్రుడిమీద ఆధారపడవలసిన అవ
మనం ఎందుకు పడాలీ? మంచి కంఠంగల సాహిత్యవేత్త రాగ

సంధానంతో పద్యప్రకటన చేసి, మొప్పు ఏకాగీతం— ఉండేలాగ జాగ్రత్తపడి, తీరా ఆ పద్యాన్ని అచ్చువేసినప్పుడు ఆ రాగంమీద పాడుకోవలిసే ఉంటుంది అని వరా వెయ్యకపోడం అన్యాయం. గాత్రమాధుర్యంగల సాహిత్యశూన్యులు రాగాధారంతో సాహిత్య దూరుల్లో పద్యప్రచారం చెయ్యబూనడం మిక్కిలి శోచనీయం. ఛందస్సు మొహం ఎరగని తెలుగువాడు, తన తాలూకు నాటురాగాన్ని తన మొదటి తెలుగుపద్యంమీద ప్రయోగించుకుంటూ, అక్కడితో పద్యాస్వాదన చేసేసినట్టు మురిసిపోవడం— ముంగలి తన చేతికిచ్చే అద్దంలో తన మొహమే చూసుకుని మురిసిపోవడంలాగ—అతడి స్వాతిశయాన్ని సూచించే విషాదపరిస్థితి. కవి పదాలలోని కవిత్వం వల్ల ఆకర్షింపబడిన పద్యపఠిత సభవాళ్ళని ఆకర్షించి ఐక్యపరచడానికి, రాగమూ వ్యాఖ్యానమూ సంధానంచేస్తూ వ్యవహరించడం అధర్మం. ఏమంటే, తను ఆకర్షింపబడ్డ కారణం ఒకటి, సభవాళ్లు ఆకర్షింపబడా లని తను ఎంచే కారణం మరొకటి. పద్యకవిత్వంలో అంతస్థు ఉండ గలవుగనక, పద్యరూపంయొక్క అంతస్థుకీ సభవాళ్ళ సారస్వతాభిలా షకీ మట్టం సరిపోవడం, ఆ పద్యరూపానికీ ఆ సభకీకూడా శ్రేయస్క రమే. సరిపోనినాడు పద్యరూపానికీ దెబ్బే, సభకీ బాధే! పద్య రూపంలో ఉండగల కవిత్వం హృదయంగమంగానూ సత్యస్ఫూర్తిగలది గానూ ఉండక మేథయొక్క నిశితత్వమూ భాషలో పాండిత్యమూ కోరే రకం అయితే, అది పదేపదే మననం చేసుకుంటే మాకటగాని బుద్ధికి ఎక్కదుగనక, అటువంటి ఉత్కృష్ట కవిత్వం సభాముఖాన్ని వడ్డించకపోవడం ఉభయతారకం.

పద్యోచ్చారణ యొక్క ఉద్దేశం, పద్యంలోని కవిత్వాన్ని ఎక్కువ చెయ్యడం కాదు, పద్యంలో ఉండగల కవిత్వాన్ని బహిర్గతం చేసి, ఏక క్షణంలో అనేకులు పద్యపదాలవల్ల ఆకర్షింపబడి సంఘానం

దం పొం చేటట్టు చెయ్యడం. ఉన్న కవిత్వాన్ని నిలబెట్ట గలిగితే చాలు ననుకోవలిసిన పఠిత, దాన్ని పునరమృతం చేసి దానికి మెరుగు పెట్టడానికి వెతుకుతున్నా ననుకోవడం మోచని క్రేని సాహసం! అర్థంతో జోక్యంలేని స్వరాలయొక్క సంపుటీవల్ల జనించే రాగం, పద్యంతో జోడించి ఉన్నప్పుడు, పద్యంయొక్క అర్థాన్ని ఇంకా ఎక్కువ ప్రకటిస్తుందనుకోడం, పఠితయొక్క అజ్ఞానానికి తార్కాణం. రాగం పాడలేని వాడు, ఆ ఒక లక్షణమూ చాలుగావును సభాముఖాన పద్యపఠనం చెయ్యడానికి అనుకోవడం పొరపాటు. ఒక కళలో మనకి ఉండగల లోటుని తీసిగెల్లి మరొక కళలో మన ప్రావీణ్యంగా జమకట్టుకోడం హాస్యాస్పదం. పద్య పఠితకి: ఆంధ్రసాహిత్యంత పద్యరూప పరిచయమూ, కవితారాధనా, ఇష్టకవియొక్క ప్రతిభగుర్తించి దాన్ని సూచించే పదాలతో జనాన్ని ఐక్యపరిచాలనే సత్సంకల్పమూ, పద్యనిర్మాణ జ్ఞానమూ, వివిధ పద్య రూపాల గమన వైఖరులూ, అలంకార జ్ఞానమూ, అమోఘ ధారణా, అనర్గళ వాగ్ధాటీ, మంద మధ్య వేగ గతుల ప్రయోజనమూ, మంద్ర మధ్య తారస్థాయుల ఉపయోగమూ, తెలుగు మాటరీతి గాని యాసా, కాకుస్వరవిధానం గురించిన అనుభవమూ, తెలుగు సంభాషణ రకాలూ, ఉచ్చారణలో పద్యరూపం సిద్ధించడానికి కావలిసిన కదలికా, సంధింప బడ్డ మాటల సంధులు విరగ్గొట్టి పద్యగమనానికి భంగపాటు తీసుగు రాకుండా పద్యాన్ని నడిపించగల ఒడుపూ, ఏకోచ్చారణతో పద్య భావాన్ని జనహృదయాల్లో ముద్రించగల నిశ్చితత్వమూ, స్పష్టమైన పలుకూ, పఠింపబడే మాటలు అక్కడలేని కవివా తనవా అని శ్రోత లకి సందేహం జనింపచెయ్యగలిగేటంత తత్పరతా, సభాతత్వపరి జ్ఞానమూ, మనస్సుని పట్టిన భావాన్ని ముఖనేత్రహస్త విన్యాసాలలో ప్రతిబింబింపచేసుకోగల అభ్యాసమూ, లయజ్ఞానమూ, ఉండాలి.

---

# 13. ఆక్షేపణలు-సమాధానాలు

1. కవిత్వంలో గానం ఉంది, గనక పద్యం పాడాలి.

సమాధానం:-కవిత్వం మానవహృదయాల్ని ఆకర్షించి మానవుల్ని ఐక్యపరిచే పదరచన. మానవహృదయాల్ని ఆకర్షించి మానవుల్ని ఐక్యపరిచే ప్రతినాదమూ గానమే.

కాబట్టి, ఈ ఆక్షేపణవాక్యంయొక్క అర్థం ఏమిటంటే: పదరచనలో హృదయాకర్షణ చేసే నాదం ఉన్నది— అని. 'లేదు' అన్నవారెవరూ? శబ్దాలంకారాలన్నీ వీనులకి విందుచేస్తాయి అని ఉందికదా! ఒక్కొక్కప్పుడు ఒకే శబ్దంలో ఉండగల వర్ణనాదాల సాహచర్యమే చెవులపండుగుగా ఉండవచ్చు. అయితే? కవిత్వంలో గానం ఉంది— అనే వాక్యం పట్టుగుని (అక్కడికి కవిత్వంఅంటే పద్యంమాత్రమే, గానంఅంటే 'రాగం' మాత్రమే అయినట్టు!) పద్యంలో రాగం ఉందని వాదించడం ఏం ధర్మం? అలా వాదిస్తూ, పైగా, పద్యానికి ఏ బాపతో ఒక బాపతు అన్యరాగంకూడా తెచ్చి కలపాలి, అనడం ఏం కొసరుబేరమూ?

2. పాడడానికి పద్యం బాగుంటుంది (వచనం బాగుండదు), గనక పద్యం పాడాలి.

సమాధానం:- పాటే రావాలిగాని గద్యపద్యగేయాలు అన్నీ బాగుంటాయి పాటకి. ఏ మూడునాలుగు వచనంముక్కలైనా సరే తీసుగుని గురులఘువుల్ని యథేచ్ఛగా కుదించి సాగకొట్టడానికి అంగీకారం ఉంటే, ఏ రాగంమీదైనా ఏ తాళానికైనా ఆ ముక్కల్ని సరిపెట్టి పాడచ్చు. పల్లవిపాడడం అంటే అంతేగా! మరో విషయం. అసలు ఆ కాసినిముక్కలూకూడా అక్కర్లేదు రాగం ఉంటే. 'రాగం' అంటేనే

రంజింపచేసేదికదా! ఆమాటకొస్తే, రాగంకుడా అక్కర్లేదు ఒక 'స్వరం' చాలు 'స్వరం' అంటే స్వయంగా రంజింపచేసేదికదా!

3. పద్యం 'నన్ను పాడుకోవోయ్' అని చదువర్ని ఆహ్వానిస్తూ ఉంటుంది, గనక పద్యం పాడాలి.

సమాధానం :- తెలుగుపద్యాల మొదట ఉంటూండే అక్షరం పాడుకోమని ఆహ్వానం కాదు, వేలాదిగా ఉన్న ఛందస్సు గురించిన సూచన. ఆ సూచకాక్షరం వెయ్యకపోతే, ఆ పాకం పద్యపాకం అనే సంగతే బోధపడదుట ఆంధ్రులికి! అందుకని వేస్తున్నారట! అటువంటి అక్షరం ఆదిని వెయ్యడం మానేసి, రచన ప్రకటించినప్పుడు, రాగతాళగతి సూచకాలు లేకపోయినా, 'నన్ను పాడుకోవోయ్' అని కేక వేసేవారెవరూ? ఎటువంటి చదువర్ని?

4. పద్యం కొంత ఆనందం, రాగం కొంత ఆనందం. రెండూ కలిపితే మరీ ఆనందం గనక పద్యం పాడాలి.

సమాధానం :- కొంతఆనందం ఇచ్చే పద్యం గణపంజరం అవుతుందిగాని 'కవిత్వం' అనిపించుకోదు. అల్లానే, కొంతఆనందం ఇచ్చే రాగం మూలుగు అవుతుందిగాని 'గానం' అనిపించుకోదు. వేర్వేరు వ్యక్తిత్వాలుగల రెండు కొంతల్ని కలిపితే పెద్దకొంత కావచ్చు, లేక ఒకదాన్ని ఒకటి నాశనం చెయ్యవచ్చు. పద్యసృష్టి చేసిన రచయిత రాగప్రమేయం పెట్టుగోకుండా నే తన సృష్టి జరిపి అది జనాకర్షణ చెయ్యగల కవిత్వం అని నమ్మి ప్రకటించినప్పుడు, అందులో కొంత ఆనందం మాత్రమే ఉందని ఛందోవిధ్వంసుడు అనుకుంటే అతడికేం భయం? తన పద్యం కొంతఆనందం మాత్రమే ఇయ్యగలదు

అనే మాటకి యథార్థకత ఖేదిస్తాడు. రాగం కలిపితే మరీ ఆనందం కలుగుతుందనే విశ్వాసంతో పద్యరచన చేసేవాడు, ఆ పద్యంయొక్క 'కొంతఆనందం' ఏమిటో ముందు తనే, దాన్ని సృష్టిచేసినవాడు గనక, ఎల్లాగో కనిపెట్టో, కనిపెట్టించో, అది మరీ తక్కువగా ఉంటే ఆ పద్యాన్ని విసర్జిస్తే సరిపోతుంది! అల్లా చెయ్యక, దానికి ఎల్లాగో ప్రాణప్రతిష్ఠ చెయ్యడానికి, మంచికి అంతవాడెళ్ళి కొంతఆనందంగల రాగం తెచ్చి కలపడం శాసనం అని వాదించడం ఏం న్యాయం! తన 'కవిత్వం'లో ఉండే బండారం బయటపడిపోకుండా "మూర్ఖాళి సంభావించే" ట్లు జాగ్రత్తపడడానికా?

5. అల్పతమ రాగం ఉంటే ఎవరి పుట్టీ మునిగిపోదు గనక, పద్యం పాడాలి.

సమాధానం:- అల్పతమ రాగంతో వ్యవహరించేవాడు దాన్ని ఒక కట్టెకింద చెయ్యడంవల్ల, గాయకుడు తన పుట్టి మునిగిందని ఏడవవచ్చు. రాగంమాత్రం విని దానిగురించిన తక్షణశ్లాఘ ప్రతీ మానవమాత్రుడూ ప్రకటించగలడుగనక, అటువంటి జనుడికి తృప్తికరంఅయ్యేటంత రాగం పద్యానికి జోడింపు కానప్పుడు, ఆ 'అల్పతమ రాగం' వాడికి నచ్చక వాడు దాన్ని నిరసించడంలో పద్యాన్నికుడా ( తనకి తాఖీతు లేకపోయినా ) 'ఛీ, ఏడిసినట్టుంది' అని తీసిపారేసినట్టు అవుతుందిగనక, పద్యరచయిత పుట్టికుడా ఒక్కదెబ్బని మునగవచ్చు. 'అల్పతమ రాగం' ఉంటేతప్ప ఛందశ్శూన్యుడైన శ్రోతయొక్క పుట్టి మునగడం రూఢి.

6. పద్యరసం ఆస్వాదించగాఆస్వాదించగా వెళ్లి అదే ఏదో రాగంలో పడి తీరుతుంది. పద్యం పాడి తీరాలి.

సమాధానం:- పద్యం పాదాలు గలది. సహజమైన గమనం గల పదపరంపర పాదం. పదాల అర్థాలవల్ల భావమూ, భావనం గతివల్ల రసమూ జనిస్తాయి. తడిగల పదార్థమూ తడి హృదయంగల గ్రాహీ ఉన్నప్పుడుగాని రసం ఉండదు.

రాగం అంటే ఆరోహణ అవరోహణలలో 7 లేక 6 లేక 5 స్వరాలుకలిగి తెలుగుగానశాస్త్రంలో పేరుపడ్డ స్వరరచన.

పద్యపాదం వెళ్లివెళ్లి స్వరరచనలో ఎల్లా పడుతుంది? పద్య పాదం అనగాఅనగా 'ఏదోరాగం' ఎల్లా వస్తుంది రాగం తెలియనివాడికికూడా? ఆస్వాదించడం అనగా పీల్చి అనుభవించడం. మన సమస్య పద్యాన్ని స్వంతానికి ఆనందించుకోడం గురించి కాదు, ఇతరులచేత దాన్ని ఆనందింపచెయ్యడం గురించి.

ఒకకళ ఇతరకళని ఉపాంగంగా తీసుకోవచ్చు, గనక పద్యంపాడాలి.

సమాధానం:- ఈ ఆక్షేపణ చేసేవాళ్లు పద్యకళ రాగకళలు వేరని ఒప్పుగుంటారు. అనగా, రాగసహాయం లేకుండా పద్యం స్వతంత్రంగా పుట్టిన బాపతే అయినా, ప్రకటనలోమాత్రం దానికి సహాయంగా రాగం ఉండాలీ, అని. పద్యం నాదప్రమేయం, రాగమూ నాదప్రమేయమే. కాబట్టి, వాటిమేళగింపులో అసంభవత్వం ఏమీ లేదు. కాని, ఏ భాష్చీ పద్యంలో నియమితమైన ఒక గమనం ఉంటుంది, రాగంలో వేరే ఒక గమనమేకాక స్వరాలఆరోహణ అవరోహణ లుంటాయి. పద్యాన్ని అంగంగానూ రాగాన్ని ఉపాంగంగానూ చెయ్యదల్చుకున్నప్పుడు, సాయంవచ్చిన రాగంమూలంగా పద్యగమనమూ నాశనం కాకూడదు, సాయం వచ్చిన రాగజీవుడు తనూ ఉసూరు

మనకూడదు. అందువల్ల, పద్యంయొక్క గమనం పాటించి పద్యకళ నిలబెట్టి, మరో గమనమూ ఆరోహణ అవరోహణలూ గల రాగకళకుడా నిలబెడితే, అప్పుడు తప్పుతుంది. అంగోపాంగాల ప్రాణాపాయం. అనగా, ప్రతి పద్యాన్నీ కీర్తనగా చేసి పాడడం. ప్రస్తుతం ఆలోచనలో ఉన్న విషయం అదికాదు.

8. రాగానికి జనాకర్షణ ఉంది గనక, పద్యం పాడాలి.

సమాధానం:- పద్యానికి జనాకర్షణ లేదన్నమాటా? పోనీ కొంత ఉంది. అదేమటో ప్రకటించే సందర్భంలో చాలా ఆకర్షణగల రాగాన్ని పట్టుగొస్తే, పద్యానికుండే ఆ కాస్త ఆకర్షణాకుడా అడుగంటి పోతుందే! పైగా, ఎవరు పాడిన ఏ రాగానికి ఏ జనాకర్షణ ఉంటుందీ? పోనీ, ప్రతీవాడు పాడిన ప్రతీరాగానికీ తక్కిన జనం అంతా అకర్షింప బడడం రూఢే అని నమ్మదాం. అటువంటి లక్షణం రాగానికి ఉంది గనక, అది అమ్మ్యమైనాసరే తేరసొమ్ము గనక, మరోడు దాన్ని పట్టుగొచ్చి ఆకర్షణ గల పద్యానికి చుట్టబెట్టవలిసిన అవసరం ఏమిటీ, ఆకర్షణలేని పద్యానికి కట్టబెట్టవలిసిన న్యాయం ఏమిటీ? ఆకర్షించని పద్యం కుడా కవిత్వంగా చలామణీ కావడానికా, ఛందస్సు మొహం యెరగని శ్రోతకుడా పద్యరచన గురించిన యోగ్యతాపత్రం నుంచున్న పాళంగా ఇచ్చెయ్యడానికి వీలుకలిగించడానికా? పద్యంలో ఉండగల కవిత్వానికి జనాకర్షణ ఉండక పోయినా అది కవిత్వమే అని తనుమాత్రం ఎట్లాగో గ్రహించి, గానం మాటెట్టించి దాన్తో జనాకర్షణ చెయిస్తాననేవాడా కవి! ప్రతిబంధకంగా పరిణమించినాసరే పరాయిసొమ్ము తేరగా దొరికితే, అయినకాడికి నొల్లుకొచ్చి కంఠగతం చేసుగుంటేగాని

అసలు సొమ్ముకి విలవ సరిగా బయటపడదు, అనడం ఏం కిచ్చుతు కట్టడం !

పద్యం అనేది రాగం లేనప్పుడు పామరహృదయానికి పాకదు, గనక పద్యం పాడాలి.

సమాధానం :— తెలుగుపద్యరూపంలో రకాలు బోలెడున్నాయి. ఇంద్రసూర్యగణాలు వచ్చే రకంలో బోలెడు నడకలుండడానికి కూడా వీలుంది రచయిత తన సామర్థ్యంతో తన అవసరం చొప్పున కొన్నికొన్ని పద్యాల రకాలు నిర్వహిస్తాడు. కొన్ని కొన్నింటిలో అపరూపమైన శబ్దశిల్పం ఉంటుంది, కొన్నింటిలో అపూర్వమైన అలంకారసామగ్రి ఉంటుంది, కొన్నింటిలో విశిష్ట మైన భావగాంభీర్యం ఉంటుంది, కొన్నింటిలో అఖండమైన జ్ఞానసంపత్తి ఉంటుంది. అటువంటివి క్షుద్రరాగంతో పాడబడ గానే పామరహృదయానికి పాకుతాయా? కాస్త రాగంతో అందియ్యగానే పామరులు ఆ అనుపానంతో కవితారసం గ్రోలు తారా? అర్థంగొడవలేని రాగమే చప్పరిస్తారు. ఈ విషయం పైకే అనేస్తారు కొందరు: పామరులకి ఆ పద్యం ఎల్లానూ తెలియదుగనక వాళ్ళు రాగంఎరనేనా పడి ఉంటారు — అని. అల్లా చెయ్యడం ఆ కవిత్వానికీ అన్యాయమే, ఆ పామరుడికీ శాశ్వత అపకారమే. రాగం తెచ్చిపెట్టడంమూలంగా, అటు వంటివాళ్ళు, పద్యభావం ఆనందించడానికి యత్నమే నా చెయ్యరు. పైగా వాళ్ళు భావాలు గద్యలో చెప్పబడేటప్పుడు కూడా చురుకుగా భావగ్రహణం చేసుగోలేని స్థితిలో పడి, మంద కొడిశ్రోతలుగా ఎల్లకాలమూ ఉంటార్రు.

10. అక్కడక్కడ పద్యాలు ఉంటూంటాయిగనక, పద్యం పాడాలి.

సమాధానం :— ఇది ఏదో చెప్పాలని చెప్పిన బాపతేకాని, సరి అయిన ఆక్షేపణే కాదు. అక్కడక్కడ కాకుండా అంతా పద్యరూపమేఅయితే, అప్పు డేంచెయ్యాలి? పోనీ, అక్కడక్కడ గద్యం ఉంటూంటే, గద్యమాత్రమే పాడాలా, పద్యాలు మానేసి?

11. నాటకం కళల సన్నివేశంగనక, పద్యం పాడాలి.

సమాధానం :— కళలు అరవైనాలుగు. పోనీ, లలితకళలు అయిదు— కవనం, గానం, చిత్రరచన, ప్రతిమాశిల్పం, భవననిర్మాణం. ఇవన్నీ నాటకప్రదర్శనంలో ఉండగలవు. చిత్రరచన ఉండవచ్చు, ఉంటూంటుంది. కాని, ఆ తెరలు మొదలైనవి లోగడే చిత్రకారుడు వేసిఉంటాడుగాని, నాటకప్రయోగసమయంలో, అన్యుడై ఒప్పవలిసిన నటుడు కుంచె చేతపట్టి ఉచితమైన రంగులతో తెరలువేస్తూ కూచోడు. అట్లాగే, శిల్పనిర్మాణాల్ని అనుకరిస్తూ రంగాలంకరణం చేస్తారు. అదైనా, అన్యుడై ఒప్పవలిసిన నటుడు అప్పట్లో బొమ్మలూ చెక్కడు, వస్తువులూ చెయ్యడు. అవన్నీ లోగడే తయారై ఉండిన బాపతు. కవనం కూడా (పద్యరూపంకూడా) రంగంమీద దొరకవచ్చు. అది కుడా అన్యుడై ఒప్పవలిసిన నటుడు అప్పట్లో ఛందస్సు చూసుకుని అల్లుతూ కూచోడు. అదీ లోగడే అల్లిన బుట్టే! గానమూ రంగంమీద ఉండవచ్చు. కాని, అది లోగడే తయారుకాగా నిలిచే స్వభావం కలదికాదు. అది ఎప్పటికప్పుడు తాజాగా సృష్టింపబడాలి. రంగంమీద గానమూ ఇప్పించవచ్చు. అంతమాత్రంచేత, కవనంలో ఉండగల పద్యాలుమాత్రం, అన్యుడై

ఒప్పవలిసిన నటుడు రాగాలుతియ్యాలని ఎక్కడుంది? అట్లా జరిగితేగాని, నాటకకళల సన్నివేశం పూర్తికాదా?

12. పద్యాలు పాడకపోతే నాటకప్పాకలు తెగులడిపోతాయిగనక పద్యాలు పాడాలి.

సమాధానం:— పద్యాలు పాడుతూన్న కొన్ని తాటాకుపాకలు వెనకట్లో తగులడిపోతూండడం జరిగేది. ఇప్పుడు పాకలే లేవు. ప్రదర్శనాలు ఇతర రకం పాకల్లో జరుగుతున్నాయి. సంగీత నాటకాన్ని విశ్వసించేవాళ్లు ఉన్నంతకాలమూ సంగీతనాటకాలు ఉండితీరతాయి. కాని, ఛంధస్సుతో నిర్మింపబడ్డ పద్యంలోని ఛంధస్సుని చంపి ఎల్లానోఅల్లా కల్పించదల్చుగున్న హాయి కోసం క్షుద్రరాగం తెచ్చి అన్యాయిడై ఒప్పవలిసిన నటుడు పద్యానికి పులమడం మానగానే, పాకలు తగులడిపోవలిసిన అవసరం ఏమిటి? ఈ ఆక్షేపణయొక్క తాత్పర్యం ఏమిటంటే: నుంచి వాడు నాటకరంగంమీదికొంచి బుర్రరుబ్బుతూ పద్యాలు (అను) రాగంతో వడ్డిస్తేతప్ప, నాటకప్రయోగశ్రోతలు ఉండరు—అని. నాటకరంగంమీద జీవకణం గాత్రమాధుర్యం ఒకటే అని నమ్మేవాళ్లు, అంకాలమధ్యనో రంగాలమధ్యనో — కావలిసినంత గానం గాయకుడివల్లే కోరవచ్చునే! పద్యంలో మాత్రమే నటుడు మాత్రమే ఏ విధమైన కట్టుబాటూ లేక ఎవరూ నిర్ణయించలేని ఏదో రాగం తీసితీరాలనడం ఏం సబబూ?

13. ఒక్కొక్కరి యిష్టానుసారం ఒక్కొక్కటి తీసెయ్య కూడదుగనక పద్యం పాడాలి.

సమాధానం:— వ్యక్తుల ఇష్టాన్నిబట్టి కళలు చేరుకోవు, ద్వేషాల్నిబట్టి వేరూ కావు. ఆదిలో నాట్యం ఒక సమిష్టికళ — గంతు,

రాగం, తాళం, మాట—కలిసి! గంతు ప్రత్యేకజన్మ దాల్చినృత్య కళగా ఏర్పడింది. రాగం, తాళం, మాట సమిష్టిగానే 'కీర్తన' గా నిలిచాయి. రాగం ప్రత్యేకజన్మ దాల్చి గానకళ ఏర్పడింది. తాళం, మాటా సమిష్టిగానే ఉంటూ పద్యకళగా నిలిచాయి. తాళం ప్రత్యేకజన్మ దాల్చి (మృదంగం మొదలైన వాద్యాలు) ఒకకళగా ఏర్పడింది. మాట ఒకటీ నిలిచిపోయి, ఇటీవల గద్య రూపంలో ఒకకళ అనే పేరు తెచ్చుగుంది. సమిష్టికళలలోని భాగాలకి స్వాతంత్ర్యం వచ్చి ప్రత్యేకకళలు ఏర్పడతాయేకాని, వ్యక్తుల అభీష్టాన్నిబట్టి పేర్లుపెట్టించినంతమాత్రాన్ని పోవు.

14. పద్యం పాడకపోతే గానకళ పోతుంది, గనక పద్యం పాడాలి.

సమాధానం :— గానం అంటే ఆకర్షించే నాదం. దానికి ప్రత్యేక జన్మ ఉంది. అంగా, ఇతరకళల సాధనసామాగ్రి అరువు పుచ్చుగోకుండానే ప్రాణికోటిని అది ఆకర్షణ చెయ్యగలదు. పద్యం అనగా, ఏదో గమనంగల పదజాలం. ఏదో గమనం గలిగిన మాటలకి గానశాస్త్రజ్ఞులు 'రాగం' అని పేరెట్టిన కొత్తనాదం తెచ్చి కలపకపోతే, ఆ పద్యంయొక్క జీవం కాస్తా లేచిపోతుందేమో అనుకోడం వెర్రి. ఆ పదాలుగనక చచ్చు పదాలైతే, సజీవనాదం ఏదేనా తెచ్చి కలపనినాడు వాటికి జీవలేశంకుడా అంటక అవి అల్లానే చచ్చురకంగానే అఘోరిస్తూ ఉంటాయి అనుకోడం సబబుగాని, ఒక క్షుద్రరాగం మనకి ఒక తడకగా ఉండడంనిమిత్తం మనం తెచ్చుగోని కారణంచేత, గానకళ నశిస్తుంది అనుకోడం వెర్రిని మించిపోయిన మాట. మనం ఆశీర్వదించక పోతే సృష్టిస్థితిగతులు నిల్చి పోతాయి అనుకోడం ఇల్లాంటిదే.

5. ఎల్లానో అల్లా రాగం వచ్చి పద్యంలో మకాం వేసింది. దాన్ని అందులోంచి బ్రహ్మరుద్రులు తీసెయ్యలేరు, గనక పద్యం పాడాలి.

సమాధానం :– 'ఎల్లానోఅల్లా' అంటే అక్రమంగా అని ఒప్పుగో వడమే. అక్రమం జరిగేసిందిగనక మరి అంతా నోరుమోసు గోవాలా ? పద్యరచనే కాక 'తాళం'కూడా తెలిసిన ప్రతిభా శాలి ప్రతీపద్యాన్నీ ఏ తాళంలో వెలువరించాలో సూచించాలి. ఆ తాళం తెలిసినవాళ్ళే అది ప్రకటిస్తారు, తక్కినవాళ్లు దానికి ఓ దణ్ణంపెట్టి తప్పుగుంటారు. లేక, తన పద్యరచన యావత్తూ రాగంలోంచే పుట్టుగు వస్తోందని నమ్మేరచయిత తనకి రాగాలు వచ్చునని షరా రాసి తన పద్యాల్లో ఏది ఏ రాగంలోంచి పుట్టిందో సూచిస్తే, ఆ రాగం వచ్చినవాళ్ళే అ పద్యం ప్రకటిస్తారు, తక్కినవాళ్ళు ఆ పద్యానికి నమస్కరించి తప్పుగుంటారు. యథార్థం చెప్పాలంటే, పద్యంలో వచ్చి ఎల్లానూ మకాం వేసింది ఒక విధమైన తాళం. ఎంత అఖండ ప్రతిభావంతుడైన పద్యకవీకుడా తన పద్యాలకి తాళం సూచించడే ! రాగం అసలే సూచించడే ! ఏదో రాగం వచ్చి అడ్డమైన పద్యంలోనూ మకాంవేసి కూచున్నప్పుడు, ఆ కూచోడం తమరు చూసుంటే, దానిపేరు చెప్పి కట్టుదిట్టం చెయ్యకూడదూ ? రచయితే పద్యంలో రాగానికి పేరులేకుండా చేసినప్పుడు ఇంకోరు రావడం ఎందుకూ అసల్లేని రాగంపేరు తీసెయ్యడాని కంటూ ! ఇంతోటి శూన్యక్రియకీ బ్రహ్మరుద్రులంతవాళ్ళు కాలవ్యయం చేసుగోడం ఎందుకూ, మరో పనే వాళ్ళకి లేనట్టూ !

16. పద్యము గద్యవలె చదివిన శ్రావ్యముగ నుండనేరదు. గణబద్ధముగనుక పద్యము రాగాపేక్ష గలిగియుండుట అనుభవసిద్ధము. సంస్కృతములో ఏమోగాని, తెలుగులో రాగంలేకుండా వీలు లేదు. బలాత్కరించి మానుట విరసము. కనుక, స్వతస్సిద్ధమైన నడకతో రసోచిత రాగంతో పద్యము పాడవలె.

సమాధానం:— పద్యం వేరూ గద్య వేరూ కాబట్టి, పద్యాన్ని పద్యంలాగే అనవచ్చుగాని గద్యలాగ అనడం కుదరదు. పద్య పదాలయొక్క వర్ణసాహచర్యంలో శ్రావ్యత ఉండగలదు. అటువంటి శ్రావ్యత ఒప్పుగోనివాళ్లు శబ్దాలంకారాలకీ యతి ప్రాసలకీ శూన్యం పెట్టినట్టే. పద్యం గణనిబద్ధంగనక, దానికి తాళాపేక్ష ఉంటుందనడం సహేతుకంగాని, రాగాపేక్ష ఉంటుం దనకూడదు. అన్నీ సంస్కృతంలోవి ఒప్పుకుంటూ, కొన్ని చోట్ల సంస్కృతంలో ఎమో ఏమిటి? సంస్కృతంలో శ్లోకాలకి రాగాలు కలవను—వాటి గమనస్ఫురణ చేస్తారు. శ్లోకాంతాన్ని ఆగడానికి వీలుగనుక ఆగుతారుగాని సాగరు. 'బలాత్కరించి' అనేది ఆచరణకిగాని మానడానికి అతగదు. పద్యం నడక రాగంవల్ల పోతుందిగనక, పాడేవాళ్ళే లేనిపోని రాగంతో పద్యాన్ని బలాత్కరిస్తూన్న వాళ్లు. మానేవాళ్ళు కారు. రసోచితరాగం అనేదానికి శాసనముంటే అ[illegible]లుజకప వచ్చు. స్వతస్సిద్ధమైన పద్యం నడకపాటిస్తూ పద్యాన్ని రాగించడం జరిగితే, అది కీర్తన అవుతుంది. ప్రతిపద్యాన్నీ కీర్తనగా పాడడం సంభవనీయం అయినా, ప్రస్తుతవిషయం కాదు.

# 1939 లోని ఒక ఉపన్యాస సంగ్రహం

10–2–1939 తేదీని ఆంధ్రవిశ్వవిద్యాలయ ఆంధ్రవారము ఉత్సవాల సందర్భంలో, వాల్తేరులో, శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు అధ్యక్షత వహించిన సభలో నేను 'పద్యపఠనం' గురించి ప్రసంగించాను, పద్యపఠనం చేశాను. నాటి నా ప్రసంగంయొక్క సారాంశం 21–2–1939 తేదీ 'ఆంధ్రపత్రిక'లో ప్రచురింపబడింది. అది యిది:

ఆంధ్రపద్యోచ్చారణలో రాగసమ్మేళనం చాలా చిత్రం. ఇందులో ఉండే లాభనష్టాలు 1924 సంవత్సరంలో బందరులో నట మహాజనసభలో నేను సూచించాను. అప్పట్లో నే నన్న సంగతులు, నే చెప్పగలిగినకంటె సుగమతరంగా శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమ రావుగారు తమ 'మాతృసేవ' 13–6–1924 తేదీ సంచికలో ప్రకటించారు.

స్వాంతంగా తనొకడూ ఆనందించే సమయంలోనూ, ఇతరుల ఆనందంకోసం తను చదివేటప్పుడూ పఠించేటప్పుడూకుడా, ఛందస్సు సంగతి అల్లా ఉండవచ్చు అక్షరాలుకుడా తిన్నగా చదవలేని వాడైనా సరే, వీలైతే వచ్చిన 'కూను'రాగంతోటీ వీల్లేకపోతే రాని 'కూనీ' రాగంతోటీ, ప్రతీ తెలుగుపద్యాన్నీ యథాశక్తి రాగరజ్జువుతో ఉరివేయాలి--అనే అభిరుచి ఆంధ్రజనుల్లో జనించి ప్రబలడంవల్ల, మంచిచెడ్డల వివక్షత లేకుండా పద్యకవిత్వం వెళ్ళి అల్పరాగప్రజ్ఞా మంచికంఠమూ మాత్రమే గలవాడి నోటికెక్కి మూఢశ్లాఘ పొంది జీర్ణించడమున్నూ, సాహిత్యజ్ఞాని నోటంట వినబడే పద్యకవిత్వం రాగరహితం అయినప్పుడు జనబాహుళ్యంచేత (ప్రాలుద్ధకర్మం—ఒకప్పుడు పండితులచేత !) అసహ్యించుకోబడడమున్నూ సంభవించి, ఏ కవిత్వం ఎన్ని మన

న్నుల్ని ఎట్లా రంజిస్తుందో చెవిమీద వేసుగుని విచక్షణగా చూసు గోడానికి వీలులేనిపరిస్థితి ఏర్పడింది. ఈ అలవాటుధర్మమా అని పద్యరూపంలో ఉండగల కుకవిత్వం పట్టుబడకుండా విరివిగా చలామణీ అవుతూంది. ఎదురైన ప్రతి పద్యరూపానికీ సాష్టాంగపడి లెంపలేసుగోవడం, దాని ప్రకటనలో వినిపించే గాత్రపు ఒదుగులు మాత్రమే కవిత్వపు చెణుకులు అనుకోవడం, 'మెజారిటీ' తమదే గనక కాదన్నవాళ్లని లేవిడీకొట్టడం, మాత్రమే మొత్తంమీద ఆంధ్రమహా జనానికి చేతనైందికాని, భావాన్ని గుర్తించుగోవడం, భావాన్ని ఆస్వా దించడం, భావాన్ని ఆరాధించడం ఆంధ్రుల్లో నేటికీ స్వప్నవృత్తాం తాలే! ఇటువంటి పరిస్థితిమెచ్చతగ్గ ఉన్నతస్థితి కాదు, సరిగదా భరించ రాని దుస్థితి.

ఏదో రాగంలో లుంగచుట్టి పద్యాన్ని గిరవాటెయ్యడం అశా స్త్రీయం, సంప్రదాయ విరుద్ధం, అసంభవం, వ్యర్థం, అనర్థదాయకం. అయినాసరే, స్వాంతానందం గురించినప్పుడు ఎవరి యిష్టం వారిది. కాని, యితరులకి పద్యం వినిపించేటప్పుడు పద్యానికి సహజంగా ఉండే నడక పాటిస్తూ పఠించడంవల్ల అర్థద్యోతకం అయినట్టు మరొకలా కాదు. పద్యప్రకటన రాగరహితం అయినప్పుడు శూన్యానందంలో ఉంటూ, అది రాగసహితం కాగానే ఆనందపడి, ఆ ఆనందం పద్య జన్యం అనుకోడం అజ్ఞానం. యోచనతో ఉండే సంగతులు తెలియ పరచే మాటలు చెప్పవలిసిన వాళ్లైన ఉపన్యాసకుడూ ఉపాధ్యా యుడూ పఠితా నటుడూ మొదలైనవాళ్లు రాగాల్తో బయల్దేరా రంటే, తమవేలే పెట్టి తమ కన్ను పొడుచుగున్నవాళ్లవుతారు. చిత్తవృత్తియొక్క ప్రకటన పదరచనలో ప్రారంభం అయినప్పుడు, అదిని, కీర్తనరూపంలో (మాటలు – రాగము – తాళము రూ

పంలో) అది జనించి ఉంటుందని జ్ఞానుల ఊహ. జంత్రగానం ప్రత్యేకంగా మానవుల్ని రంజింపగలగడంతో, గానానికి వ్యక్తిత్వం, ఏర్పడడం, కీర్తనలోంచి రాగం విడిపడడం జరిగి ఉంటుంది. మరి మిగిలిన తాళంతో ఉండే మాటలకి వ్యక్తిత్వం ఏర్పడి 'పద్యం' అయింది. అట్లాగే వాద్యగానానికి ప్రత్యేకత్వం సిద్ధించి, తాళంకుడా విడిపడగా, గద్య అయింది. పద్యాక్షరాల్లో గురులఘువులు గమనించి, తద్వారా పద్యంలోఉండగల మాత్రల సంఖ్య లెక్కగట్టి, ఏదో ఒక తాళం ప్రతిదానికీ వెయ్యవచ్చును. పద్యంలో ఉండగల వర్ణసాహచర్యమే శబ్దాలంకారాది ఫలితమే పద్యంలోఉండే 'గానం', అంతేగాని 'రాగం' కాదు. వివిధ లక్షణలక్ష్యాలుగల కళల్ని సంపుటీ చేసేటప్పుడు అన్నింటి వ్యక్తిత్వమూ నిలబెట్టాలి. అందులో, రెండూ నాదంలో జనించినా పరస్పర విరుద్ధలక్షణాలు గల పద్యరాగాల్ని జోడించడానికి మరీ ప్రజ్ఞ కావాలి. శుద్ధ అజ్ఞాని చేసినట్టు రాగానికి పద్యాన్ని ఒక తడక అయేటట్టు చెయ్యడం కవికి ఎంత ప్రాణసంకటమో, కొందరు పండితులు చెప్పేటట్టు పద్యానికి రాగాన్ని ఒక తడక అయేటట్టు చెయ్యడం గాయకుడికి అంత కంటకం. ఉభయ కళాకోవిదుడు రెండింటినీ జీవింప చేసేటట్టు ప్రతిపద్యాన్నీ కీర్తనరూపంగా పాడడం ఒక దారి. పద్యానికి రాగం జోడించకపోతే పద్యప్రపంచానికి సూర్యాస్తమయమే అనేవాళ్లుగాని, పద్యరాగోభయప్రజ్ఞా ధురంధరులుగాని, వెయ్యేళ్ల ఆయుస్సు గల ఆంధ్రకవితాలోకంలోని ఉత్కృష్టభావసీమలు చూపించి ఆంధ్రులకి సంఘానందం కలిగించలేకపోయారు.

కాబట్టి పద్యంయొక్క సహజగమనం నిలబెట్టి, పఠనధర్మాలు పాటించి, బోధకత్వాన్ని మనస్సులో ఉంచుగుని, అనేకులు ఒకే క్షణంలో ఏకానందం పొందాలని కూర్చున్న సమయంలో తన యితర

ప్రజ్ఞాప్రకటనవిషయం దూరంగా పెట్టి కవియొక్క పదాల్లోని పర మార్థంవల్లే ఆనందం కలగాలనేమాట మరిచిపోక, కవియొక్క ప్రతిభ ఫలానాఅని జనానికి స్పష్టగోచరం అయ్యేలాగ చెయ్యడమే తన విధిగా పెట్టుగుని, కవి రాసిన యిక్కడిముక్క ఒకటీ అక్కడిచెక్క ఒకటీ మాత్రమే కాకుండా, వందలకొలదిగా పద్యరూపంలో ఉన్న భావాలు వీలైనంత అస్ఖలితంగా ప్రాణపదంగా జనంయెదట ప్రకటించి వాళ్ళని ఆకర్షించడానికి వెళ్ళిన పఠితకి రాగం అనేది యేమీ సాయపడదు సరికదా, ప్రతిబంధకంగాకూడా పరిణమిస్తుంది. అందువల్ల పద్యాన్ని దాని సహజగమనంతో ఉచ్చరించడమే ధర్మం, అని నా నమ్మకం. అట్లా ఉచ్చారణ చెయ్యడమే నా ఆచరణ.

---

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి

# ఆంధ్రనాటక పద్యపఠనం

అన్యత్వారోపణే ప్రధానాశయంగా ఉండవలసిన ఆంధ్ర సంగీత నాటక ప్రదర్శనాలలో పద్యభాగావిష్కరణ యొక్క అద్వితీయ విధాన సంప్రదాయం వల్ల ఆంధ్రావనిలో ఏర్పడి ఘనీభవించిన అభిరుచీ, దాని పుట్టు పూర్వోత్తరాలూ దాని ఔచిత్యా నౌచిత్యాలూ దాని ప్రయోజనానర్థాలూ దాని ధర్మమూ అని ఇతర రంగాలలో కూడా పద్యాలు వినబడే ముహూర్తాలలో ఛందశ్శాస్త్రానికి తటస్థిస్తూండే మరణావస్థా — మొదలైన సంగతులు సహేతుకంగా సోదాహరణంగా చర్చింపబడి, పద్యపఠనం పొందవలసిన రూపం సూచింపబడిఉన్న గ్రంథం 'ఆంధ్రనాటక పద్య పఠనం'.

---



బమిడిపాటి కామేశ్వరరావు

జననం: (పశ్చిమ గోదావరి అకివీడు) 30-4-1897, కాలేజివిద్య: కాకినాడ, రాజమహేంద్రవరం. బి. ఏ., 1918; ఎల్. టి. 1929, వీరేశలింగోన్నతపాఠశాలా ప్రధానోపాధ్యాయులుగ 1953 లో విరమణ. గణిత, వక్తృత్వ, కవిత్వపఠన, నాటకాచరణము లందు అభిమానులు, చమత్కార సారస్య రచనా ప్రవీణులు, సంభాషణలు, కథలు, ప్రసంగలు, వ్యాసములు (సుమారు 60) ప్రదర్శనములు (36) 29 సంపుటాలుగా ప్రకటింపించారు, 'త్యాగరాజు ఆత్మవిచారం' రచించారు. 'టాల్‌స్టాయ్ కథలు.' 'ఈసప్ కథలు' ఇటీవల వెలువరించారు.